


సంపుటము 25 | జూన్, 1948 | సంచిక 6

సర్వధారి వైశాఖము

# కళారాధన

●

శ్రీ వలివేటి బాలకృష్ణశర్మ

'మహాత్మాజీ! భగవంతుని సృష్టియందు మానవుని సృష్టి పొలిపోతుం దన్నావుగనక నీవు కళకు ప్రతికూలుడ వనుకోడానికి వీలవుతోంది.'

'మనుషులంతా ప్రకృతికోసం కళారాధన మానుకోవాలనా నీ అభిప్రాయం?'

—అని ఎదుర్కొన్న దిలీపకుమారరాయ్‌తో సంభాషిస్తూ మహాత్ముడు—బహుశా ఆవేశపూరితంగా—కొన్ని ప్రశ్నలకు చెప్పిన సమాధానంలోని 'అంతర్వాణి'—

వాయుపథమ్ములో వణఁకి వాలిన చల్లని మంచుతుంపురుల్
రేయిముసుంగుల్లో మెఱయు రెమ్మపడంతుల ఘర్మబిందువుల్
మాయు తమస్సులో మునిఁగి మూకతవోయిన మంచువాన కా
దోయి! మనోజ్ఞభావచలదూర్మికలన్ పయనించు సత్కవీ!
రాతిమెడందలోఁ బెనువిరాళిదుమారము రేఁచి చేతనా
చేతనముల్ చలింప విరచించెదు గీతిక లే ప్రపంచమం
దో తుదలేని యూహల ప్రతోళికలందు బికారివై సము
న్నీతగళానఁ బాడెదు కనీనికలన్ గనరాని యందముల్.

జగమున లేని యేకలువచానల కాపురముల్ దలంచియో
వగచెడి జాలిగుండె గలవాఁడ వనాదర మేలనో కవీ
పగిలిన గుండెతో వలపువానలు లేని యెడారినేలలో
రగిలిన పొట్టతో తరతరాలు కృశించిన ప్రాణికోటిపై.

కడచిన రేయి కాంతలను గానసుధాఝరులందఁ దేల్చి మా
మిడిచివురాకుజొంపముల మెక్కిన మైకములోన చంద్రికల్
గడపిన గండుకోయిలలకై పలవించెదవో కవిప్రభూ!
నడుమ నొకక్షణమ్ముడిగి నా కనుచూపుల జాడఁ జూడుమా.

కన్నకుమారు లాకలివికారమునన్ గనుమూయ నాలి వా
ల్గన్నుల నశ్రుధార లొలుకన్ చెడిపోయిన మానసమ్ముతో
నిన్నటి రాత్రి వేఁగి తన నెత్తుటఁ గ్రొత్తదనమ్ము లేనివాఁ
డున్న కెలంకులే నిలచియున్నవి నా కనుచూపుమేరలో.

భావకవిత్వతత్త్వపు దువారము లంబలి దేవురింపుకై
త్రోవలు సేయునా బ్రతుకు రోగముతో నగమైన మేనిలో
చేవలఁ దీర్చునా మధువు చిప్పిల నల్లిన భావగీతికల్
జీవము నిల్పుకో దిగులుసెందెడు ప్రాణికిఁ బద్య మేలొకో!

వేయివిధాలఁ బాడెదు కవిత్వపు పీథుల మందుకొండలో
దోయిలిఁబట్టి యప్పటికిఁ దోఁచిన వెఱ్ఱిపదాలఁ బాడుచున్
కాయముఁ దాల్చు భిక్షుకశిఖామణి చేసిన జీవయాత్రలన్ ;
ఆయవివేకి కన్నుఁగవ నశ్రులు రాల్చు విలేపికోసమై.

బీరనరాలలోఁ బరుగువెట్టెడి నెత్తురుకావిరంగులో
నీరసమైన జీవితము నిష్ఠురమై విలపించువాఁడు గం
భీరిమలోఁ దపించెడి నిమీలితపక్ష్మలమూర్తి వాని యా
కారపు బొమ్మ మెచ్చెదవు-కానియు రాల్పవు వాని చేతిలో.



# నిఘంటువుల కెక్కని పదములు

శ్రీ బులుసు వెంకటరమణయ్య

భాషాపరిజ్ఞానమునకును, వాఙ్మయపరిశీలనమునకును నిఘంటువులు నిధానములు. అట్టి నిఘంటువుల గ్రథనములో ఆంధ్రులు తగిన శ్రద్ధ చూపినట్లుగాని, చూపుచున్నట్లుగాని కనబడదు. దానికి ఇప్పటివఱకును వెలువడిన నిఘంటువాఙ్మయమే తార్కాణము.

శబ్దరత్నాకర మొక్క చేతిమీద వెలువడిన నిఘంటువు; పెక్కు గ్రంథములు లిఖితరూపములుగ నున్నపుడే యది వెలువడుట చేతను, ఇప్పటివలె నప్పుడు గ్రంథపరిశీలనమునకు దగిన సౌకర్యములు లేనందునను అప్పటిది యసమగ్రమైయుండుట సహజము. ఇక్క నారాయణీయము కేవల మాచ్ఛికపదములకొఱకై కూర్పబడినది. సూర్యరాయాంధ్రనిఘంటు రచనము గాని, ప్రకటనము గాని యింతవఱకు పూర్తికాలేదు.

ఆంధ్రనిఘంటువుల రచనకు పూర్వము వాని కాదర్శములుగ సంస్కృతనిఘంటువులు చాల వెలువడినవి. కాన మన నిఘంటుకర్తలు సంస్కృతసమ పదములను ఆ సంస్కృతనిఘంటువులనుండియే గ్రహించుచు, అచ్చికపదములను మాత్రము తమకు దోచిన గ్రంథములనుండి గ్రహించుచు వచ్చిరి. కాగా ఆంధ్రప్రబంధములయందు కానవగు తత్సమపదములు చాలవఱకును ఆంధ్రనిఘంటువులలో గానరాకున్నవి. కొన్ని పదములు సంస్కృతనిఘంటువుల కెక్కనివియు తెలుగు ప్రబంధములలో గలవు. మన నిఘంటువుల కెక్కని యచ్చతెలుగుపదములును ప్రబంధములయందు లెక్కకు మిక్కిలిగ నున్నవి.

మన నిఘంటుకర్తలు నిఘంటురచనకు పూర్వము వాఙ్మయమునందలి గ్రంథము లన్నింటిని బాగుగ బరిశీలించి, పదములను నిర్ణయించి, వానికి పట్టికను వ్రాసి, ఆమీద తమ కృత్యమును జరిగించుట యుచితము. కాని ఆ పద్ధతిని మనవా రవలంబించలేదు. కొన్ని సంస్కృతనిఘంటువులను, కొన్ని తెలుగునిఘంటువులను, తమ యభిమానపాత్రములగు కొన్ని గ్రంథములను మాత్రము ముందుంచుకొని మనవారు నిఘంటుగ్రథనమునకు బూనుకొనుటచే అవి సమగ్రములు కాలేకపోయినవి.

దేశకాలముల ననుసరించి పదములును, పదముల యుపయోగమును మాఱుట సహజము. కొన్ని సంస్కృతపదములు తెలుగున సహజమగు నర్థమును విడిచి యర్థాంతరమును బోధించుచున్నవి. అట్టివానికి సంస్కృతనిఘంటువులలోని యర్థములనే కాక, తెలుగున నుపయోగింపబడిన యర్థములను జూపుట యావశ్యకముగదా! కాని యా యర్థములు మన నిఘంటువులలో గానరాకున్నవి.

ఈ మీది యంశములకు దార్కాణముగ నిఘంటువుల కెక్కని కొన్ని పదములును, నిఘంటువులలో జూపబడని కొన్ని యర్థములును ఈవ్యాసమున జూపబడుచున్నవి. పయి పద, పదార్థములు మచ్చునకు 'పాండురంగమాహాత్మ్య'మునుండియే గ్రహింపబడినవి.

౧. ఆదికపి :

ఈ పదము శబ్దరత్నాకరమున లేదు; ఆప్టే పండితుని సంస్కృతాంగ్లనిఘంటువులోను లేదు. సూర్యరాయాంధ్రనిఘంటువులోని పెక్కు తత్సమపదములకు ఆప్టేనిఘంటువే యాధారమగుటచే ఆ నిఘంటువునకీ పద మెక్కలేదు. ఒకవేళ 'ఆదికపి' అనగా 'మొదటికోతి' అనియే యర్థమగుచో దీనిని ఏ నిఘంటువును ప్రత్యేకపదముగా జూప నక్కఱయే లేకపోయెడిది. కాని క్రిందిప్రయోగమునుబట్టి పయిపదమునకు

'ఆదిదేవుఁడను నర్థ మున్నట్లును, తోలిక్రోతి యను నర్థము ఈరెండ పొసగనట్లును తెలియుచున్నది—

'కాంచి విరించినందనుఁడు
కన్నులు విచ్చిటిగొంద డింది రొ
క్కించుక కొంకుదేటి కని
రెుక్ దరుదగ్రమహోగ్రదీప్తిలో
బంచముఖున్ శిఖీక్షణుఁ
భాసిలలాటు మరుజ్ఝరీధరున్
పంచితపక్వ్రపాంసువ
కంపదు వాదికపిన్ వృషాకపిన్.'

(పాండు. ౨-౧౯౦)

## ౨. ఉత్కోచుడు :

ఈ పదము నిఘంటువుల కెక్కినను 'లంచగొట్టు' అను నర్థమే యీయబడినది. ఆయర్థము కొన్నియెడల నుకురదు.

'వనితామానసమానసాయకుఁడు శ్రీ
మత్తాతపాదుండు భూ
జనసన్మానవిశుద్ధవర్తను డుదం
చత్త్యాగశీలుండు చం
ద్రుని పెన్నిద్ది సమగ్రకాంతిమహిమన్
నానాసుమీసాల లే
గొనబుంబ్రాయపు దేజమాన యతఁడు
త్కోచుండు వాచాలతన్.'

(పాండు. ౩-౬)

ఇచట వాచాలతయం దుత్కోచు డనగా కడు దిట్ట యనిగాని, నేరుపరి యనిగాని యర్థము పొసగును. వాచాలతయందు 'లంచగొట్టు' అనునర్థము కుదురదు గదా !

## 3. ఉత్పిబము :

ఈ పదము శబ్దరత్నాకరమునగాని, ఆప్టే సంస్కృతాంగ్ల నిఘంటువునగాని లేదు; కావున నిది సూర్యరాయాంధ్రనిఘంటువున చేర్పబడలేదు. వర్షాకాలవర్ణనసందర్భమున నీ పదము సీసపద్యపు టెత్తుగీతిలో నిట్లు ప్రయోగింపబడినది.

'ఉత్పిబం బల భుక్తిగా నుష్ణతైల
పక్వగుడమిశ్రపిష్టనూపపరమాన్న
రాసు లొసగంగనగు గారు రాక పారిక్
నట్టి బుతుధర్మములు చూపు నందమొంద.'

(పాండు. ౨-౧౧౦)

పయిసందర్భమును బట్టి 'ఉత్పిబము' అనగా 'చాతకము' అని యర్థమని గ్రహింపవలెను. 'నీటిని త్రాగునది' అను దీని యవయవార్థమును ఈ యర్థమున కనుకూలమే యగును.

## ౪. కదారపటుడు :

పయిపదము శ. ర. లోగాని, ఆప్టేలోగాని, సూర్యా.లోగాని లేదు. 'కదారపటుడు' అనగా 'పీతాంబరుడు' అని యర్థము. ఈ పదమును నిఘంటువులు గ్రహింపనిచో అర్థమగుట కష్టము. ఈ క్రింది ప్రయోగమును గమనింపుడు :

'అనవుడు నట్ల వచ్చి కమ
లాసను డా శమశాలి బల్కె 'నో
మునివర ! నీవు నేయు తప
మున్, జపమున్ జెరచేవ నెల్లి చే
టన భవదగ్రవీథికి,గ
దారపటుం డిట వచ్చుమున్నె యా
యన నిను గేలి సేఁడు చరి
తార్థుడ వీవు చతుర్థసంపదన్.'

(పాండు. ౪-౬౧)

## ౫. కాళిక :

పయిపదమునకు 'దుర్గ' అనునర్థమమాత్రము తెలుగునిఘంటువులలో నీయబడినది. కాని యీ యర్థమే కాక దీనికి 'కాలిమబ్బు' అను నర్థమున్నట్లు సంస్కృతాంగ్లనిఘంటువు (ఆప్టే) చెప్పుచున్నది. 'black cloud threatening rain' అని అందు ఆంగ్లమునను అర్థ మీయబడినది.

'రజతాద్రికూటగర్జత్కాళికాకృతి
బృహదంసమున నిడ్డ మహతి పలుక'

(పాండు. ౨-౧౩౨)

అను నారదమహర్షిని వర్ణించు సీసపద్యపాదమున గల 'కాళికా' పదమునకు 'కాలిమబ్బు' అను నర్థమే కుదురునుగాని 'దుర్గ' యనుట కుదురదు.

౬. కాసూధరుడు :

కాసువు కుమారస్వామియాయుధమగు శక్తి. కాసూధరు డనగా 'కుమారస్వామి' అని యర్థము. కాని యీ పదము నిఘంటువులందు గానరాదు.

'కని యేకారణ మేగుదెంచెనొకొ యీ
 కాసూధరుం డీ మునుల్
కన జిత్రంబగు ;............'

(పాండు. ౨-౧౮౦)

అను పాండురంగమాహాత్మ్య పద్యభాగమును బట్టి యీ పదము కవిప్రయుక్తమయి కానవచ్చుచున్నది. ఇచట ముద్రితప్రతిలో 'కాసూధరుండు' అనుటకు బదులు 'కామాధరుండు' అని యున్నది. నిఘంటువులలో ఈ పదమే యున్నయెడల అట్టి తప్పులను సవరింప వీలుపడియుండెడిది కదా!

౭. క్షుల్ల కాశిక్యము :

'క్షుల్లకము, శిక్యము' అను రెండు పదములే నిఘంటువులలో గన్పడుచున్నవి. దానినిబట్టి 'క్షుల్ల కాశిక్యమనగా 'చిన్న చిక్కము' అనిమాత్ర మర్థమగుచున్నది. కాని గోపబాలురు మొలనూలికి గట్టుకొని యుండు 'జాలెసంచి'యే ఈ క్షుల్లకాశిక్యము. ఈ యంశమును—

'అని సింహంబున కల్గు నక్కక్రియ ని
 ట్లాక్షేపముల్ పల్కి, యు
ద్ధతజాం డంతకదండభీమగదా
 దండంబునన్ ద్రెంచి వం
చన దూలించె దశాగ్రసాధనము గం
 ధర్వంబిసి; తద్ఘోరతా
డనవేగంబున భగ్నమయ్యె గటి వే
 ల్లత్ క్షుల్లకాశిక్యమున్.'

(పాండు. ౫-౧౦౮)

అను పద్యము తెలియజేయుచున్నది.

౮. కుడిదలు :

'కుడిద' పదము తెలుగునిఘంటువులలో గానరాదు. 'కాపుర మున్నవారు' అని దీని యర్థము.

'ఈరీతి గొంతకాలము
ప్రారగతిన్ పోకమాక కుడిదలయాగుల్
గారింపగ............'

(పాండు. ౫-౧౨౯)

అను పద్య మీ యర్థమున బ్రమాణము.

౯. గాంగేయగర్భుడు :

పయిపదము సంస్కృతాంధ్ర నిఘంటువులలో లేదు. 'హిరణ్యగర్భుడు, బ్రహ్మ' అని దీని యర్థము. 'హిరణ్యగర్భ'నిమంటి సమస్తపదములను బ్రత్యేకపదములుగా గ్రహించు నిఘంటువు లీ పదమును విడుచుట పాడిగాదు. పయిపదమునకు 'బ్రహ్మ' అను నర్థము తటాలున స్ఫురింపదు. కావున నియ్యది నిఘంటువులలో దప్పక చేర్పదగియున్నది.

'కనకట్టి గాంగేయగర్భ దాగురుమాత
 లాడించె వస్త్రాపహరణవేళ—'

(పాండు. ౩-౧౪౮)

అను సీసపద్యపాదము పైవిషయమునకు బ్రమాపకము.

౧౦. చంద్రగోళి :

'చంద్రగోళి' అనగా 'వెన్నెల'. ఆప్టేనిఘంటువులో 'చంద్రగోళికా' పదమే యీ యర్థమున గలదు. సూర్యా.నిఘంటుకారులు ఆంధ్రప్రబంధములను చూడక ఆప్టేలో నున్నట్లు 'చంద్రగోళికా' పదమును మాత్ర మిచ్చి యూరకుండిరి.

'రసప్రసాదంబు భక్తవరేణ్యదుర్గతి
 ఘాళలోచిత చంద్రగోళి యనగ'.

(పాండు. ౫-౨౮)

అను పద్యభాగము వెన్నెల యనుటకు 'చంద్రగోళి' అను పదమును వాడుట గమనింపదగినది.

౧౧. చాగు :

పయిపదమునకు 'భళీ!' అను నర్థము కల దని 'చాగు! మదమందగమనలక్షణములు' (పాండు. ౧-౧౧౪) అనుదానివలన దెలియుచున్నది. ఈ యర్థము నిఘంటువులలో గానరాదు.

౧౨. జనాంతికపదమ్ము :

'ఏకాంతభూమి' అను నర్థము మీది పదమున కవయవములబట్టి కలిగినను 'అంతఃపుర' మనుటయే మేలని 'సకలవాహినులకు జనాంతికపదంబు' (పాండు. ౩-౧౪౨) అను పద్యభాగమునుబట్టి తెలియుచున్నది. ఈ పదము నిఘంటువులలో గానరాదు.

౧౩. తంత్రులు :

ఈ పదము శ.ర.లో మాత్ర మున్నది. కాని 'సేనానాయకులు' అనికాని, 'రాజ్యతంత్రవేత్తలు' అని కాని యర్థ మచట ఈయబడలేదు.

'చేతులం ద్రిప్పుచున్ బ్రభుల
చెంతల నూరక దుర్వినీతులై
యేతుల బోవుచుం దిరుగు
నిప్పటి మంత్రులు తంత్రు లిందఱున్.'
(పాండు. ౧-౪౩)

అను పద్యభాగము మీదియర్థములకు సాధకమయియున్నది. అట్టే యీ పదమును గ్రహింపనందున సూర్యా.లో ఇది లేకుండుట వింత కాదు.

౧౪. తత్తాదృశము :

తత్తాదృక్ఛబ్దము నే నిఘంటువును ఇచ్చియుండలేదు. దీనికి 'సాటిలేనిది; అసమానము' అని యర్థము. 'దానిని బోలిన అది' అను నవయవార్థము కూడ నీ యభిప్రాయమునకు సమర్థకమగుచున్నది.

'మీఁదం దారధరాధరంబు గల య
ట్మొరుచున్నకంజాలు త
త్తాదృక్తుందరుచిం దలిర్చు ఖగయా
తస్వామి.........'
(పాండు. ౧-౭)

అను పద్యభాగము దీని కుదాహృతి. ఈ పదమును శ్రీనాథాదులును వాడిరి.

౧౫. సీటికెంపు :

కౌస్తుభమే సీటికెం పని—

'కైటభవైరి యావలకి
భామిని శ్రీపతి పేరురంబునన్
మఱియును, సీటికెంపు బహు
మానముగా బదకంబు సేయదే!'
(పాండు. ౧-౧౩)

అను పద్యభాగమునుబట్టి స్పష్ట మగుచున్నది. ఈ పదము తెలుగునిఘంటువులలో గానరాదు.

౧౬. పల్లవగ్రాహి పాండిత్యము :

ఈ పదమునకు 'చిగుళ్లు గ్రహించునది' అనునది అవయవార్థము. కాని 'కొనలమాత్రము గ్రహించునది; మీదమీద మాత్రము గ్రహించునది; కలపూర్ణము కానిది; గాఢమగు జ్ఞానము లేనిది' అను నర్థము రూఢమైనదియు గలుగును. ఈ పదము నిఘంటువులలో గానరాదు. కాని ప్రయోగములందు ప్రసిద్ధము. చూడుడు :

'క్షీరకంఠంబు లని బ్రహ్మవారవముల
గెంటసంబాడు వడగల్గు కిసలయోష్ఠి
సుస్వరము లెక్కగను నోటు మూపి నిత్య
పల్లవగ్రాహిపాండిత్యపరభృతములు.'
(పాండు. ౩-౧౯౩)

౧౭. ప్రస్తుతము :

పయిపదము శ. ర. లో నున్నను 'ఉపనయనము, వివాహము, తిథి మున్నగు 'విశేషము' అను నర్థము ఈయబడలేదు. 'నేడు మాయింట విశేషము' అను నర్థమున 'ప్రస్తుతము' అని ప్రయోగించుట ఆంధ్రుల సంప్రదాయ మగునట్లు—

'ప్రస్తుతంబని పదార్థముల రాశుల వేసి
కొనివచ్చి యమ్మిందు గోమటిండ్ల'.
(పాండు. ౪-౧౪౯)

అను ప్రయోగము తెల్పుచున్నది.

౧౮. ఫలోదయము :

పయిపదమునకు 'స్వర్గము' అని యర్థము. 'స్వర్గః ఫలోదయః' అని వైజయంతీనిఘంటువున కలదు. ఇది తెలుగునిఘంటువులలో లేదు. ఆప్టే యందును ఈ యర్థము కానరాదు.

'వియచ్చరధేనువు కేలినవాని ఫలి సఫలంబు చేసి ఫలోదయుంబు నలంకరించె' (పాండు. ౫-౨౬౫)

అని ప్రయోగింపబడుట గమనింపనగు.

౧౯. బ్రహ్మగర్భుడు :

కుమారస్వామికి ఈ పేరు కలదు.

'బ్రహ్మగర్భుండు నిష్ఫలబ్రహ్మవిద్యోపదేశ దేశికుం డనియును—'

(పాండు. ౧-౧౮౩)

'బ్రహ్మ' అనగా శివుడు; కాన 'బ్రహ్మగర్భుడు' అనునది కుమారస్వామివాచకమగుట ఉచితమే. కాని యీ పదము సంస్కృతాంధ్రనిఘంటువులలో గానరాకున్నది.

౨౦. భుజాభోజనము :

పయిపదము నిఘంటువులలో గానరాకున్నది. సమృద్ధమగు మృష్టాన్నపు భోజనము; లేదా, విందుభోజనమే యీ భుజాభోజనము. దీనినే వ్యవహారమున 'బుగాభోజనము' అను వాడుక ప్రసిద్ధమైయున్నది. కవుల ప్రయోగములలో ఈ పదము కలదు.

'వ్రజ భుజాభోజనముల క్రొంబంటవంట
కములు గావింప—'

(పాండు. ౨-౧౧౧)

౨౧. మధ్యవృత్తము :

అనగా నాభి; ఈ పదము ఆప్టేనిఘంటువులో నున్నది. శ.ర.లో లేదు.

'దర్శితమధ్యవృత్తప్రసక్తమగునీవి
యప్రయత్నపయోధరాంబరంబు.'

(పాండు. ౧-౧౨౯)

అను ప్రయోగమునుబట్టి పయిపదము నిఘంటువుల కెక్కవలసియున్నది.

౨౨. మరుత్ఫలము :

మరుత్ఫల మనగా ఇంద్రధనుస్సు; ఇంద్రధనుస్సునకు 'నాకుఫల' మను పేరు నిఘంటువులం గొన్నిట కలదు; ఆ పేరికే 'మరుత్ఫలము' గా రామకృష్ణకవి—

'అటుకు మెచ్చి బలారి యీగోను మరు
త్ఫల మిది యన బచ్చెవార మమర—'

(పాండు. ౧-౧౬౧)

అని వాడియున్నాడు. 'మరుత్ఫల' పదము ఆప్టేనిఘంటువునం దున్నను, 'ఇంద్రధనుస్సు' అను నర్థము మాత్రము అచట లేదు; శ. ర. లో ఈ పదమే లేదు.

౨౩. మీఁదుగడ :

పయిపదము తెలుగునిఘంటువులలో లేదు. మీఁదుకట్టుట; ముడుపుగా గట్టుట; దాచియుంచుట అని యర్థము. ఈ యర్థమున కనుకూలముగ నీ క్రిందిప్రయోగము కానవచ్చుచున్నది.

'ఏన దర్యోధనుగా లేమి యప్పటికిని
మీఁదుగడ గట్టనేలంచు మించుబోడి'.

(పాండు. ౪-౧౬౩)

౨౪. ముయ్యాళ్డు :

పయి పదము నిఘంటువులలో గానరాదు.

'గోమున శిరసుచు ముయ్యాళ్
డై మెలగుచు గర్భవైష్ణవాగ్రేసరుతా
నా ముద్దుకొమరులం గని
కామిని దీపించె............'

(పాండు. ౪-౨౬౧)

అను ప్రయోగమునుబట్టి గర్భాద్యవస్థలలో మూడవదగు కౌమారావస్థయే యీ 'ముయ్యాళ్డు'.

౨౫. ఱాతికోడుకు :

ఱాతికోడు కనగా కప్ప; ఈ పదము నిఘంటువులలో గానరాదు.

'ఱాతికోడుకైన యిల్వలారాతి చట్టు'.

(పాండు. ౫-౩౧౪)

అను ప్రయోగ మీ విషయమునకు సాధకము.

**౨౬. వరుణదంతావళము :**

పయిపదమునకు జలాధిదేవత యగు వరుణుని యేను గనునది అన్వయార్థము; కాగా 'కప్ప' యని దీని యర్థము. ఈపదము నిఘంటువులలో లేదు. కాని రామకృష్ణకవిమాత్రము

'సర్వతీర్థప్రదేశప్రశస్తకతికి
గాంచి దవుఁదట ధ్వన కర్ణ్వమంచు నొక్క
తవులువడియుండె వరుణదంతావళంబు
వసతి యురికెత్తి మెడచుట్టు బసిడిరశన.'
(పాండు. ౫-౩౧౦)

అని ప్రయోగించియున్నాఁడు. ఇది నిఘంటువులలో జేర్పదగినది.

**౨౭. వార్మణి :**

కౌస్తుభ మని యర్థమును దెల్పు పయిపదము నిఘంటువులలో గానరాకున్నది. రామకృష్ణకవి—

'వార్మణిధారి యుత్తరపు
వాకిట నిల్చినవాఁడు కాపుగన్.'
(పాండు. ౫-౨౫)

అని ప్రయోగించియున్నాఁడు. వార్మణిధారి యనగా కౌస్తుభమును ధరించిన విష్ణువని యర్థము. ముద్రితప్రతిలో 'వార్మణధారి' యని యుండుట పొరపాటు.

**౨౮. శంపాధరము :**

పయిపదమునకు 'మేఘము' అని యర్థము. ఈ పదము నిఘంటువులలో లేదు. ఈ పదము ఈయర్థము నందు—

'రాధాసంగమ ముదితుని
మాధవు గని యోటుపడిన మాడ్కి దరలె శం
పాధరము; తనదు వర్ణము
బాధితమగుఁ గాని తెలుపు బాలు ఘనుండున్'.
(పాండు. ౪-౩౫)

అని ప్రయోగింపబడియున్నది.

**౨౯. శ్రావమూకము :**

'గంజికొఱకగు మూకుడు' (గంజిమూకుడు) అను నర్థమున గల యీ పదము నిఘంటువులలో లేదు. రామకృష్ణు డీ పదమును—

'అనుటయు సంభ్రమం బడర
నంగన లొత్తిలి నాటి యామినిం
దనకని వండి డించికొని
నాథుఁడు పల్లియ కేగ నెంజలిం
దనికి భుజింపకున్కి ధరి
తంబయి యట్టుకసట్టుకట్టి రొ
మ్మౌ నఖినవౌదనం బోసగ
బూని తదాజ్ఞను శ్రావమూకటన్'.
(పాండు. ౪-౧౬౩)

అని యుపయోగించియున్నాఁడు.

**౩౦. సిగబంటి :**

పయిపదము నిఘంటువులలో లేదు. తృప్తికర ముగ భుజించెనని చెప్పునపుడు 'అకంఠంబుగ' అను నర్థమున 'పీకమొయ్యాక' అను వాడుక ప్రసిద్ధము. సిగ బంటిగా తినుట అను వాడుక యున్నట్లు—

'భుజియించె ద్విజ భుజాభోజనంబుల సిగ
బంటిగా దొలుక్రొత్తవంటకములు'.
(పాండు. ౪-౪౪)

అను ప్రయోగమువలన దెలియుచున్నది.

ఇట్టి ప్రయోగము లింకను ఎన్నియేని గలవు; ఒక్క ప్రబంధమునందే ఇక్కడ మిక్కిలిగ క్రొత్త పదములు, అర్థములును లభించినపుడు ప్రబంధము లన్నింటిని పరిశీలించిన ఎన్ని లభించునదియు విజ్ఞులు గుర్తింపకపోరు.

ఈరీతిని పరిశీలించినచో మహాభారతము నందును—అందును నన్నయభాగమునందు గల పదములే—నిఘంటువుల కెక్కనివి చాల కలవని నిశ్చయముగా చెప్పగలను.

---

# సాహిత్యంలో పరిణామ వివర్తాలు

## శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులు

వేదశాస్త్రపురాణేతిహాసాలు మానవునికి ధర్మప్రవృత్తి కల్గించటంలో సాధనాలు. అలాగే సాహిత్యమూను. ఈ విషయాన్నే లాక్షణికుడు "కాంతాసమ్మితతయోపదేశయుజే" అన్నప్పుడు చెప్పినది. మిగిలినవి ప్రభుసుహృత్సమ్మితాలైతే, కావ్యం కాంతాసమ్మితం. ఇందులోనే ఉన్నది కావ్యవిశిష్టత. ఎందుకంటే, కాంతాసమ్మితము కావటంచేత కావ్యం ఆనందం కలగచేయటం మూలంగా ధర్మం బోధిస్తుంది. ప్రభుసమ్మితమైతే భయంవల్ల ధర్మప్రవృత్తి కలుగుతుంది. సుహృత్సమ్మితమైతే మైత్రివలన ధర్మప్రవృత్తి కలుగుతుంది. ఈ రెండిటికీ అంతరాయం రావచ్చును. ప్రవృత్తి సార్వకాలికం కాకపోవచ్చును. కాని సాహిత్య మలా కాదు. కావ్యపఠనంవల్ల ఆనందం కల్గి, తద్వారా ధర్మప్రవృత్తి కలగటంవల్ల ఆ ప్రవృత్తి సులభసాధ్యమూ, చిరస్థాయీ కావటానికి అవకాశం ఉన్నది. ఎలాగైతే ప్రియురాలి రమణీయవాక్యాలు హృదయాన్ని ద్రవింపచేసి ప్రియుని హృదయాన్ని చూరగొని స్వాధీనపరచుకుంటవో అలాగే కావ్యమూకూడా రమణీయవాక్యసముదాయంద్వారా హృదయాన్ని స్వాధీనపరచుకొని ధర్మాన్ని అక్కడ చిరస్థాయి చేస్తుంది.

ఇక్కడ ఒక విశిష్టత ఉన్నది. వేదశాస్త్రపురాణేతిహాసాలు అర్థవాదలద్వారా, ఉపాఖ్యానాలద్వారా ధర్మప్రవృత్తి కల్గిస్తవి. ఈ అర్థవాదలు, ఉపాఖ్యానాలు కర్మయొక్క, శీలముయొక్క ప్రాశస్త్యాప్రాశస్త్యాలను మనకు పట్టునట్టు బోధించి ధర్మప్రవృత్తి కలుగజేస్తవి. కర్మయొక్క ప్రాశస్త్యం మనకు తెలిసినప్పుడు దాన్ని ఆచరించాలనని మనకు ప్రవృత్తి కలుగుతుంది. అలాగే అప్రాశస్త్యాన్ని తెలుసుకున్నపుడు ఆ కర్మ నిషిద్ధమని మనకు తెలిసి దానియందు ప్రవృత్తి కలుగదు. రామాయణగాథ చదివినపుడు పరస్త్రీకాంక్ష తప్పని తెలుసుకొని అట్టి పనిని ఆచరించము. హరిశ్చంద్రోపాఖ్యానాన్ని చదివినప్పుడు సత్యం పలకటంలో ఉన్న విశిష్టతను తెలుసుకొని సాధ్యమైనంతవరకు అసత్యాన్ని విసర్జిస్తాము. కాబట్టి పరస్త్రీకాంక్ష కూడదు, ఎల్లప్పుడూ సత్యాన్నే పలకవలెను అనే శీలసూత్రాలకు ఈ రెండు కథలు అర్థవాదలు.

ఈవిధంగానే ధర్మప్రవృత్తికి సమస్త సాహిత్యము అర్థవాదాత్మకం. ఏ ఉదాత్తవస్తువునైనా గ్రహించండి. అది అర్థవాదాత్మకంగా కనపడుతుంది. మహాభారతాన్ని తీసుకోండి. జ్ఞాతివైరం నాశహేతువని మహావాక్యతాత్పర్యం. దానిలో మళ్లీ కీచకవధ వంటి అవయవవాక్యాలున్నవి. వాటికి మళ్లీ కొన్ని ధర్మాలను బోధించటంమూలంగా అర్థవాదత్వమే. పరస్త్రీవాంఛ కూడదు; దానివలన నశించటం తథ్యం అనేది కీచకవధ బోధిస్తుంది. దాదాపు సాహిత్యంలో ఉన్న సమస్తశృంగారవస్తువూ ఏకపత్నీత్వాన్నీ, సంపూర్ణగార్హస్థ్యధర్మాన్నీ బోధిస్తవి. మనుచరిత్రవస్తువును గ్రహించండి. ప్రవరుడిని గూర్చి కవి వ్రాసిన మాటలు చూడండి. వాటిని ప్రవరుడి నోటితోనే చెప్పించాడు. "దావజపావకహోత్రపరతంత్రుడనేని, భవత్పదాంబుజధ్యానరతుండనేని, పరదారధనాదుల గోరనేని" అని చెప్పటంలో ప్రవరపాత్రను లోకాదర్శంగా చిత్రించాడు. వరూధినీపాత్రనుకూడా చాలా ఉదాత్తం చేశాడు. "తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథాభరవివశాంగిన్" అని చెప్పటంలో ఆమెకూడా పరప్రవృత్తి కలదిగాక 'అనన్యకాంత' అయినది. ఆమె ప్రేమకూడా ఒక్క ప్రవరుడిమీదే లగ్నమై ఉన్నది. తర్వాత మాయాప్రవరసంగమంకూడా ఆమెకు దోష

లోపణ చేయడానికి అవకాశం కల్పించడం లేదు. ఈవిధంగా ఉత్తమకావ్యవస్తువంతా ధర్మప్రవర్తకం కావటం మూలంగా అర్థవాదత్వం పొందుతూ ఉన్నది.

ఇక్కడ ఒక్క విషయాన్ని ఉల్లేఖిస్తాను. కొందరు ప్రభావతీప్రద్యుమ్నంలాంటి ఉత్తమ కావ్యంలోఉన్న శృంగారం కేవలదైహిక మనీ, నీచ మనీ అంటున్నారు. ప్రభావతి ప్రద్యుమ్నసంగమం కోసం ఉవ్విళ్లూరుతున్నప్పుడు ఆమె పల్కే పల్కులూ, తత్సంగమంకొరకు సమస్తకార్యకలాపం నిర్వర్తించటమూ మొదలైనవి చూస్తే ఏ వేశ్యకూడా అంత నీచంగా మాటలాడి ప్రవర్తించదని కొందరు అంటున్నారు.

ఈ వాదాన్ని కొంచెం పరిశీలింతాం. ప్రభావతీప్రద్యుమ్ను లెవరు? ప్రియులు; నలదమయంతుల వంటివారు. ఏ ఇతరులను ప్రేమించారా? లేదు; అన్యోన్యప్రియులు. వారి ప్రేమ పవిత్రప్రేమ. వేశ్య లెట్టివారు? వారికి బహుపతిత్వం కులధర్మం. బహుపతిత్వం కులధర్మంగా ఉన్న వేశ్యలను ఏకపతివ్రతలైన ప్రభావతీత్యాదులతో పోల్చనేకూడదు. వేశ్యను నాయికగా చేస్తే తత్కులధర్మాన్ని ఉల్లేఖించవచ్చును. ప్రియసమాగమాన్ని వేశ్య యెందుకు కోరుతుంది? ఆమెకు ధనవాంఛే గాని ప్రియవాంఛ ఎందుకుంటుంది? ప్రియుడితోకూడ మంచిచెడ్డలలో భాగస్వామిని కాగోరే పతివ్రతకు ప్రియాశేగాని ధనాశ యెందు కుంటుంది? నలదమయంతుల ఉదంతం జ్ఞాపకం చేస్తున్నాను. ప్రియాశ లేనప్పుడు వేశ్య ప్రియసమాగమా న్నెందుకు కోరుతుంది? అందుకు సామగ్రి నెందుకు సేకరిస్తుంది? కులస్త్రీలకు ప్రభావతివంటి నాయికాశీలం నచ్చుతుంది. కులటాశీలంగాని, వేశ్యాశీలంగాని నచ్చదు.

ప్రభావతీవాక్యాలను కొంచెం పరిశీలింతాం. "ప్రద్యుమ్నుని ఆలింగనం చేసుకోని యీ బాహువుల వలన ప్రయోజన మేమి?" అన్నది. ఇక్కడ ఆలింగనవాంఛ ద్యోతిత మౌతున్నది. ఎవరిని? ప్రద్యుమ్నుని. ఆయన ఎవరు? ఆమె ప్రేమించిన ఏకైకనాయకుడు. ఆయనఆలింగనాన్ని కోరకుండా యెవరి ఆలింగనాన్ని కోరమంటా డీ విమర్శకుడు? అసలు ఆలింగనాన్నే కోరవ ద్దంటాడా? ఒకవేళ అభిలాష ఉన్నా వెలిబుచ్చవ ద్దంటాడా? ఆయనఅభిప్రాయ మేమిటో తెలియడములేదు. ఒకవేళ చదవడానికి లజ్జాకరంగా ఉన్నదని ఆయనఅభిప్రాయము కాబోలు! కావ్యంలో భావాన్ని వెలిబుచ్చకూడ్దా? చదువరులకు కుబుద్ధులను కలుగజేయు నని యీ విమర్శకుడి అభిప్రాయమా? వీటి పఠనం యెట్టి చిత్తవృత్తిని పాఠకులలో కలుగజేస్తుంది అని ఆలోచింతాం. పఠించేది స్త్రీ అయితే తాను ప్రేమించిన పురుషునియెడల అనురూపవర్తనవాంఛ కలుగుతుందికదా? పురుషు డైతే తన ప్రియురాలిని ఊహించుకుంటాడుకదా? దీనిలో విప్రతిపత్తి యేమున్నది? ప్రభావతీప్రద్యుమ్నపఠనంచేత అన్యథా ఊహ కల్గే పాఠకలోకాన్నిగూర్చి నే నేమీ చెప్పదలచలేదు. అటువంటివారి చిత్తవృత్తిని భగవంతుడే మార్చవలసియున్నది. వేదాంతశాస్త్రపఠనంగాని, ఏమతగ్రంథపఠనంగాని వారి చిత్తవృత్తిని ఈషణ్మాత్రమూ మార్చలేదు.

పరస్పరప్రేమ గల, అనన్యచిత్తులైన స్త్రీపురుష సంగమం గార్హస్థ్యపరిణామం. "ప్రజార్త్యై గృహమేధినాం", "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహే" అనే వాక్యాలకు లక్ష్యభూతం. ఇటువంటి శృంగారమే ఉత్తమశృంగారం. ఇట్టి ఉత్తమశృంగారాన్ని కవులు కొనియాడి ఉగ్గడించా రంటే ఆశ్చర్యం యేమున్నది? అందుకనే శృంగారం సత్వరసబీజభూతమని లాక్షణికులు వచించింది.

వర్ణనలో రెండు విధాలు కనుపిస్తవి. ఒకటి వాచ్యం; రెండోది వ్యంగ్యం. తప్పకుండా వ్యంగ్యమే రెండింటిలో ఉత్తమం. అంతమాత్రాన రెండోదాన్ని నిరసించటానికి వీలు లేదు. వాచ్య మన్నంతమాత్రాన కావ్యత్వహాని లేదు. రెండు పద్ధతులూ అవలంబించి కవి మనకు ఆనందం కలుగజేస్తాడు. మొదటిది మన అనుభవతంత్రిని మోగించటం. కవివర్ణన మన అనుభవానికి సరిపోయినప్పుడు మనకు ఆ అంశం ఆనందం కలుగజేస్తుంది. ఇది బహిర్మార్గం. ఒక సన్నివేశాన్ని

కల్పించి మనకు దానిలో ప్రత్యయం కల్గించి తరువాత మనలను తనవెంట లాక్కుపోతాడు కవి. ఇది రెండో మార్గం. ఇది అంతర్మార్గం. గజేంద్రమోక్షం తీసుకోండి. నక్రగజాలకు పోరాటం కల్పించాడు. దానిలో మనకు ప్రత్యయం కల్గింది. గజేంద్రుడు "నీవే తప్ప నితఃపరం బెరుగ" అన్నాడు. ఈ మొర వైకుంఠంలో ఉన్న విష్ణువు చెవులకు తగిలింది. అక్కడినుంచి మనను కవి వైకుంఠప్రవేశం చేయించి గబగబ సినిమా రంగంలో మార్చినట్టు జరిగిన సంగతులను చూపి ఆనందం కలుగజేశాడు. రెండవ పద్ధతికి ఒక ఉదాహరణం.

ఆధునికులు అశ్లీలంగా దూషించే శృంగార వర్ణనను గూర్చి కొంచెం ముచ్చటిస్తాను. శృంగారాన్ని నీచం చేసి, దానియందు జుగుప్స కల్పించి మనను అట్టి శృంగారంనుంచి విముఖులను చేయటం అట్టి కావ్యాలలో కవియొక్క ఉద్దేశ్యం. కావ్యంలో వస్తువు మూలంగా మనఃపరిణామం కల్గించి, సరియైన మార్గాన ప్రవర్తించమని పురికొల్పి, దాన్ని ఆనందమూలంగా బోధించి ధర్మప్రవృత్తి కలుగజేయటం ఒక మార్గం— మన కవులు అవలంబించింది. ఇది పరిణామమార్గం. అలా గాక దుర్వర్తనంచేత క్రమపతనం సూచించి, మనకు అట్టిపతనంనుంచి వైముఖ్యం కల్గించి, జుగుప్స మూలంగా ధర్మోపదేశం చేయటం రెండోమార్గం. దీన్ని వివర్తమార్గ మందాం. ఈ రెండు మార్గాలూ అన్యోన్యాశ్రయాలుగాకూడా ఉండవచ్చు. రామాయణం తీసుకోండి. 'రామవ ద్వర్తితవ్యం; నతు రావణవత్' అనేది రామాయణబోధ. ఇందులో రెండు మార్గాలూ సమ్మిళితాలై ఉన్నవి. రెండూ ఒకదాని ప్రక్కన ఒకటి ప్రవహిస్తూ రెండిటిలోనూ ఉన్న భేదాలను చూపుతూ, రెంటి పరిణామాలనూ రసవంతంగా చెప్పటంచేత మనకు రెంటియొక్క తారతమ్యం తెలిసి మన ప్రవర్తనను దిద్దుకుంటాము.

చిల్లర ఉదాహరణలను తీసుకుంటే ప్రవరాఖ్య కథావస్తువు పరిణామానికి ఉదాహరణం. పాండురంగ మాహాత్మ్యములో నిగమశర్మోపాఖ్యానం రెండో మార్గానికి ఉదాహరణం. తత్త్వం చెప్పవలసివచ్చినపుడు రెండో మార్గం చాలా ఉపకారకం. వేమన యోగి అవలంబించిన మార్గ మిదే.

స్వానుభవంవల్ల మన శోక విషయం గోచరిస్తుంది. చెడు మార్గంలో ప్రవర్తించినవాడికి పోగా పోగా చిత్తవృత్తికి వైముఖ్యం ఒక్కమారుగా కలిగి అప్పటినుంచి వెనుకటి దుష్టఫలాన్ని జ్ఞానంచేత భస్మం చేసి భగవదనుగ్రహం పొందుతాడు. తొండరడిప్పొడి యాళ్వారు, లీలాశుకుల చరిత్రలవలన ఈ విషయం మనకు గోచర మౌతుంది. ఇవి వివర్తమార్గానికి ఉదాహరణాలు. ధూర్జటిచరిత్రకూడా ఇందుల కుదాహరణం. మన ఆధునికులలోకూడా విశృంఖలవర్తనం కలవారు 'ఏక్‌దం' తల్లకిందుగా భక్తులైన దృష్టాంతా లున్నవి. వేదాంతంలో ఎలా ఈ రెండు మార్గాలు ఉన్నవో అలాగే సాహిత్యంలోకూడా యీ రెంటిని మనం ఏర్పాటుచేసుకోవచ్చును. ఈ రెండు మాటలద్వారా ఉపదేశం కావ్యప్రయోజనం. ఆ ఉపదేశం ఆనందంద్వారా కలుగుతుంది. ఆనందానికి రసాలు సాధనాలు. ఈ రసాలకు వెనుక ఉండే స్థాయీభావాలు మానవుడిలో బీజభూతాలుగా ఉన్నవి.



# సాంబోపాఖ్యానము

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

ఆంధ్రసాహితీమాత సౌభాగ్యకావ్యభూషణములచే నారాధించి యఖండయశ మార్జించిన కవిరాజులలో నుత్తమశ్రేణికి జెందిన రాజకవి రామరాజు రంగప్పరాజు. ఈతడు నిఖిలవిద్యానిధాన మగు విద్యానగరముననే విజయనగరరాజులకు సామంతుడు, బంధువు నై 'సాంబోపాఖ్యాన' మను నైదాశ్వాసముల యద్భుతప్రబంధమును రచియించి విజయనగర రాజులే కాక వారి సామంతులు, బంధువులు కూడ విఖ్యాతకవిశ్రేష్ఠులై వెలసియుండి రన్న విషయమునకు దార్ఢ్యణ మగుట విశేషముల కెల్ల విశేషము. ఈతడు క్రీస్తుశకము ౧౫౫౦ ప్రాంతమువా డనియు, శ్రీకృష్ణదేవరాయల కాలమున కించుక చిన్నవా డనియు శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు కలికాన్యపీఠికలో సోదాహరణముగా దెల్పియున్నారు. కావున, నాంధ్ర సారస్వతమున విశ్రుతప్రబంధయుగమునకు గడపట బయలువెడలిన యీ 'సాంబోపాఖ్యాన'మునందలి విశేషముల మాత్రము దిక్ప్రదర్శనముగా నిట సంభావించుట కీవ్యాస ముద్దేశింపబడినది.

### క థా వి ధా న ము

శ్రీకృష్ణునకు జాంబవతియందు జనించిన సాంబుని చరిత్ర మగుటచే నీ కావ్యమునకు 'సాంబోపాఖ్యాన' మను పేరు కలిగినది. కాని, యిందే ప్రారంభమున శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, పరాక్రమము, ద్వారకాపురవర్ణనము, రుక్మిణీకృష్ణుల శృంగారక్రీడలు, ప్రద్యుమ్నజననము, సత్రాజిత్తుతపశ్చర్య, స్యమంతకమణివృత్తాంతము, జాంబవతీపరిణయము మున్నగు వివిధ వృత్తాంతములు సమకూర్పబడినవి. అందుచే నీ కావ్యకథ శ్రీకృష్ణసంబంధి యగుట పరమపవిత్రము. ఈ కావ్యమును శ్రీరంగపతికి కృతియిచ్చి కవి ధన్యచరిత్రు డగుట మఱియొక విశేషము. ఈ రాజకవి :

"రంగప్పరాజ వైష్ణవ
పుంగవపూజావిధానపూతాత్ముడ శ్రీ
రంగపతికి నొసరించెద
మాంగలికతర ప్రచారమణిహారంబుల్."

అనియే తన్నుగురించి చెప్పుకొనియెను. దీని ననుసరించి కవి విశిష్టాద్వైతమతానుయాయి యైనను బరమతసహనమునను, కవితావైభవమునను కృష్ణరాయనికి దీటు రాగలుగు టెందు విస్పష్టముగా గానవచ్చును.

### క వి తా రీ తి

రంగప్పరాజు ప్రాచీనకవితతులపై బరమభక్తి గలిగి తన కావ్యమును బరమేశ్వరాంకిత మొనర్చినట్లే ప్రాచీనకవితల్లజులపై గల పరమతాత్పర్యమున నాయా కవుల పోకడలనే పుణికిపుచ్చుకొని తన కావ్యకన్యను దీర్చిదిద్దినాడు. అస లాతని ప్రతినయే యిది :

"అభినందనసహస్ర మమరించి నన్నయ
భట్టుమార్గము కొంత పరిఢవిల్ల
తిక్కనమఖిసూక్తిఫక్కిక యొక కొంత
పెనుపొంద నెఱ్ఱనప్రెగడఫణితి
యొకకొంత తిలకింప నొకకొంత నాచన
సోమునిర్వైభవంబు సొగసుమీఱ
త్రిపురాంతకుని రచనస్థైర్యంబు నొకకొంత
కొఱల శ్రీనాథోక్తి కొంత నిగుడ
మఱియు దక్కిన సుకవుల మధురవచన
రచనలును గొంత రాణింప రసనిబంధ
బంధురము గాగ నే నిచ్చు భవ్యకావ్య
హీరమునకు గథాక్రమం బెట్టి దనిన."

ఈ కారణమున నుత్తమకవుల నుత్తమవిధమున ననుకరించి యుత్తమకవిత వెలయించుటయే యీ కవి ప్రతిభయు, నీ కావ్యవైశిష్ట్యమును. ఈతని యనుకరణ కళావిభవ మాయాచోటుల నద్భుతముగా వెల్లివిరిసి యుండుట పరిశీలింపదగును.

## కృష్ణప్రీతి

రంగప్పరాజు కృష్ణభక్తుడు. కావుననే తన కావ్యశ్రీని విస్తృతమొనర్ప నారంభముననే కృష్ణలీలలు వర్ణించినాడు. సాంబోపాఖ్యానమును వ్రాయు వేళ, శ్రీకృష్ణలీలల నింతగా వర్ణించు టేల యని యడుగ నాతడవకాశ మీయక—

"ఆ బృందావనవీథికావిహరణం
బా వాంశికావాదనం
బా బంధుప్రియకార్యనిర్వహణ మా
హంసోద్భవా ఖేలనం
బా బిబ్బోకవతీసతీక్షణతర నే
త్రాగ్రప్రసూనార్చనం
బా బాల్యోచితచర్య లీశ్వరున కా
హా యెంత యిష్టంబులో !"

యని చెప్పి తన దైవమున కిష్టమైన క్రీడలు తన కిష్ట మగుట గుశంకలు గల పాఠకుల కైన నిష్టమే యగు నట్లు కవి వర్ణించుచు ననుక్షణ మాకృష్ణుని నిజరూపమును మనకు జూపుచునే యుండును.

"కల మయ్యు మేటిదేకల మయ్యు విలయాబ్ధి
గ్రీడింప నేర్చిన జాణవాని
ధనమయ్యు మోక్షసాధన మయ్యు నిజభక్త
జనముల బోషింప జాలువాని
పద మయ్యు విధులతాపసమయ్యు యాయజా
కాచారఫలదాత యైనవాని
ఘనమయ్యు సూక్ష్మాపఘనమయ్యు నలరు నె
య్యది యామహిమ తాన యైనవాని"

నిట్లు కవి మృదుమధురఫణితి వర్ణించుటలో ననౌచిత్యమే లేదు. రసపుష్టి నొనగూర్చు వర్ణనాంతరము లైనను గావ్యరసస్ఫోరకములే యగుగదా !

## అనుకృతి విశేషములు

ఆయావర్ణనములపట్టున బూర్వకవుల ననుకరించుచు స్వాతంత్ర్యమును వహించుచు నీకవి తన కావ్యమును రసబంధురమొనర్చుట కొనియాడదగిన విషయము. ఋష్యాశ్రమవర్ణనముపట్టున :

"దరి బట్ట జలుమీల దను చంచువుల బట్టి
యెచట క్రౌంచలు నించు నేటినీటి
కేని కన్నులు గట్టి గాన మంకులు దెచ్చు
వ్యాఘ్రికి నెచ్చట హరిణగృహిణి
జరఠసింహమునకు గరదంత మిచ్చుట
గై దండ నొసగించు గరికలభము
పోగగాడుపుబాలు పానుపు నెచ్చట నెమ్మి
యపు డప్పు డవ్వని నహిశిశువుల
గడుపు జెసబాయు ప్లవగపాకముల నెచట
నిండుమది బ్రోచు దల్లియై కొండగోతియ
యట్టి పుణ్యాశ్రమస్థలి............"

అనియు, శ్రీకృష్ణుడు తప మొనర్చుసమయమున:

"అభిషేకసమయ మా టరసి తీవలనుండి
జోరున బూదేనెసోన గురిసె
గాహాయములు గట్టుకొందున పరికించి
ప్రాకె సానుస్థలి రత్నరుచులు
భూతి బూయగ బూనుపూ నిక యారసి
యలమె నేడాకుపాన్పుల రజంబు
మానసబంధంబు మదిలోపల నెఱింగి
సారంగచర్మమై జలద మమరె
సకలలోకేశునకు గిరిస్థావరములు
జంగమంబులు దగు సేవ సలుపదొడగె."

నని వర్ణించుపట్టునను నన్నయసోమనల ననుకరించియు గవి స్వతంత్రించి రసస్ఫోరకత తన కావ్యమున కినుమడింపజేయుటయు గానవగును. ఇదే విధమున :

"కౌస్తుభచ్ఛాయయు గంఠంబుకప్పును
గైరికాంబుదసమాక్రాంతి దెలుప
గనకాంబరంబును గరటిచర్మము ద్రుణ
జ్యోతిర్వనావృతిస్ఫూర్తి బొదువ

వైజయంతియు భోగిరాజహారము హారి
తాళపాసువు ఝురస్థలము గాగ
నెమ్మోము చేటయు నిటలాక్షుదీప్తియు
వలగొను చంద్రార్కవలయములుగ
జేసి లీలకై నీలకైలాసయుగము
గూడియుండిన కైవడి జోడుగూడి
యుల్లసిల్లిరి రుక్మిణీవల్లభుడును
వసుమతీనరనందినీవల్లభుండు."

అను సోముని యనుకరణమును:

"వారణవల్లభావనసముత్సాహాయ
వారణదైత్య నివారణాయ
గోరాజభంజనోదార ప్రతాపాయ
గోరాజ వినుత సుగుణగణాయ
భోగీంద్ర శోషణాద్భుత పదన్యాసాయ
భోగీంద్రమణిమయ భూషణాయ
పర్వతోద్ధరణ నిర్భర బలోత్తంసాయ
పర్వతావాసవైభవపరాయ
యాదవేంద్రాయ పారిషదాధిపాయ
బర్హభూషాయ తారకాపతిధరాయ
నమ..."

అనుతావున "అర్ధంకమం దైన యాలపోతు నితండు పెంచినా డీతండు త్రుంచినాడు" అను సోమన పద్యానుకృతిని సంస్కృతీకరించి రచించుటయు నీతని యనుకృతికళానిపుణతను జాటుచున్నవి.

మఱియు నిందలి యుద్ధవర్ణనముల దిక్కనయుద్ధవర్ణనము కన్నులగట్టినట్లగపడుచుండును. సాంబదుర్యోధనులయు, కర్ణసాంబులయు యుద్ధవర్ణనము తిక్కన ఫక్కిని మిక్కిలి యనుసరించి వన్నెకెక్కినది. ఇదే విధమున సోమనహరివంశనృసింహపురాణములకు జక్కని యనుకరణము లిం దెన్నెని చూపవచ్చును. ఇవికాక, శ్రీనాథుని శృంగారనైషధచ్ఛాయలును పెక్కులిందు గలవు. 'అస్తినాస్తివిచికిత్సాహేతుకాతోదరికా' అను శ్రీనాథునికి 'అస్తివాదము మాన్పనెసడు సెన్నడుమును' అను నీకవియనుకరణమువంటి యనుకృతులే కాక వైతాళికగీతములు, బిందులు, మందెమేలములు మున్నగునవెల్ల చక్కని యనుకృతులు. ఇంతేకాదు. రామరాజభూషణుని యద్భుతకవితారీతు లెంత చక్కగా నిందు దలదాచుకొన్నవో యీ క్రింది యుదాహృతి వలన దేటతెల్లము కాగలదు:

"అలయాలసవిహార మలయానిలాంకూర
సలయాహతరసాల వలయితంబు
కాలాగురులతాళి లీలాగతకపాలి
బాలాగణవిహార లాలితంబు
గంగావనాభంగ భంగావళీతుంగ
శృంగాభి నిర్ఝరాలింగితంబు
భృంగీతతోత్సేక సంగీత పరిపాక
భంగీతరంగిత ప్రాంగణంబు
కటకతట పర్యటద్భోగి కటకతనయ
కటసముత్కట దానశీకర సుగంధ
గంధవాహకిశోర సంఘాతముదిత
హరిదిభేంద్ర కపోలాళి యచలమౌళి."

## మతపరిజ్ఞానము, రాజనీతి

రంగప్పరాజు కావ్యారంభముననే 'వైష్ణవపుంగవ పూజావిధానపూతాత్ముడ' నని చెప్పుకొనుటచే దన వైష్ణవమతసిద్ధాంతములగూర్చ సందర్భోచితముగ నెల్లడించుటకు సిద్ధాంతదర్పణగురుప్రసంగమును సృష్టించి తిరునాళ్ళయుత్సవాదికమును వర్ణించి కృతకృత్యు డయ్యెను. ఈ సిద్ధాంతదర్పణుడు కౌరవులకు, భీష్మద్రోణవిదురాదులకు సైతము "మురారిపరమతత్త్వం బెఱిగి పంచసంస్కారసంస్కృతులం గావించి యభిగమనోపాదాన విద్యాస్వాధ్యాయభక్తిప్రకారంబులు సుధాకరకరపోషక భాగ్యస్వరూపంబులును స్వజ్ఞాన ప్రాపకప్రాప్యజ్ఞానంబును ఆనుకూల్యసంకల్ప ప్రాతికూల్యవిసర్జన భావిరక్షణ విశ్వాసగోప్తృత్వ వరణాత్మనిక్షేపణ కార్పణ్యంబులును శరణాగత ధర్మంబుల మర్మంబులును భాగవతవాత్సల్యంబును బరమపూరుషపూజానుమోదనంబును...ప్రాకృత సంసర్గపరిత్యాగంబును మంత్రాసనస్నానాసనాలంకారాసనభోజ్యాసనంబు లను నవయవంబులం గలుగు తిరువారాధనా మర్యాదలు సాదిగా గల పరమ వైష్ణవసిద్ధాంతంబులు

బుద్ధిగోచరంబుగ" జేయించుట వైష్ణవాచార్యులపై గవికి గల సుభక్తి, తత్సిద్ధాంతములు బ్రకటింపబడినవి.

ఇదేవిధమున నీసిద్ధాంతదర్పణమునిచేతనే, స్వయముగా రాజసుకవి, రాజలోకశిఖామణి, అనగా కృష్ణరాయడు తన ప్రబంధమున నాచరణమున జూపిన చక్కని రాజనీతులే సాంబునకు జెప్పించి తన రాజనీతిపరతను, రాజధర్మజ్ఞతను నిర్వర్తించెను. ఆయా రాజనీతులు మృదుమధురఫణితి చెప్పి సాంబుని నిజకార్యనిర్వహణమునకు బురికొల్పిన సిద్ధాంతదర్పణు డాధ్యాత్మికసురుడే కాక రాజనీతివిశారదుడు నయి విజయనగరసంస్థాపకు డగు విద్యారణ్య మహాత్ముని స్మృతికి దెచ్చుచుండును.

"సామము దానము భేదము
నామీదట దండనియతి యనునయములలో
భీమప్రతాప! లక్ష్మీ
వ్యామోహితులకును వాల్గదియే యొప్పున్.

అరి దళితో నొకసింహ
స్ఫురణమునై నొత్తవలయు భూపతి చంచ
త్తరవారిధార దద్బల
తరుమూలము లెల్ల జెకల దర్పము దివియన్.

అరివిత్తాహరణస్పృహ
ధరణీపతి కునుప దగు సదా హృదయమునన్
వరవిద్యాచరణాద్భృతి
పరిణతి విప్రులకు బోలె శారదశాలీ!"

మున్నగు రాజనీతులే కాక మరికొన్నిగూడ గాంతోపమానసమ్మిశ్రితములుగ బోధింపబడుట గనదగును:

"అరిదుర్గము నమరీకుచ
గిరిదుర్గము లెక్క బనుపు క్షితినాధున కి
ద్దర దుర్గచతుష్టయసం
ధరణము గావలె జయానుభావాయతికిన్.

వనితాధరసుధ పలుసో
కున జాలుకట్టించి ప్రియుడు గ్రోలుకరణి భూ
జనము మది త్రాస మించుక
గనిపించుచు నొయ్య దివియగా దగు బతికిన్."

ఈవిధముగ జక్కని నీతులు బోధించుటే కాక ధీరత్వము నెరపవలసిన సాంబు డనుమానించుచుండగా నాతనికి రణశ్రీతి గలిగించి మహోత్సాహమున విజృంభించి జయమునడయ బ్రేరేచిన యీక్రింది వాక్యములు మిక్కిలి ప్రశంసనీయములు. అధ్యాత్మ విదులే కాక ఆర్యధర్మప్రబోధకులు, సమయ మేతెంచినపుడు వీరాధివీరులై విజృంభించు మహాత్ములే మన ప్రాచీనాచార్యవరు లన్న విషయమును గవిస్మృతికి దెచ్చుచున్నాడు. సాంబుని యుద్ధోన్ముఖుని జేయు నీప్రబోధము గనుడు:

"ఏల విచారము జయమున
భూలోకసుఖంబు లెల్ల బొందగవచ్చున్
వాలిక శరవిధి నీల్గిన
గేలుగమియు రంభ నృపతికిం గుశలమతీ!"

"సీరి పెదతండ్రి తండ్రి లక్ష్మీనిధుండు
సత్యకిసుతుండు పినతండ్రి శంభుమాలు
బొందె నీవు రణాంగణభూమి నిన్ను
దాకి గెలుచునె దివిజబృందంబులైన."

ఈ ప్రబోధమును విన్న సాంబుడు బయలువెడలి విజయలక్ష్మితోపాటు లక్ష్మణాకన్యను బడసి తండ్రికన్న మిన్నయైనాడు:

"హరి మును రుక్మిణీజలగు
హానన నోర్తునె తెచ్చెగాని యా
హరితనయుండు లక్ష్మణ బ్రి
యాళియుతంబుగ వేగ దెచ్చి బి
ట్టకరమువీద జెట్టె నది
యట్టిద పుత్రుడు తండ్రికన్న ని
ర్భరబలశౌర్యధైర్యగుణ
భాగ్యరమన్ ఘనుడైన జెన్నగున్."

ఈవిధముగ 'సాంబోపాఖ్యానము'ను గవిరాజగు రంగప్పరాజకవి యాంధ్రానుకృతికావ్యములలో నెన్నికగన్నదానినిగా జేయగలిగె ననుట స్పారాంశము. లోకవృత్తానుకృతియే కాక ప్రాచీనకావ్యానుకృతికూడ కావ్యధర్మములలో నొకటి యగును. కావుననే 'పూర్వకవీశ్వరవాక్ప్రయోగదక్షత' సుకవి లక్షణములలో నొకటిగా నప్పకవియు జేర్కొనెను. అందుచే నుత్తమకవుల యుత్తమానుకృతులను స్వతంత్రరీతుల సమ్మిళితమొనర్చి కావ్యకర్తయై, ఋష్యాశ్రమమందలి శుకములుసైతము వేదములు చదువునట్లు, శ్రీకృష్ణదేవరాయల సామంతులుసైతము సత్కావ్యకర్త లన్న విషయమును రంగప్పరాజు ప్రబంధమూలమున జాటియున్నాడు.



దప్పిగొన్న దంతావళము

# వేదహరిశ్చంద్రము

(శ్రవ్య నాటకము)

•

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

హరిశ్చంద్రుడు: ఓయి ప్రభూ! వరుణ మహారాజా! ఈ హరిశ్చంద్రుడు నీకు పరమభక్తుడు. అనేక యాగములు చేసి నిన్ను సంతోషింపజేసినవాడను.

(ఉరుములధ్వని)

హరి: నాకు సంతానము లేదు. పుత్రులు లేని వారికి గతులు లేవందురు. అసలు సంతానమే కలుగకుండుటకంటె కలిగి నశించినను మేలేకదా!

(ఉరుముల ధ్వని)

హరి: వేదమునందు స్తోత్రము చేయబడిన యెల్లదేవతలలో నీవే యధికుడవు. నీవే శివుడవు. నీవే విష్ణువవు. ఆదిత్యుడవు నీవు. ఇంద్రుడవు నీవు. కుబేరుడవు నీవు. యమధర్మరాజువు నీవు. అపాంనపాద్దేవతలు నీవు. అశ్వినీదేవతలు నీవు. మెత్తని లేత పారిజాతపు మొగ్గల కడుపులోని కమ్మని కాంతుల కన్నతల్లి యుషోదేవత నీ జాలికనులలోని తలతల లరువు తెచ్చుకొన్న తేజోలేశము.

(ఉరుములు)

హరి: ఓహో! వరుణ మహారాజా! ఉరుములు, మేఘములు, సముద్రములు నీ ప్రళయరూపము. నదులు, సరస్సులు, జలపాతములు నీ సౌమ్యరూపము. శరత్కాలమున తెల్లని వస్త్రము ధరించి పాలరాతి మెరుగులతో మహారాజసౌధమువోలె నొప్పారెడి నీ సౌమ్యమూర్తిని ప్రసాదింపుము.

(జలము ప్రవహించు ధ్వని, జలపాతధ్వని)

హరి: ప్రసాదము. ప్రసాదము. కొండకొమ్మనుండి జలజల రాలు నీ మూర్తి మణుల పుప్పొడి పల్కికలతో క్రుమ్మరించినట్లున్నది. అప్సరస్త్రీల తెలివలిపపుచీర లారబెట్టినట్లున్నది. ప్రభూ! నాకు పుత్రసంతానము లేదు. సంతానము లేదని నాకు దిగులు లేదు. నిన్ను సర్వదా యజ్ఞములచేత సంతోషపెట్టు నాతరువాత ని న్నెవరయ్యా యాగాదిక్రతువులచేత సంతోషపెట్టువారు?

(జలపాతధ్వని)

హరి: వరుణ మహారాజా! దయచూడుము. నీ యాగపశువువంటివానిని నా కొక పుత్రుని ప్రసాదింపుము.

వరుణుడు: ఓయీ! హరిశ్చంద్రా! నీ వన్నట్లే.

హరి: ఏమిఏమి! సృష్టిప్రథమమూర్తి కలకదేరి నాయందు ప్రసన్నుడైనాడు. ఓహో! నాకు పుత్రసంతానము కలుగునా! అనంతాకాశమున పట్టి యావిరి మూట కట్టి కుదుపలుకట్టి మెత్తని జలాకృతి తాల్చు స్వామికి పూర్వపుణ్యములచేత హరిశ్చంద్రుని రక్తబిందువులు కదలించి సుకుమార శిశుశరీరము కలిపించు శక్తి క్రొత్తదేమి?

వరు: (జలములోనుండి మాటాడుచున్నట్లు వినిపించును) ఓయీ! నీకు కుమారుడు కలుగును, కాని వానిని నాకు యజ్ఞపశువుగా నీయవలయును.

హరి: అట్లే యొసగుదునయ్యా! మహారాజా! ఈ శరీరములు నీవి. నీ శరీరములు నీ కొసగుటలో నాశ్చర్యమేమున్నది?

వరు: అవునోయి! మావి మాకిచ్చుట మడి మాన్యము లిచ్చుట యందురు. ఈషణత్రయములో పుత్రేషణము చాల చెడ్డది. పుత్రప్రేమ చంపుకోరానిది.

హరి: నాకు కర్మయం దున్నంతటి యను రాగము వేర దేనియందు లేదు. పుత్రసంతానము నేను వాంఛించినది మోహము పొందుటకు గాదు. పున్నామ నరకమునుండి విముక్తుడ నగుటకు.

వరు: సరే! కొడుకు నడుగుటకు వచ్చెదను.

(చక్రము గిర్రున తిరిగిన ధ్వని)

(పాట)

పైడి కత్తి పూనీ—బిరానా
పాపబొడ్డు కోసీ.
బోరుకాడ శేసీ—తలంచీ
పోరు పెట్టకుండా!
అబ్బురంపు బిడ్డా—జనించే
అవనిపాలమణికీ.

* * *

(జలపాత ధ్వని)

వరు: హరిశ్చంద్రా! పుత్రోదయవేళ నీకు నా శుభాశంసనములు.

హరి: దేవతాశిరోమణీ! ఇది యంతయు నీ దయావిశేషము.

వరు: నీ కింక పున్నామనరకభయము లేదు.

హరి: స్వామీ! నీ దయవలన లేదు.

వరు: ఇంక నీ కుమారుని నా కిచ్చివేయుము. నేను యాగపశువుగా వరించితిని.

హరి: దైవమా! ఇదియేమయ్యా! ఈ పసికందును కొనిపోయి నీ వేమి చేసెదవు? ఈ శిశువు రూప మింకను కట్టెనో లేదో యనామకద్రవ్యము. ఇట్టి క్రొత్తపాపలమీద పెన్నెమ్మపురుగు లాసపడును. బాలగ్రహము లాసపడును. దేవతాశిఖామణివి నీవా యిది వాంఛించుట? కాదు, నీవు నాకు వాని నిచ్చితివి. "నా కిచ్చివేయుము. తీసికొనిపోయి నేనే పెంచుకొందు"నందువా! తీసికొనిపొమ్ము. కొనిపోయి యెక్కడ పెంచెదవు? దాది యెవరు? ఉయ్యెలమంచ మెచ్చటని? పాలిచ్చుతల్లి యేమి? సర్వ వైదికకర్మాధీశ్వరుడవు నీ వీపసిపాపను బసువుగా జేసికొందువా!

దరుల జలదాలలో గిరీంద్రముల తలల
దొరలు జలధారలో పెంచుదువొ కుమారు
స్వామి! యీ పసిపాప యీ చలికి నారి
పోవు బిగిసిన చలిమిడిముద్దవోలె.

వరు: నిజమే. పసివానిని నే నెక్కడ పెంచగలను? మీ యింటిలోననే యుండనిమ్ము. పురిటిపాపను దీసికొనిపోయి నేను యజ్ఞపశువుగా నెట్లు చేయుదును?

హరి: పురిటిపాపయేమి, యజ్ఞపశు వేమి! వచ్చిన ఋత్విక్కులైన నెట్లు పట్టుదురు! యూపమున కెట్లు బిగింతురు!

వరు: తెలిసినది. తెలిసినది. మరల వత్తునులే. ఇపుడు తీసికొనిపోయి వీని కాముద మెచ్చటనుండి తెత్తును?

హరి: అవును. ప్రభూ! నే నదియే మనవి చేసినది.

వరు: నేను మరల వత్తు నన్నానుగా: నీ వింక నేమియు జెప్పనక్కరలేదు.

హరి: సెలవు తీసికొందును.

* * *

(సన్నాయి పాట)

(జలపాత ధ్వని)

వరు: హరిశ్చంద్రా! ఏమి మీయింట నుత్సవములు చేయుచున్నారు!

హరి: స్వామీ! వరుణదేవా! నా కుమారునకు నామకరణోత్సవము చేయుచున్నాము.

వరు: ఏమని పేరుపెట్టితివి?

హరి: రోహితుడని.

వరు: మరి యిప్పటికి నీ కొడుకునకు నామరూపము లేర్పడినవి.

హరి : ప్రభూ ! నీ దయవలన:

వరు : ఇప్పుడైన నీ కుమారుని నా కిచ్చి వేయుదువా ?

హరి : ఇరువదిదినాలక్రింద బుట్టినాడు. నేడు నూనెకందు. తీసికొనిపోయి యేమి చేయుదువు ?

"వరుల జలదాలల్లో ......"

వరు : నిజమే. పసివానిని దీసికొనిపోయి నే నెక్కడ పెంచగలను ? మీ యింటిలోననే యుండ నిమ్ము. నూనెకందును తీసికొనిపోయి నేను యజ్ఞపశువుగా నెట్లు చేయుదును ?

హరి : నూనెకందేమి, యజ్ఞపశువేమి ! వచ్చిన ఋత్విక్కులైన నెట్లు పట్టుదురు ? యూపమున కెట్లు బిగింతురు ?

వరు : మరి యెప్పుడు రమ్మందువు ?

హరి : అనుపనీతుడు యజ్ఞపశుత్వమున కర్హుడు కాడు. వానికి ద్విజత్వము లేదు. ద్విజుడుగాని నర పశువు యజ్ఞీయము కాదు. ఉపనయన మయినతరువాతే వచ్చుట మంచి దనుకొందును.

వరు : చాలదూరము పెట్టితివే !

హరి : మీరే చూడుడు. ఉపనయనముచేతనే కదా కర్మార్హు డగుచున్నాడు. స్వామీ ! నిన్ను గూర్చిన యాగము కర్మమార్గమున నున్నతోన్నతముగా నున్నది. అట్టి నీ యాగమున కర్మకు యోగ్యత లేని వాని ననుపనీతుని పశువుగా జేయుటయా !

వరు : బాగుగా జెప్పితివి !

హరి : వరుణదేవా ! నీవంతవర కాగినచో నీకా-సమర్హమైన పశువు లభించును. నాకా-ముద్దుముచ్చటలు తీరును. పసివాని యాటపాటలు చూచి యానందించుటయు గలుగును. నెల పురిటిలోననే చనిపోయిన పసివానిని గూర్చి తొమ్మిదినెలలు మోసిన తల్లికి దుఃఖముండునుగాని తండ్రి కుండదు. దేవతాశిరోమణీ ! జగమునందలి సర్వస్నేహము పరిచయమువలన నేర్పడును. కొన్ని సంవత్సరములు పెరిగినగాని తండ్రికి కొడుకు కొడుకనిపించడు. పెరిగిన బిడ్డను నీకిచ్చినచో నాకు గొడుకు నిచ్చితి ననిపించును. ఈ పసిగ్రుడ్డును నీవు తీసికొనిపోయినచో నేను చేసిన వాగ్దానము తీర్చినట్లే యుండదు. ఇది నే నిచ్చినట్లు కాదు, నీవు పుచ్చుకొన్నట్లు కాదు.

వరు : బాగుగా చెప్పితివోయి రాజా! బాగుగా చెప్పితివి. మరి యెప్పుడు రమ్మందువు ?

హరి : క్షత్రియులకు పదియవ యేట నుపనయనము చేయవలయును. తరువాత దయచేయుడు.

వరు : మరి యీలోపుగా నీకొడుకునుగూర్చిన సర్వజాగ్రత్తయు నేనే తీసికొందును. నీ వూరకే నీ ముద్దుముచ్చటలను తీర్చుకొనుచుండుము.

హరి : నీదయవలన నెందుకు తీర్చికోను వరుణదేవా !

ఆరబోసిన బోసినవ్వుల-యచ్చువెన్నెలరాశిలో
కోరి వెన్నెల పత్తు లాడనో-కూర్మియెత్తులు దింపులై
కూరుడై తొడమీద నెక్కిన చుంచు దువ్వుచు
నాయనా
రార బంగరుతండ్రి యంచును రాణముద్దుల నాడనో !

వరు : అవునవును. అంతయినపుడుగాని నీకు గొడుకనిపించదు. నీ వాగ్దానఫలము రాదు.

హరి : చిత్తము. సర్వదేవతామకుట మణికిరీట ఘటిత పాదాంభోజాతునకు దేవరకు దెలియని దేమున్నది ? మీ చిత్తము, నాభాగ్యము.

వరు : మరి నేను పోయి త్తును.

హరి : నిత్యసేవకుడను.

*   *   *

(చక్రము తిరిగిన ధ్వని)

(గాయత్రీమంత్రరావము)

హరి : బిడ్డా, రోహితా !

రోహి : చిత్తము, నాయనగారూ !

హరి : నీ విప్పుడు కర్మకు యోగ్యుడ వయితివి.

రోహి : అవును, కర్మయోగ్యమయిన స్థితి నే నిప్పుడు పొందితిని. మహారాజా ! నీవలెనే నేను ననేక యాగములు చేసి దేవతలను సంతోషపెట్టెదం.

హరి : దేవతల నొక్క యాగములు చేసియే సంతోషపెట్టనక్కరలేదు. వారిని పలువిధముల సంతోషపెట్టవచ్చును.

రోహి : చిత్తము, నాయనగారూ! ఏవిధముగా వారు సంతోషింతురో ఆవిధముగానే చేయవచ్చును.

హరి : నాయనా! దేవతల కనుకూలముగా వర్తించనిచో వారు కోపిల్లుదురు.

రోహి : తపముచేసెదను. దానములు చేసెదను.

హరి : దాన మనేకవిధములు.

రోహి : తన్ను మించి దానము చేయుట యాత్మఘాతము. అదికాని సర్వదానము చేసెదను.

హరి : అయ్యో!

రోహి : ఏమి నాయనగారూ! అట్లయితిరి?

హరి : ఏమియును లేదయ్యా! నీవు పోయి నీ కార్యకలాపమును దీర్చుకొమ్ము.

రోహి : చిత్తము.

(ఉరుములు, మెరుపులు, వాన)

హరి : ఉరుము వినుచునె భయపడుచుంటి నేను
పిడుగుగా వచ్చి తలమీద బడు నటంచు
నోరులేనట్టి పసువో మనుష్యు డనగ
కాని యనుమతి లేక యీ పసుల యెట్లు?

వాడా, చిత్రమైన మనఃప్రవృత్తి కలవాడుగా బెరిగినాడు; వరుణదేవు డనగా జంపమూర్తి.

వరు : రాజా! యాగపశుత్వమున కర్హుడయిన కొడుకుచేత వర్ధిల్లుచున్నావు.

హరి : వరుణమహారాజా! దయచేయుము, దయచేయుము.

అఖిలజలమయాకృతి వైనయట్టి నీకు
వర్షుశ్రీ మేరీతి సమకూర్తునయ్య నీకు
నందు గల బిందు లే వనునట్టి నీకు
స్వాగత మ్మెట్లు చెప్పుదు నయ్య నీకు!

వరు : ఏమోయి రాజా! అట్లు బెదరుచున్నావు? నీ కుమారుడు కుశలముగా నున్నాడా? కర్మాభిముఖుడుగా నుండెనా?

హరి : వరుణదేవా! నిరామయుడుగా నున్నాడు.

వరు : ఎందుకు బెదరుచుంటివి? మరియు నేదైన సాకు చెప్పవలయునని తలచుచుంటివా!

హరి : అదియేమి స్వామీ! పూర్వము సాకులు చెప్పి నిన్నలయించితినా!

వరు : పురుటిలో పిల్లవానిని బురుటికం దంటివి. నెల పురుటివానిని నూసెకం దంటివి. మరి పెరిగిన వానిని అనుపనీతు డంటివి.

హరి : అది యేమిమాట దేవతాసార్వభౌమా! నీవు నంగీకరించితివి. నీ వంగీకరించుట నా మాటలలోని ధర్మమును నీ వెఱిగితి వనుకొంటిని. నీవు దేవతామూర్తివి. మనుష్యునివలె ననుచుంటివి. మా మనుష్యు లిట్లేలే.

వరు : ఎట్లేమి?

హరి : భవిష్యత్తున లాభాశతో నంగీకరింతురు. ఆ లాభము తరువాత లభించనిచో నెవరో తమ్ము మోసగించె నందురు. భవిష్యత్తులో తమ కెక్కువ లాభము కలుగునని వారు పడ్డ యాశ న్యాయమే. ఇతరు లట్లు చెప్పుట యన్యాయము.

వరు : ఓయిరాజా! మీ మనుష్యజాతి మిక్కిలి తెలివితేటలు కలది. నీవు చూడుము: అప్పు డది ధర్మము చెప్పినట్లు లున్నది. ఇప్పు డిది న్యాయము చెప్పినటు లున్నది.

హరి : అంతదాక యెందుకు? నే నప్పుడే యబద్ధమాడినట్లు చెప్పికూడ గొందఱు చెప్పగలుగుదురు. కొందఱి నొప్పించగలుగుదురు.

వరు : అది యెట్లు సాధ్యము?

హరి : స్వామీ! అన్నియు సాధ్యమే. స్వార్థముకొలంది సర్వవాదములు సాధ్యము. ఈ హరిశ్చంద్రుడు తన కొడుకును నాకు యజ్ఞపశువుగా నిత్తు నన్నాడు. ఇచ్చునో యీయడో! అని భయము. కాలము కడచినకొలది ననుమాన మెక్కువ. ఈ యనుమానములో నెవ రేది చెప్పినను అదుకును.

వరు : సరే! నీవు సాకు చెప్పలేదు. నీకొడుకును నా కిమ్ము.

హరి : మరియు నొక ధర్మము చెప్పెదను. మీరు నా యందు దోసము చెప్పరాదు.

వరు : చెప్పము.

హరి : యజ్ఞపశువుగా పశ్వాదులను వరించుట లోనను, మానవులను వరించుటలోనను భేద మున్నది.

వరు : ఏమిటది ?

హరి : పశ్వాదులకు జ్ఞానము లేదు. మానవులకు జ్ఞానమున్నది; అంగీకారాదు లున్నవి.

వరు : అడిగినచో పశువులు నంగీకరింపవు. అందుకనియే యవి పెనగులాడును.

హరి : ఆ పెనగులాట జంతులక్షణమైన భయము. అంగీకారము మనోలక్షణము. ఆ యంగీకారము లేనిచో పశువునకు పశుత్వము పట్టదు. యాగము వృథాయగును.

వరు : నీకొడు కంగీకరింప డందువా! మరి చిన్నప్పుడే పశువును జేయకపోయితివా!

హరి : చిన్నప్పుడు చేసినచో యజ్ఞఫలము లేదు. ఇప్పు డంగీకృతి లేకుండ జేసినను నట్లే.

వరు : మరి యంగీకరించునేమో మాటాడితివా!

హరి : మాటాడలేదు.

వరు : ఎందుకు మాటాడలేదు?

హరి : వరుణమహారాజా! వాని మనోధర్మము, వాని చిత్తవృత్తి, వాని శరీరము సర్వము నీవశమునం దుంచుకొంటిని. వాని యాకృతివిశేషమును మాత్రము చూచి నేను పుత్రమోహము పొందుచుంటిని. వాని మనస్సు దేవతాత్వ మందినట్లు ప్రభువై యున్నది. చిన్నవాటినుండి నా యదుపులో నున్నచో యజ్ఞాయత్తమై యుండెడిది.

వరు : పూర్వమే నీవు నాతో చెప్పినచో నేను వాని సర్వము నీయధీనమం దుంచెడివాడనుగదా!

హరి : అప్పుడు నాకు మాత్ర మేమి తెలియును ?

వరు : ఇప్పుడు తెలిసినదా ?

హరి : అనుమానముగా నున్నది. కదలించిచూచితిని. అనుకూలముగా నున్నట్లు లేదు.

వరు : నా సంగతి చెప్పితివా ?

హరి : చెప్పలేదు. పరోక్షముగా మాటాడితిని. ఏదోగా మాటాడినాడు.

వరు : ప్రత్యక్షముగా మాటాడిచూడుము. వా డంగీకరించినను అంగీకరించకపోయినను నీ వాగ్దానము నీవు చెల్లించితీరవలయును.

హరి : అంగీకరించకున్నచో నెట్లు! బలవంతముగా వధించు మందువా? అది వధ యగునుగాని యజ్ఞము కాదే ?

వరు : ఓయీ! యీ మాటలు తీసి యవతల పెట్టుము. అంతే. మరి యిందుకనియా! అప్పు డట్లు చెప్పితివి! అనువనీతుడని, యేమోయేమోనని.

హరి : దేవతాసార్వభౌమా! నీ కంత కోపమైనచో నేనగుదును యజ్ఞపశువను-తీసికొమ్ము.

వరు : నీ వగుదువా! నీ వెవరికి గావలయును ? బహుదేవతాకమైన యజ్ఞము లీ వెన్ని చేసితివి? ఇంద్రునిగూర్చి చేసితివి. యమునిగూర్చి చేసితివి. కుబేరునిగూర్చి చేసితివి. సర్వదేవతలయందు వ్యభిచరించిన మనోవృత్తితోడి నీవు నా కెందుకు? నీ కొడుకో పసివాడు. అన్యదేవతాబుద్ధి కాడు. మ న్నేయితర దైవతమును యజించి యెఱుగడు. అచ్ఛమైన పాలవంటివాడు. వాడు కావలయును.

హరి : అడిగిచూచెదను.

వరు : అది పనికిరాదు. ఒప్పించితీరవలయును.

హరి : అత డొప్పుకొననిచో ?

వరు : ఒప్పుకొననిచో నీ వనుభవించవలయును. నిన్ను అబద్ధమాడినవానినిగా నేను జెప్పెదను. ఎవరో వాదకుశలులు చెప్పుట యెందులకు ?

హరి : ప్రభూ! మనుజులు వాదకౌశలము వెలయింతురు. ఐహికఫలము వాంఛించి వెలయింతురు. పాపము పొందుదురు. అట్టి పాపమార్గమున దేవత లేల పోవలయును ?

వరు : పాపపుణ్యము లట్లుంచుము. స్వార్థము దేవతలకును గలదు. నీచేత వాగ్దానము చేయబడిన యజ్ఞ

పశువునుండి కిపరింపబడిన నేను కోపము పొందుటలో దప్పేమి కలదు ?

హరి : లేదు మహారాజా! కాని పిల్లవాడు పెద్ద వాడైనాడు. వాడొప్పుకొనవలయునుగదా ?

వరు : పెద్దవాడైన తరువాత నొప్పుకొనడేమో యని నీవు ముందే యాలోచింపవలసినది.

హరి : మనవిచేసితిఖిగదా! నా కాయూహ రాలేదు. తమకును రాలేదు. నాయందే దోష మారోపించుచుంటిరి.

వరు : ఓయీ హరిశ్చంద్రుడా! గడుసుదనము మాకును దెలియును. తెలివితేటలను బట్టి లక్ష్య పాదించ వచ్చును. కాని పరమార్థమున నష్టపడినది నేను.

హరి : ప్రభూ! నే నతనిని గట్టిగా నడిగిచూచెదను. "నాయనా! ఇది దేవతలతో బని; నీ వంగీకరింప నిచో నా నెత్తిమీదికి వచ్చు" నని చెప్పెదను.

వరు : నట్టి నెత్తిమీదికి వచ్చుట కాదు.

హరి : స్వామీ! వరుణదేవా! మీ కోపము నే నెఱుగనా!

వరు : ఓయీ! ఈ వినయపుమాటలు నాకు బనికిరావు. తీసికొనివచ్చి కొడుకు నిచ్చితివా నిమ్ము. లేనిచో నీజీవితాంతము జలోదరవ్యాధిచే యమయాతన ననుభవించెదవు.

హరి : ప్రభూ! వానిని గనుగొందునని చెప్పుచుంటినిగదా!

వరు : నీవు చెప్ప నక్కఱలేదు. నేను పోవుచుంటిని. రే పీపాటికి వచ్చెదను. కొడుకు నిచ్చెదవా సరి! లేనిచో...

(ఉరుముల ధ్వని)

హరి : ఓయి వరుణదేవా! వెడలిపోయితివా! జలోదరవ్యాధి యేమిటయ్యా! ప్రభూ! నా కడుపులో జలపాతధ్వనులు కలిగింతువా! నదులు ప్రవహింపజేయుదువా! సముద్రతరంగములు ఘోషింపింతువా! కానీ, కొడుకు నడిగిచూచెదను. వాడు కాదన్నపుడుకదా నేను దిగులుపడవలసినది. పిల్లవానిని పిలిపింతును. ఎవరురా అక్కడ!

సేవ : ప్రభూ! చిత్తము.

హరి : ఎవరు నీవు?

సేవ : క్రొత్తగా వచ్చిన సేవకుడను.

హరి : క్రొత్తగా వచ్చితివా! ఎవరు రమ్మనిరి? ఇచ్చట నెవరుండుమనిరి? ప్రాతవా డేమయ్యెను? సరే! మా రోహితుని నేను రమ్మనుచుంటినని చెప్పుము. నే నతనికల్లి యంతఃపురమున నుందును. అక్కడకు రమ్మనుము. తల్లిదగ్గర నుండెగా నతడు నామాట కాదన డనుకొందును.

సేవ : మహారాజా! కొడుకు యాగపశువగుట తల్లి యంగీకరించునా?

హరి : ఈ కథ నీ కెట్లు తెలియును?

సేవ : వరుణుడు మీతో మాటాడుచుండ విన్నాను.

హరి : ఆయన వరుణుడని నీ కెట్లు తెలియును?

సేవ : మహారాజా! ఈ కథ ప్రపంచమంతటను దెలియును.

హరి : ఇదివర కున్న సేవకుడు నీయంత తెలివి గలవాడు కాడు. నీవలె నింత నిర్భయముగా మాటాడు వాడు కాడు.

సేవ : మహారాజా! క్షమింపుము.

హరి : క్షమించుట కేమిగాని, తల్లి యంగీకరింప దందువా?

సేవ : కన్నకడుపుగదా!

హరి : అదికాదోయి! వరుణదేవునకు బిడ్డ నిత్తునన్న సంగతి యామెకును దెలియునుగదా!

సేవ : తనకుమాత్రము తెలియదా!

హరి : అనగా?

సేవ : స్వామీ! అప్పుడు బిడ్డలు లేరు. అప్పుడట్లనకపోయినచో వరుణుడు కొడుకు నీయడు. ఇచ్చిన తరువాత మన యిష్టముగాని యతని యిష్ట మేమున్నది?

హరి : ఇం దిష్టము, అనిష్టమని లేదు. కొడుకు నిత్తునని వాగ్దానము చేసినాను. ఇచ్చెదను.

సేవ: కొడు కంగీకరింపనిచో?

హరి: అంగీకరించునో, అంగీకరింపడో కనుగొనెదను. నీవుపోయి వానిని పిలుచుకొనిరమ్ము.

సేవ: ఇక్కడకు దీసికొనిరానా, దేవిగారి యంతఃపురమునకా?

హరి: అక్కడికే నేను పోవుచున్నాను. వాని నటకే తీసికొనిరమ్ము.

సేవ: చిత్తము.

* * *

రోహితుడు: ఎవరు నీవు?

సేవ: యువరాజా! మిమ్ము మహారాజుగారు రమ్మనిరి.

రోహి: ఓహో! నీవా! క్రొత్తగా వచ్చిన సేవకుడ వని చెప్పితివి కదా! నాయనగారు రమ్మనిరా! ఎందుకు?

సేవ: పెద్దపని యేమియులేదు. కాని యువరాజా! మీరు బాలురయ్యు మంచి వివేకులు. తమరి నొక విషయ మడుగవలయు ననుకొన్నాను.

రోహి: ఏమిటది?

సేవ: ఒక ధర్మసందేహము. తమ రడుగుమని సెలవిచ్చినచో నడిగెదను. నా కెన్నాళ్ళనుండియో యీ సందేహము కలదు.

రోహి: ఎన్నాళ్ళనుండి.

సేవ: పది పండ్రెండేండ్లనుండి.

రోహి: నేను పుట్టినప్పటినుండి యున్నదన్న మాట నీ సందేహము! ఏమది చెప్పుము.

సేవ: నాకు భార్య యున్నది. దాని పేరు శేశోమతి. నే నన్నానుగదా—"ఓసీ శేశోమతీ, నీవు పోయి యింద్రుని కోర్కె తీర్చిర"మ్మని. ఆమె నిరాకరించినది. నాకు కొడు కున్నాడు. వాని పేరు దీప్తమతి. నేనన్నానుగదా—"ఓయి దీప్తమతీ! నీవు పోయి యింద్రయాగమున బలిపశువు క"మ్మని. వా "డిదియేమయ్యా! నన్ను బోయి చావమందువు. నే నేమి మేకనా! గొర్రెనా! నాకు జ్ఞానమున్నది. సదసద్వివేక మున్నది. ఇష్టానిష్టము లున్నవి. సుఖదుఃఖము లున్నవి. కత్తి మెడమీద బెట్టినచో నాకును నొప్పి కలుగును. నేను పోనని యన్నాడు. భర్తకు భార్యమీదను, తండ్రికి కొడుకుమీదను యజమానికి దన యాస్తిమీద గల యధికారమును, స్వామ్యమును గలదా, లేదా యని నాకు గల సందేహము.

రోహి: వండుకొను పాత్ర, పండుకొను మంచము నిచ్చినట్లు భార్యను, కొడుకు నిత్తురా!

సేవ: ఈయక తప్పనిసరియయినచో?

రోహి: ఆ తప్పనిసరి యెట్లుండును?

సేవ: నాకు పుత్రసంతానము లేదు. ఇంద్రదేవతనో, వరుణదేవతనో ప్రార్థించితిని. "ప్రభువులారా! నాకు పుత్రసంతానము దయచేయు" డని. ఆ దేవతలు "ఓయీ! నీకు పుత్రసంతానము దయచేయుదుము. ఆ పుత్రుని నీవు మాకు యజ్ఞపశువుగా నీయవలయును. అట్లయినచో నీకు పుత్రు నిత్తు" మని యందురు. అప్పు డీయవలదా, అక్కరలేదా!

రోహి: అదియేమయ్యా! యజ్ఞపశువుగా దీవి కొనువప్పు డస లిచ్చుట యెందులకు?

సేవ: ఎందులకో మీ నాయనగారి నడుగవలయును, వరుణదేవు నడుగవలయును.

రోహి: నీకొడుకు నింద్రునకీయవలయుటయేమి, నా తండ్రిని, వరుణుని అడుగుటయేమి?

సేవ: నాకొడుకు నేదేవతకు నీయలేదు. జయంతుడు సుఖముగా నున్నాడు.

రోహి: నీకొడుకు పేరు జయంతుడా! ఇంద్రుని కొడుకు పేరును జయంతుడేకదా?

సేవ: వాడే నా కుమారుడు.

రోహి: నీ వింద్రుడవా!

సేవ: అవునోయి. నే నింద్రుడను. నీ కుపకారము చేయవలయునని వచ్చితిని.

రోహి: దేవతాసార్వభౌమా! నమస్కారము. నిన్ను ఇంతవరకు సేవకునిగా నెంచి మాటాడినందులకు క్షమింపవలయును.

సేవ: అందు నీత ప్పేమియు లేదు. నేనే కోరి యిట్లు వచ్చితిని. నీస్థితి చూచి నాకు జాలివేసినది.

రోహి: మీ రమ మాటలు నా కర్థమగుట లేదు. నా స్థితికేమి, నేను బాగుగనే యున్నానే!

సేవ: బాగుగనే యున్నావు. చక్కని కన్నులు. దివ్యమైన ముఖలక్షణము. తేజస్విత. రాజలక్షణము. మంచి వివేకము. ఈడునకు మించిన తెలివితేటలు. అందుకనియే నీవన్నచో నాకు జాలికలిగినది.

రోహి: ఆ జాలికలుగు హేతు వేమియో నాకు తెలియలేదు.

సేవ: నీవంటి పిల్లవాడు యజ్ఞపశువు కాబోవుచున్నా డనగా జాలివేయునా, వేయదా!

రోహి: నేనా! యజ్ఞపశువునా! ఎవరికి? ఎవరి యజ్ఞములో? కర్త యెవరు?

సేవ: అయ్యో! కడుపున బుట్టిన బిడ్డవు. నిన్నింత యజ్ఞానముతో పెంచిన తండ్రి నేమనవలయును?

రోహి: ఏమి ప్రభూ! నాతండ్రికి నేనన్నచో ప్రాణము. నా కాయన ద్రోహముచేయునా?

సేవ: నీకు బసితనము. లోకము తెలియదు. ఊరివారికన్న దన కుటుంబము ప్రియమైనది. అందులో నందరికంటె భార్యాపుత్రులు ప్రియమైనవారు. వారికంటె మనుష్యునకు దనకు దానే మహాప్రియమైనవాడు. తన ప్రాణముమీదికి వచ్చినపుడు కొడుకునైనను దండ్రి వదలుకొనును.

రోహి: నాతండ్రి కేమి ప్రాణముమీదికి వచ్చినది?

సేవ: వరుణుడు నిన్ను నరపశువుగా గోరినాడు. నీతండ్రి నిన్నిత్తునన్నాడు. నిన్నందులకే రమ్మని కబురంపినాడు.

రోహి: ఏమి ప్రభూ! యీ యన్యాయము!

సేవ: అన్యాయమన్న అన్యాయమా! నిజముగా నా కేమి పట్టినది చెప్పు. ఎంత అన్యాయము కాకపోయినచో నేను వచ్చినాను. తోడిదైవము. ఆయనచేసెడి యీ యన్యాయము నాకు రుచించలేదు. ఆరే! ఎన్ని జంతువులు లేవు. నరపశువే కావలసి వచ్చెనా! అందులో బంగారమువంటి పిల్లవాడు నీవా! రేపు పెద్దవాడవై మహారాజవై లోకమును ధర్మమార్గమున పాలింపదగినవాడవు. ఎవడో పేదబ్రాహ్మణబాలుడైనచో నంత విచారింపదగినది కాదు.

రోహి: మరి యిప్పుడు నా కేమిగతి! నాయనగారివద్దకే పోయి యడిగెదను—ఏమయ్యా యింత యన్యాయమని.

సేవ: మంచి తెలివి గలవాడవు! వెంటనే నిన్ను బట్టించి చెరలో పెట్టును. వరుణుడు వచ్చినంతనే అప్పగించును.

రోహి: మరి పారిపోదునా?

సేవ: పారిపోవుటకు మాత్రము వీలున్నదా! రక్షకభటులు అన్నివైపుల గాపున్నారు.

రోహి: మరి యేమిగతి? ప్రభూ! సర్వదేవతానాథుడవు. నీవు నన్ను రక్షించలేవా! నేను నిన్నాశ్రయించితిని. నన్ను రక్షింపుము.

సేవ: నీ వాశ్రయింపనక్కరలేకుండనే నిన్ను రక్షింపవచ్చితిని. నీ విక్కడ నున్నవాడ వున్నట్లుగా నెవరికి గన్పించకుండజేసెదను. మహారణ్యములో బోయి దాగియుండుము. కాదు. నీయిచ్చవచ్చిన చోటికి బొమ్ము.

రోహి: ప్రభూ! అట్లే చేయుము.

(పులుల గర్జనలు-నక్కల కూతలు)

రోహి: న న్నీ నట్టనడియరణ్యమున వదలి పెట్టి యీ యింద్రు డెచ్చటికి వెళ్ళెను? నే నీయడవిలో నేమి తిందును? ఎట్లు మందును?

(నాలుగు కోడికూతలు)

నాలుగుదినములు గడచినవి. తిండిలేదు, త్రిప్పలు లేదు. అయ్యో! తెలివితక్కువగా వచ్చితినే. దేవతలు కూడ మోసముచేయుదురే. వరుణునితో నింద్రునకు వైరమేమో! అతనికి నరపశువు చిక్కవని యితని కసూయ కాబోలును. తండ్రి నన్ను బట్టుకొని వరుణునకు బలియిచ్చునని యతడు చెప్పినమాట నిజమని నమ్మి మోసపోయితిని. భయ మెంత చెడ్డది. మన కీయాపద వచ్చునని యెవరో చెప్పినంతనే యిది నిజమా, అబద్ధమా

యని విచారణమే యుండెడు. వెంటనే యజ్ఞానమున ప్రవర్తింతును. అసలు వరుణుడు లేడు, యజ్ఞము లేదు, వాగ్దానము లేదు. ఏదియు లేకపోవచ్చును. ఇది యభూతకల్పన కావచ్చును. ఇట్టి యబద్ధములు చెప్పుట వలన నింద్రున కేమి లాభము? ఇందులో కొంత నిజముండవచ్చును. ఎంత వరకు నిజమో తెలిసికొనవలయును. తెలిసికొని నిజముగా నిం దాపద యున్నచో దానికి ప్రతిక్రియ చేయవలయునుగాని యిట్లు వచ్చి యడవిలో దాగియున్నందువలన నేమి ప్రయోజనము? చిరకాల మిట్లు తిండి లేక మాడిచావవలయును. ఇప్పటికి మాయయ్యగారివారెవరైన వచ్చినచో బాగుగా నుండును. ఇంటివద్దనివార్తలే తెలియలేదాయెను. నిన్న నెవరో యీమార్గమున బోవుచుండగా భయపడి దాగియుంటిని. ఈసారి యెవరైన వచ్చినచో దాగియుండను. దాగికొని ప్రయోజన మేమి?

(పాట వినిపించును)

ఏనంచు నేనంచు నేమియుబలాటమ్ము, తలి దండ్రు లిచ్చిన తనువు కాదంట—

రక్తమాంసపు శరీరము లేమి నిత్యమ్ము నిజమయిన మాటపై నిలువలేకుంట—

తండ్రియిచ్చిన మాట తానొసంగిన మాట నింత జాడను నీవు కొందుకాదంట—

ఇప్పుడు కాదేని రేపైని చచ్చుకాదె పారిపో లేవు మృతిపట్టుకోకుంట.

రోహి: ఏదో వ్యక్తి నన్ను గూర్చియే పాడు చున్నట్లున్నది! సమీపించినాడు. ఇతడెవ్వరో యడిగెదను. అయ్యా మీదేయూరు? మీరెవ్వరు?

బాల: నీవెవరు? ఇంత చిన్నవయసులో నీ యడవిలో నెట్లుంటివి?

రోహి: నీవు పాడిన పాట యెవరినిగూర్చి?

బాల: ఎవరినిగూర్చి యేమిటి! అడవిలో భయము లేకుండ పాడుకొనుచున్నాను.

రోహి: పాడుకొనుచున్నచో భయముండదా?

బాల: అవును. ఉండదు. ఇద్దఱున్నచో భయముండదు. మన మొకరము, పాటయొకరు.

రోహి: పాట యింకొక మనుష్యు డన్నట్లు చెప్పుచున్నావు.

బాల: ప్రాణశక్తి శబ్దరూపం దున్నంత మరి యెందు కలదు? పాడుకొంచు బోవుచుండగా శబ్దశక్తి తోడవచ్చినట్లే కదా! పాటలో మాధుర్య మున్నది. ఆ మాధుర్యశక్తులు విఘ్నశక్తులను దూరముగా ద్రోయును.

రోహి: ఆ మాధుర్యశక్తి కనిపించదుకదా!

బాల: వినిపించునుగదా! వినిపించుటకు, కని పించుటకు భేదమేమి? చెవులతో విందువు, కనులతో గందువు. చెవులు, కన్నులు రెండును రెండింద్రియములే కదా! ఒకదాని గొప్పయేమి, ఒకదాని తక్కువయేమి?

రోహి: అయ్యా! నీ వెవ్వరు? ఎవరైన మహర్షివా?

బాల: కాదోయి! నే నొక బ్రాహ్మణ బాలుడను.

రోహి: నీ పేరు?

బాల: శునశ్శేపుడు.

రోహి: నీ తలిదండ్రు లెవరు? ఇట్లడవిలో బడి తిరుగుచుంటి వేమి? కాదా: మీ యిల్లెచటనైన నిచట దగ్గరలో నున్నదా?

బాల: ఓయీ! నాగో డేమని చెప్పుదును! నన్నేపులియైనను వేసికొనిపోయిన బాగుండును. ఏ రాజైనను నరమేధము చేసి నన్ను పశువుగా వధించిన బాగుండును.

రోహి: (పకాలున నవ్వును)

బాల: ఎందుకిట్లు నవ్వెదవు?

రోహి: (ఇంకను నవ్వును)

బాల: ఇది బాగున్నది! నేను పోవుచున్నాను.

రోహి: కనపడకకనపడక కనబడి పోదునందు వేమి? రా! రా! నే నెందుకు నవ్వితినో చెప్పెదను.

బాల: చెప్పు, నెందుకు నవ్వితివి?

రోహి: (నవ్వుచు) కోపించకుము. నాకు నవ్వాగుటలేదు. ఏమియును లేదయ్యా! ఇది చిత్రముగా నున్నది. ఏమందువు, చిత్రముగా లేదా?

బాల: ఏది చిత్రముగాలేదా!

రోహి: ఏదా? ఇది. నన్ను నా తండ్రి వరుణదేవునకు యజ్ఞపశువుగా నిచ్చెద నన్నాడు. నేను భయపడి యీ యరణ్యమునకు పారిపోయి వచ్చితిని. యజ్ఞపశు వగుటకు భయపడిన నేను; యజ్ఞపశువను గావలయునని కోరెడి నీవు. ఇందుకు నవ్వువచ్చినది.

బాల: నీ వెవరవు?

రోహి: నా పేరు రోహితుడు. నేను హరిశ్చంద్ర మహారాజు కుమారుడను.

బాల: విన్నానోయి విన్నాను. మీ తండ్రి వరుణదేవునకు నిన్నిత్తునని యీయక యబద్ధమాడెనట గదా!

రోహి: ఎవ డాతలకుమాసినవా డట్లన్నది! ఆయన యబద్ధమాడినచో నే నిట్లు పారిపోయివచ్చుట యెందులకు? పారిపోయిన కొడుకు నాయన వరుణదేవున కెట్లిచ్చును?

బాల: నీవు పారిపోయి వచ్చుటచేత తండ్రి నబద్ధమాడించినవాడ వగుచున్నావు.

రోహి: నిజము తెలియని లోక మట్లనుకొను ననియేనా నీ తాత్పర్యము?

బాల: కాదు. తండ్రియే కొడుకు. కొడుకే తండ్రి.

రోహి: మరి నీతండ్రి యేది చెప్పిన నీ వది చేసెదవా?

బాల: తప్పకుండ చేసెదను.

రోహి: పద! మీయాశ్రమ మెక్కడ! మీ నాయనగారి పేరేమి!

బాల: మా నాయనగారి పేరు అజీగర్తుడు. రమ్ము. పోదము.

రోహి: సరేగాని, 'అయ్యో! నన్ను ఏపులి యైన వేసికొనిరైన పోదని మొదలుగా విచారము కల్పించితి వెందులకు! మీయింటిలో నీకు సుఖముగా లేదా!

బాల: తొందరగా రావయ్యా! పోవుచు చెప్పెదను. మేము ముగ్గుర మన్నదమ్ములము. నేను రెండవవాడను. మా తండ్రికి మా యన్నగారిమీద, నవగా పెద్దకొడుకుమీద మిక్కిలి ప్రేమ. మా అమ్మగారికి కడసారికొడుకుమీద అపేక్ష. మాయింటిలో నా కాలనలేదు, పాలన లేదు. వారిద్దరు మహారాజులవలె నుందురు. ఇంటిలో పనియంతయు నేనే చేయవలయును. చేసినదానికి మెప్పులేదు. నిత్యము తిట్లు. వంట నేను చేయవలయును. ఇల్లూడ్వవలయును. అడవికి పోయి కట్టెలు, దర్భలాకులు, నన్నియు నేనే చేయవలయును. ప్రక్కలు వేయుటదగ్గరనుండి. తొందరగా నడచిరా: కానిచో నడవిలోనె ప్రొద్దు క్రుంకును.

రోహి: నేను చిన్నవాడను, నీవు పెద్దవాడవు. నీతో నడువవలదా! పైగా నాల్గునాళ్ళనుండి తిండి లేదు.

బాల: నా కేరోజునను గడుపునిండ తిండిలేదు. నీవు నాకంటె చిన్నవాడవైనను నాకంటె తెలివిగలవాడవు. ఎట్లయినను రాచబిడ్డవుకదా! లౌకికముగా మీకున్న తెలివి మా కుండదు. చూడుము. తండ్రి వరుణునకు యజ్ఞపశువుగా నిచ్చునని పారిపోయివచ్చితివి. నేనో-ఆయింటిలోనె పడి చచ్చుచున్నాను.

రోహి: నీ వెప్పుడు పారిపోవుదమని యనుకొనలేదా!

బాల: అనుకొనుటా! అది యధర్మముగదా! అనుకొనుటయెట్లు? అనుకొనగలిగినచో నదియు ధర్మమే యనిపించును.

రోహి: ఇదియా! నీకును నాకును భేదము. సరే, యిప్పుడు మీ తండ్రి నిన్ను యజ్ఞపశువుగా పొమ్మన్నచో నీవు పోదువా?

బాల: తండ్రి పొమ్మన్నచో పోకతప్పునా ?

రోహి: చావన్నచో నీకు భయములేదా? అవునులే. అంత భయమయినచో బాదుకొందువు.

బాల: రోహితా, నీవయ సెంత?

రోహి: పదునొకండు సంవత్సరములు. నీ వెందు కడుగుచున్నావో నాకు తెలియునులే.

బాల: తెలియనుగాన చెప్పుచున్నాను. ఒకటి వరుణు డంగీకరించవలయును. రెండు మానాయనగా

అంగీకరింపవలయును. ఇదిగో మాయిల్లు. ఆ ముంగిట గూర్చున్నవారు మా నాయనగారే.

రోహి: అజీగర్తమహర్షీ! నమస్కారము.

అజీగ: ఏమిరా! శునశ్శేఫా! యిప్పటికి బోయినావు? నీ మందమతికి దోడు నీకు మరల నింటికి దారికూడ దెలిసినదా! సంధ్యావందనపు ముక్కలైనను రావు. ఇంటిలోనికి బోయి యగ్నిలో నముకపోసి భద్రపఱుపుము. ఈ కుర్రవాడెవరు? రాజకళ వెల్ల గ్రక్కుచున్నాడు.

రోహి: అయ్యా! నేను హరిశ్చంద్ర మహారాజుగారి పుత్రకుడను. నా పేరు రోహితుడు.

అజీ: ఏమి యిట్లడవులబడి వచ్చితివి?

రోహి: అడవులబడి రాలేదు. స్వామీ! న్యాయమైన మార్గముననే వచ్చితిని. మా నాయనగారు వరుణదేవతాకమైన యాగము చేయుచున్నారు. వరుణుడు నరపశువు కావలెనని కోరినాడు.

అజీ: ఆకథ నేనును విన్నాను. మీ తండ్రి నాల్గుదినముల నుండి జలోదరవ్యాధిచే యమయాతన పడుచున్నాడట. మా యాశ్రమవిద్యార్థులు చెప్పిరి.

రోహి: మరి యేమిగతి?

అజీ: తండ్రిమీద నంత ప్రేమ గలవాడవేని వెంటనే యింటికి బోయి యజ్ఞపశువు కమ్ము.

రోహి: ఓయయ్యా ఋషిసత్తమా! నాకు ప్రాణము మిక్కిలి తీపిగా నున్నదయ్యా!

అజీ: లోకములో నెవరికి తీపికాదు?

రోహి: నిజమే స్వామీ! నాకు వోలెనంత రాజ్యమున్నది. అనంతమైన గోధనమున్నది. ఏమియు లేనివాడనైనచో నైహికసుఖ మెట్టును లేదని విరాగభావ మవలంబించెడివాడను. ఇంత సుఖము పొందగలను. మరింత సుఖము కోనగలను. వృథాగా జచ్చిపోదునా?

అజీ: నిజమే. నీవంటి రాచబిడ్డ చనిపోవ రాదు. కావలెనన్నచో బద్ధిమంది దారిద్ర్యము తొలగించువాడు నిష్కారణముగా నేల చనిపోవలయును?

రోహి: ఆ వరుణునకు నరపశువు తప్పక కావలయునట. ఇది కొనెకిదా, పెట్టెకిదా!

అజీ: ఏమోలే! ధనమూల మిదం జగత్తన్నారు. ధనమిచ్చినచో నీబదు లెవడైనను పశువగుటకు రావచ్చును.

రోహి: ఎవరు వత్తురు స్వామీ! వారియంతట వారు రారు. కాని తండ్రియాజ్ఞ బడి యేకొడుకైన రావచ్చును. మీరకే రమ్మనుచున్నానా? ఎంత యడిగిన నంత యిత్తును.

అజీ: ఎంత యిచ్చెదవేమి?

రోహి: మీరే యడుగుడు.

అజీ: నాకొడుకును నే నీయను.

రోహి: తమకు ముగ్గురు కుమారులుకదా!

అజీ: మాయావిప తన కొడుకు నీయదు.

రోహి: మిగిలినవా డున్నాడుగదా!

అజీ: నరపశువు కాదగినవాడు తా నంగీకరింపక పశుత్వము సంభవిల్లదు.

రోహి: ఆయనచేత నంగీకరింపజేసికొనుట నాకు వదలిపెట్టుడు.

అజీ: అట్లు పశువైనవానికి నుత్తరలోకములు ప్రాప్తించును.

రోహి: ఐహికాశచేతగాని యది యేమి తక్కువవిషయమా! వేదములయందు : బొగడదగిన విషయము.

అజీ: అది యొప్పుకొను నందువా?

రోహి: ఆసంగతి మీ కెందుకు? మీ రనుమ తింతురా!

అజీ: మీరిద్దఱు గలసి వచ్చితిరి. నీతో నత డట్లు చెప్పినా? ఇంత నిశ్చయముగా చెప్పుచున్నావు.

రోహి: ఆ! చెప్పినాడు. మీ రనుమతింతురా?

అజీ: ఏమిరాచబిడ్డవయ్యా! చమత్కారముగా నాచేత నంగీకరింపజేయుచున్నావు.

రోహి: నీకొడుకున కుత్తమలోకప్రాప్తి, ఒకని ప్రాణరక్షణము చేయు నుపకారఫలము. తమరు సుఖ

ముగా బ్రతుకవచ్చును. మీ కేమికావలెనో, యడుగుడు. వీక విషయమునందు మూడు దీర్ఘమైన ఫలితములు కనిపించుచున్నవి.

అజీ: నీయిష్టము వచ్చినది యిమ్ము.

రోహి: ఏబది గోవుల నిచ్చెదను.

అజీ: కాదు. వందగోవులిమ్ము.

రోహి: అట్లే. నన్ను శునశ్శేపుని గొనిపోయెదను. స్వామీ! మీరుకూడ యజ్ఞమునకు రావలయును.

అజీ: తప్పకుండ వచ్చెదను.

రోహి: మీకుమారు డేడీ! ఏమయ్యా! శునశ్శేపుడా! మీతండ్రిగారు నిన్ను నాకిచ్చిరి. పోదము రా!

శున: నీకు నన్నమ్మిరా?

రోహి: అవును.

శున: ఎంతకు?

రోహి: వందగోవులకు.

శున: వందగోవులే! ఓయి! వెర్రి రాచకుమారుడా! చాల వెలపెట్టితివి. నే నొక్క గోవుకంటె నెక్కువ వెలచేయను. గోవు నయముకదయ్యా! హవిస్సును సమకూర్చును.

రోహి: నాబదులు నిన్ను వరుణునకు యజ్ఞపశువుగా గొంటిని.

శున: సరే! నాయనగారూ! సెలవు. ఇంక మీరు తండ్రి కారు, నేను కొడుకును గాను.

అజీ: రోహితా! యజ్ఞమునకు దప్పక వత్తును.

శున: అవునయ్యా! నావంటి కొడుకువలన నేమి ప్రయోజనము? నాకు వేదము రాదు. నేను పంక్తికుడను గాను. నావలన వంశమునకు వచ్చెడు ప్రతిష్ఠ లేదు. అన్నిటికంటె నేను తండ్రికి పెద్ద కొడుకును గాను; తల్లికి చిన్నకొడుకును గాను. యజ్ఞపశువ నగుటకు నడిమికొడుకను.

రోహి: పదవయ్యా! పోదము.

శున: తండ్రి యిచ్చినతరువాత నెందుకు రాను? పారిపోయి యడవిలో దాగికొననులే! కొడుకు తండ్రి సొత్తు. తండ్రి వాని నమ్మినచో నతడు వెలపోత్తసును. ఇది పురాతనధర్మము. ధర్మము తెగించిపోవువాడను గాను.

అజీ: నీవు శునశ్శేపుడవేనా!

శున: అవునయ్యా! శునశ్శేపుడనే. నీచేత-కన్నతండ్రిచేత యజ్ఞపశువుగా వందగోవుల కమ్ముడుపోయిన నీ నడిమికొడుకును శునశ్శేపుడను.

అజీ: అరే! ఇన్నాళ్ళు గంగిగోవవు. ఇన్నాళ్లు మూగవు. ఇన్నాళ్లు మందబుద్ధివి. ఇన్నాళ్ళలసుడవు. ఇంత వాచాలత, యింత నిందాగర్భోక్తి యెచటినుండి వచ్చినవి?

రోహి: అది యేమయ్యా! నీకొడుకు గొప్ప కవి. గాయకుడు. ఆయన నట్లనెదరేమి?

అజీ: కవియా? గాయకుడా?

శున: పదవయ్యా! రోహితా! పోదము.

పద యయ్య మీపురికి రోహితా
పశువుగాని నన్ను గరుణాహితా—
కట్టనియలోకములలోనా!
అబ్దమయకాలమువిలీనా
కారమయి మృత్యువయి కదలాడుచున్నయది
కారయిత కర్తాధికార మవలంబించి
మృత్యువును గెలువగల దేమో
సత్యపథమును జూపునేమో—

రోహి: అదుగో మా తండ్రిగారు!

శున: రాజా! అబద్ధమాడితి నన్న దోషము నిన్నంటకుండుగాక.

హరి: బ్రాహ్మణపటువా! నమస్కారము. ఎవరవయ్యా నీవు?

శున: నాపేరు శునశ్శేపుడు. నాతండ్రి యజీగర్తుడను ఋషి. నీ కొడుకు తన బదులు నన్ను యజ్ఞపశువుగా విలిచి తెచ్చినాడు.

హరి: నీ-కంగీకారమేనా?

శున: నాకంగీకారమేనా కాదు. వరుణున కంగీకారమేనా యని.

హరి: కావచ్చును. నీవు పటువవు. అన్యదేవతాకమైన యేయజ్ఞమును నీవు చేయలేదు. వయసుచేత చిన్నవాడవు. నాకొడుకు బదులు నేను యజ్ఞపశువ నగుదు ననగా వరుణుడు నన్నీ కారణములు చెప్పి నేను పనికిరానన్నాడు.

శున: మరి యైనచో వెంటనే యజ్ఞ మారంభింపుడు.

రోహి: నాయనగారూ! క్షమింపుడు. అజ్ఞుడనై పారిపోయితిని. మీ యీవ్యాధికి గారణమైతిని.

హరి: వ్యాధియన్న వ్యాధియా యిది!
నదులు ప్రవహించుచున్నవి నాకడుపున
నగము లాడుచునున్నవి నాకడుపున
ఊపిరాడుట లేదు నీ వొగిని వచ్చి
నపుడె యామాత్రమైన మాటాడుచుంటి.

శున: సర్వమును యజ్ఞాభిముఖమై యున్నదికదా! అందుచేత మీకు నెమ్మది యిచ్చినది. యజ్ఞావసానమునకు వ్యాధియే యుండదు.

హరి: అది కాదయ్యా! వ్యాధిమాట యట్లుండుము. నే నబద్ధము చెప్పితి నందురేమి? కొడుకు ననుపనీతుని యజ్ఞపశుత్వమున కనర్హు నని చెప్పితిని. వరుణు డంగీకరించినదే. అది నాయందు దోషముగా చెప్పన నెట్లు?

శున: లోకమునకు నీతియేమి?

హరి: వరుణుడు దైవముకదయ్యా!

శున: దైవముమాత్రము లోకములోనివాడు కాదా! అది వేరేలోకమగుటకాని.

హరి: ఇంతటి మేధాశాలిని నిన్ను యజ్ఞపశువుగా నెట్లుచేయుదును? ధనమున కాశపడి నీ తండ్రి నిన్నెట్లు వదలిపెట్టెను?

శున: ధనమిచ్చి నీకొడుకు నన్నెట్లు తెచ్చెను? ప్రాణమునందలి తీపిచే నీకొడు కిట్లు చేసెను. ధనమునందలి యాశచే నాయన యట్లు చేసెను. ఒకటి ప్రాణమునందలిది, రెండవది ధనమునందలిది. రెండును ఆశలే.

హరి: ఇంత హృదయపరిశీలన చేసెడివాడవు నాయందుమాత్రము దోషము చూపింపవా?

శున: నీయందేనా! వాయందు దోషములేదా?

రోహి: నాయనగారూ! ఈయన నీయన తండ్రి మందమతి యనుకొనుచున్నాడు.

శున: దానికి గారణము వేరే యున్నది. తండ్రి సాక్షాత్పరదైవతము. ఆయనయెదుట నే నేమియు మాటాడెడువాడనుగాను. ధర్మము కాదుగదా!

హరి: ఆ తండ్రి యమ్మినాడని పశువుగా వచ్చినావా, నీబుద్ధిపూర్వముగా వచ్చినావా?

శున: నాబుద్ధి, నాయంగీకారము, నాయాలోచన తండ్రియాజ్ఞవిషయములో లేవు. తండ్రియాజ్ఞబడి నేను వట్టిపశువను. ఈ శరీర మాయనవలన గలిగినది. ఈ శరీరముమీద నాయన యధికారి. కనుక వెంటనే యజ్ఞ మారంభింపుము.

హరి: ఆరంభించుట కేమున్నది? కడచిన పది యేండ్లనుండి నిత్యము సర్వము యజ్ఞాభిముఖముగానే యున్నది. పైగా కొడుకు తా నంగీకరించునని యెంచి సర్వస్వాలను బిలిపించితిని. సర్వసంభారములను సమకూర్చితిని. ఆరంభించుటయే ఆలస్యము.

శున: మరి చూడుము. లోకము నిన్నబద్ధ మాడితి వనుచున్నది. సరేగాని యేయే ఋషులు వచ్చిరి?

హరి: జాబాలి, కశ్యపుడు, అత్రి, అంగిరసుడు, వశిష్ఠుడు అందఱును వచ్చిరి.

శున: విశ్వామిత్రమహర్షి వచ్చెనా?

హరి: ఆయనయు వచ్చెను. ఆయన యెందులకు రారు? ఆయన మావంశీయుడే కదా!

శున: అవునయ్యా! ఆమహర్షి యుదయించుట చేత మీవంశమేమి, సర్వజగత్తును పవిత్రమైనది.

హరి: విశ్వామిత్రుడన్నచో నీ కెంత గౌరవమున్నది?

శున: నాకేమి? యెవరి కుండదు?

తాను రాజయి రాజర్షియై నిరంత
తపముచేత బ్రహ్మర్షియై తనకు దాని
సాటిదైయున్న యా ఋషీశ్వరుడె నేను
కామగా వాని కొడుకైన గానుగాదె!

హరి: ఓయి శునశ్శేఫుడా! నీవు విశ్వామిత్రుని కొడుకవైన కావని యెంత యనుకొనుచుంటివో నేను నీకు దండ్రినైన గానని యంత యనుకొనుచుంటిని.

శున: ఓయిరాజా! నీ కాదికు లెందుకు? నీవు నాకు దండ్రివగుటయే కాదటయ్యా! నీకొడుకునకు మాఱు నేను నీయజ్ఞమున బలియగుట.

(జలపాతధ్వని)

హరి: ఓయి బ్రాహ్మణవటువా! నీ కింతబుణపడితి నయ్యా? వరుణదేవుడు వచ్చుచున్నాడు. ఉఱుములతో, మెఱుములతో వచ్చెడువాడు జలపాతధ్వనులతో వచ్చుచున్నాడు. ప్రసన్నుడై వచ్చుచున్నాడయ్యా.

వరు: ఓయి హరిశ్చంద్రా! నీకొడుకు తిరిగి వచ్చినాడటగదా!

హరి: వచ్చినాడు స్వామీ!

వరు: మఱి యజ్ఞపశువును తెచ్చెదవా?

హరి: చిత్తము. కాని, ప్రభూ! అతనిబదులు నేను యజ్ఞపశువుగా నగుట పనికిరాదని తమ రేమి యభ్యంతరము చెప్పిరి?

వరు: ఇతర దేవతాభావము తగులని మనః ప్రవృత్తి కలవాడే నాకు బలివుగా గావలెనని చెప్పితిని.

హరి: అట్టివాడు నాకొడుకే కావలెనా, మఱి యెవ్వరైన బనికివత్తురా?

వరు: నీకొడుకు సుక్షత్రియవంశజాతుడుకదా!

హరి: వాడు సుబ్రాహ్మణవంశజాతుడైనచో...

వరు: మఱీ నయము.

హరి: అంతియేకాదు. ఇతడు పశుత్వమున కంగీకరించినవాడు. నాకొడుకు కంగీకరింపనివాడు.

వరు: అయినచో మఱియు నిష్టముకదోయి!

హరి: ప్రభూ! ఈ బ్రాహ్మణబాలకుని నీవు గ్రహించి నే నబద్ధమాడితి నన్న దోషమును బరిహరించెదవా?

వరు: తొలుత నీ వబద్ధమాడితి వన్న దోషమే లేదు. పరిహరించుట యెట్లు ఘటిల్లును?

హరి: నేను అబద్ధమాడనివాడ నైనచో నన్ను జలోదరవ్యాధి గలవానిగా నేల శపించితివి?

వరు: ఓయీ! నేను యజ్ఞపశువునందు విగ్రహీతుడనై కోపమంది నిన్ను శపించితినిగాని నీవు మృషావాదివగుటచేత గాదు. సరే! యజ్ఞమారంభింపుము.

హరి: ఆరంభింపనేవలసినది. సర్వస్వములు విచ్చేసిరి. ఈ బ్రాహ్మణబాలుని తండ్రియు వచ్చినాడు.

వరు: అతని తండ్రియు వచ్చెనా! దివ్యముగా నున్నది. దిక్కులేనివానిని నేను పశువుగా గ్రహించుట లేదన్నమాట.

హరి: చిత్తము; అన్నియు సిద్ధమైనవి. అతిరాత్రోక్థ్యాది క్రతువు లైనవి. ఇంక బలిపశువుని యూపమునకు బంధించుటయే పరిశిష్టము. స్వామీ! జమదగ్ని మహర్షీ! నిన్ను నేను అధ్వర్యుడుగా వరించితిని. నీ వీపశువైన బ్రాహ్మణబాలుని యూపమునకు బంధింపుము.

జమ: ఓయీ రాజా! ఈ క్రూరకర్మ నేను చేయను. కర్మభాగమైన మంత్రక్రియలు మాత్రమే చేయుదునుగాని తేజస్వంతుడైన బ్రాహ్మణ బాలుని యూపమునకు బంధించుటవంటి క్రూరకర్మ నేను చేయజాలను.

హరి: స్వామీ! పశువును యూపమునకు బంధింపక హింసించుట యెట్లు?

జమ: ఎట్లో నాకు దెలియదు. ఇం దెంత మందియో ఋత్విక్కు లున్నారు. వారినడుగుము.

హరి: మహర్షులారా! మీ రెవ్వరైన నీబాలుని యూపమునకు బంధింపుడు.

అందఱు: మేము చేయము ఈ క్రూరకర్మ మేము చేయము.

విశ్వా: రాజా!

వరు: ఓయి! విశ్వామిత్రు డేదో చెప్పబోవుచున్నాడు, వినుము.

హరి: బ్రహ్మర్షీ, నా కిప్పుడు గతియేమో చెప్పుము.

విశ్వా: ఓయి రాజా! ఈ క్రూరకర్మ యెవ్వరును జేయరు. చేయదగినవా డొక్కడే యున్నాడు. వీ

యితనితండ్రి వందగోధనము గ్రహించి యితనిని బలిపశువుగా నిచ్చినాడో ఆ తండ్రియే యితనిని యూపమునకు బంధింపవలయును.

హరి: ఓయి అజీగర్త బ్రాహ్మణుడా! నీ కుమారుని నీవే యూపమునకు బంధించిపెట్టుము. నీ వట్లు చేయనిచో నాకు నీ కొడుకును యజ్ఞపశువుగా నిచ్చి యేమిలాభము?

అజీ: రాజా! మరి నాకేమి లాభము? కొడుకును యజ్ఞపశువుగా నిచ్చుటచేత నిదివరకే క్రూరకర్ముడ నయితిని. మరల క్రొత్తగా నగుట యేమున్నది? తొలుతటిది వందగోవులకు జేసితిని. మరి దీని నేమి చూచి చేయుమందువు?

హరి: అయ్యా! మరి వందగోవు లిచ్చెదను.

అజీ: అట్లేచేయుదును. ఓయి శునశ్శేఫుడా! రమ్ము. నిన్ను యూపమునకు బంధించుచున్నాను.

(అందరు - ఛీఛీ)

వసి: ఓయి! హరిశ్చంద్రా! ఇంతవరకు సరిపోయినది. యూపమునకు బంధింపబడియున్న పశువును వధించువా రెవరు?

విశ్వా: బంధించుటకే యంగీకరింపని యెవరు వధింప నంగీకరింతురు? అదియును తండ్రియే చేయవలయును.

హరి: అయ్యా! అజీగర్త బ్రాహ్మణుడా! ఈపని కూడ నీవే చేయవలయును. నీవు చేయనిచో యజ్ఞపశువుగా నీకొడుకును నాకిచ్చి ప్రయోజన మేమి కలదు? యజ్ఞపశువుగా నిచ్చుట వధింపబడుటకే గదా!

అజీ: రాజా! ఇతని వధకు నేను మున్నే యంగీకరించితిని. ఇపుడు వెనుకాడి యేమి ప్రయోజనము! మరి దీనివలన నాకేమి లాభము?

హరి: మరియు నింకొక వందగోవు లిచ్చెదను.

అజీ: ఓయి శునశ్శేఫుడా! ఇదిగో యూపమునకు బంధింపబడిన నిన్ను - వరుణదేవతాపశువైన నిన్ను వధించుటకు సిద్ధముగా నున్నాను.

(అందరు బిగ్గరగా - ఛీ ఛీ)

శునశ్శేఫుడు: (పాట)

నెతి నంతరిక్షస్థానీయులౌ వేల్పులలో
వరుణుడూ ప్రధానుడూ
రాత్ర్యభిమానీ బలపరాక్రమశాలీ.
వరుణునీ కన్న విహ్వలవేగశాలులూ
మతి దేవతలు లేరూ, పరాక్రమ
స్ఫురణ వానిది వేఱూ.
వరగ నైదవ భూతములు సం
భరితతేజో విహ్వలములై
తిరుగు వరుణుని చుట్టు
రాత్రించరసురాసంభరితనై ఖరి.—నెతినంత.

అంతరిక్షగుడై ఆకాశమున పోవు
అంశజాదుల స్థానమూ
అంభోధిగతు డౌచు సమ్మార్గమున నేసు
యాదస్తతుల స్థానమూ
జననమృత్యువుల సంస్థానము తెలిసిన
సాధుమోహనమూ శ్రీ-వరుణుడు
పరమదయచే యూపమున
నీపగిది బంధింపంగబడి దు
ర్మరణమందుచున్న నాపై
మహితకృప వహియించుగావుత. నెతి నంతరి.

అజీగర్తుడు: ఓయి శునశ్శేఫుడా! ఏమోయి, స్తోత్రములు చేయుచున్నావు! నీవు గాయకుడవని, కవివని రోహితుడు చెప్పినాడు. నేను విశ్వసించలేదు. నా కడుపున బుట్టినావు. నాయింట పెరిగినావు. నే నెన్నడు నీ యీ లక్షణము లెరుగను. యూపబద్ధుడవై ఋషివలె గానముచేయుచున్నావు.

శునశ్శేఫుడు: (పాట)

సప్తసింధురాజా, వరుణుడు
సప్తసప్తితేజా, వరుణుడు
మరణవేళ నేనూ, వరుణుని
మహిమనంతు శరణూ, చొచ్చితి
దురితనిగళములనూ, త్రెంచుచు
పరమ కృపను జూచూ, వరుణుడు
సప్తసింధురాజా-

వరుణుడు: ఓయి శునశ్శేపుడా! నీవు మహర్షి వైతివి. మంత్రద్రష్ట వైతివి. నిన్ను నేను పశువుగా నంగీకరించను. నీ యూపబంధనములు తెగిపోవుచున్నవి. నిన్ను నేను విముక్తుని జేసితిని.

శునశ్శేపుడు: ఓయి వరుణదేవా! కృతార్థుడను. ఈ హరిశ్చంద్రునకు యాగఫల మిమ్ము. నన్ను వదలి పెట్టియు నరమేధఫలము హరిశ్చంద్రునకు ప్రాప్తించు నట్లు దయచూడుము.

వరుణుడు: ఓయి ఋషీ! అస్మద్దేశాకము లైన ఋక్కులు వేదభాగమునందు లెక్కవగా గలవు. అందుచేత నిది యంతయు నేను సన్నివ సన్నగడ. నీకీర్తి సర్వవేదమార్గములందు ప్రకాశించును. అదిగో సర్వఋత్విక్కులును నిన్ను ప్రశంసించుచున్నారు. నీమహిమచేత నీయజ్ఞము సంపూర్తి నందినది. నీ యిచ్చవచ్చిన చోటికి నీవు పోవచ్చును.

శున: వరుణదేవా! నా తండ్రి నన్ను యజ్ఞపశువుగా నమ్మివేసెను. నేనిప్పుడెచ్చటికి బోదును?

వరు: నీ విప్పుడు మంత్రద్రష్ట వైతివి. ఈరెల్ల ఋషులును నిన్నిపుడు పుత్రునిగా స్వీకరించుటకు సిద్ధముగా నున్నారు.

శున: అట్లయినచో నేను విశ్వామిత్రుని నా తండ్రిగా వరించుచున్నాను.

అజీగర్తుడు: ఓయీ! నేను నీతండ్రిని. నన్ను వదలి యెందుకు పోయెదవు?

విశ్వామిత్రుడు: ఓయీ అజీగర్తుడా! ఇతడు నన్ను తండ్రిగా వరించినాడు. ఇతనిని ప్రజాపత్యాది దేవతలు రక్షించి నాకిచ్చినారు. ఇతనిని దేవతలు రక్షించినారుగావున నేటినుండి దేవరాతుడని పిలువబడును.

అజీ: నాయనా! మన యింటికి పోదము రావోయి! నీ వాంగిరసుడవు. అజీగర్తసుతుడవు. మంత్రద్రష్టవు. మన గోత్రము వదలి పెఱగోత్రమును బోషింపకుము.

శున: అకట పసువుగాగ నమ్మినయప్పుడు
కాను సుతుడ, నేడు గాను సుతుడ
గత్తిపూని నాదు కంఠమ్ము కోయగా
నైన యపుడు నేను గాను సుతుడ.

ఇప్పుడు సుతుడను. నీవు సంపాదించిన మూడు వందల గోవులను నేను కాయలేను. నీ పాపము ప్రతి సమాధేయము కాదు. నేను ఒ ను, పొమ్ము.

విశ్వా: దేవరాతా! నాయనా! రావోయి! వేద మార్గములందు మంత్రద్రష్టల సమూహమునందు నా పేరుతో గలసి నీపేరు మంగళసంచారము చేయుగాక!

శున: బ్రహ్మర్షీ! రాజర్షిత్వమును బ్రహ్మర్షిత్వమును జేసినవాడవు- నా యాంగిరసత్వమును వైశ్వామిత్రత్వముగా జేయుము. నీవెంటనే వచ్చుచున్నాను.

హరి: ఓ ఋత్వంశల సంచార దేవతలారా! మహాత్ములారా! ఇది యంతయు నా కేదో యబద్ధ దోషము గల్పింప నెంచిన వ్యూహముగా భావించితిని. నా హృదయమునందు లేని యబద్ధము దుర్వాదములు కల్పించితి. వరుణదేవుడే ప్రత్యక్షముగా వది లేదనెను. ఇది యంతయు నాత్మ ఋగపకరణవాంఛనై వరుణదేవుడు కల్పించిన కథ. ఓ మహాత్ములారా! ఓ ఋగ్ద్రష్టలారా! విశ్వామిత్రదేవరాతులారా! మీతో పాటు నేనుగూడ—

ఋష్యాశ్రమములందు జరించుచుండు
పుణ్యవాక్యమ్ములెల్ల హరించుచుండు
దివ్యవాకారమును ధరించుకొండు
ప్రాచ్యకథాళిలో మూర్తి ప్రబలుచుండు.

# తిక్కన కళాకౌశల్యము

**శ్రీ డి. రాజశేఖర శతావధాని**

తిక్కనసమకాలికుడగు కేతనకవి తన దశకుమార చరిత్రమును తిక్కన కంకితము చేయుచు నతనిని గూర్చి—

"సుకవీంద్రబృందరక్షకు డెవ్వ డనిన నీ
డను నాలుకకు దొ డ్డైనవాడు
చిత్తనిత్యస్థితశివు డెవ్వ డనిన నీ
డను శబ్దమున కర్థ మైనవాడు
దశదిశావిశ్రాంతయశుడు డెవ్వ డనిన నీ
డని చెప్పుటకు పాత్ర మైనవాడు
సకలవిద్యాకళాచణు డెవ్వ డనిన నీ
డని చూపుటకు గుఱి యైనవాడు
మనుమసిద్ధిమహీశసమస్తరాజ్య
భారధౌరేయు డభిరూపభావభవుడు,
కొట్టరువుకొమ్మనామాత్యుకూర్మిసుతుడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి!"

అని వర్ణించియున్నాడు. ఈగ్రంథ మన్నిటి కన్న సర్వోత్తమ మైనది. దక్షిణాపథభాషాగ్రంథముల కెల్ల వజ్రమయకిరీటోపమానము. ఆంధ్రసారస్వతకల శాంబురాశి నవతరించిన యమృతభాండము.

భారత మనేకసహస్రముల గ్రంథము. పదునెనిమిది పర్వములు. ఆదిపర్వము, సభాపర్వము, అరణ్య పర్వమున గొంతభాగము నాంధ్రకవిలోకమందారుడు నన్నపార్యుడు రచించెను. విరాటము మొదలు స్వర్గారోహణమువఱకు గల పదునేను పర్వములను గవిబ్రహ్మ తిక్కశౌరి రచించెను.

తిక్కయజ్వ విశిష్టప్రవంశప్రభవుడు. వైదికాచారపరుడు. సకలవిద్యాచతురుడు. వినయగుణవిరాజితుడు. తనకు ము న్నాంధ్రభారతము నారంభించి రచించిన నన్నయ్య నాచార్యునివలె భావించి యా యనయెడ నపారగౌరవ ముంచి—

"ఆదరణీయసారవివి
ధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ
సంభృతమై పెనుపొంది యుండ నం
దాది దొడంగి మూడు కృతు
లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహి
తాత్ముడు నన్నయభట్టు దక్షతన్."

అని వర్ణించుకొన్నాడు. ఇందలి "యాంధ్రకవిత్వవిశారదుండు", "విద్యాదయితుండు", "మహితాత్ముడు" వీనిని శ్రద్ధమై హృదయమున కెక్కించుకొదగును. "దక్షతన్" అనునది సత్త్వద్యోతకమగు పరిపుష్టశబ్దము. తిక్కన బాల్యమునుండియు దైవభక్తి గలవాడు. హరిహరనాథు డీయనయుపాస్యదేవుడు.

"కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే."

అని ప్రార్థించువాడు.

హరిహరనాథుడు సాక్షాత్కరించినపుడు—

"'జననమరణాదులైన సంసారదురిత
ములకు గనబడకుండంగ దొలగు దెరువు
గనువెలుంగు నీకిచ్చితి' ననిన లేచి
నిలిచి సంతోష మెదనిండ నెలవుకొనగ,"

ఇటు లాధ్యాత్మికపరము బడసినాడట. హరిహరనాథుని కృతినాథు గావించుకొని—

"ఇట్టి పదంబు గాంచి పర
 మేశ్వరునిం గృతినాథు జేసి యే
పట్టున బుణ్యమూర్తియును
 భారతసంహిత జెప్పగంటి! నా
పుట్టు కృతార్థతం బొరసె!
 బుణ్యచరిత్రుడ నైతి! నవ్విభుం
గట్టెద బట్టమప్రతిమ
 కారుణికత్వమహావిభూతికిన్!"

అని యుత్సాహముతో కథాసంతతియు మననము చేసి, రసానందమున దేలి "యాంధ్రావళి మోదమున్ బొరయునట్లుగ, మహాకవిత్వదీక్షావిధి పద్యములన్ రచించెదన్" ఇది యాయనచేసిన శపథము.

విరాటోద్యోగపర్వములు రెండును ప్రావృట్కాలమున నుభయకూలముల నొరసి యుప్పొంగి పాఱు మహానదీప్రవాహమువలె నడచిన యద్వితీయభాగములు. తిక్కనకవితాప్రౌఢికి, ప్రతిభానిరూఢికి దగినట్లు విరాటపర్వమున గథావస్తువు పుష్టమైనది సమకూరినది. కేవలము శ్రవ్యకావ్యలక్షణములేగాక, దృశ్యకావ్యలక్షణములనుగూడ మేళవించి యనుపమాన రసాస్పదముగ కవిబ్రహ్మ కవిత సాగించినాడు. ఆయీ రెండు పర్వములయందలి ప్రాశస్త్యమును గొండలవంటి పండితాఖండలులును, విశ్వవిఖ్యాతులైన విమర్శకులును వేయి విధముల వివరించి వినుతించి యున్నారు. విరాటపర్వము తిక్కనకవితాసౌష్ఠవమునకు నిలువుటద్దము వంటిది. భారతగ్రంథహర్మ్యరాజమున నెత్తిన మహామాణిక్యదీపము!

"భవదాజ్ఞాదృఢబంధసంయమితతం
 భద్వేగమై కాక, నా
డవలీలన్ మన యగ్జవద్విపము క్రో
 ధావేశదుర్దాంత ద
ర్పవిలాసోద్భటభంగి నేపఱి కా
 రవ్యాంబుజశ్రేణి జి
క్కువడన్ జేయదె యొక్కట్రేల్మడిన నీ
 కున్ వేడ్క సంధిల్లగన్!"

"ఖాండవ మేర్చె! దేవతలు
 గానని యీశ్వరు గాంచె! దోర్బలో
ద్దండమహాసురప్రతతి
 దర్ప మడంచి ప్రియం బొనర్చె, యా
ఖండలు డున్న గద్దియ స
 గంబున నుండె! మహానుభావు డీ
తం డొక మర్త్య జేరి యను
 దాత్తత నెమ్మెయి గొల్చువా డొకో!"

ప్రత్యేకప్రత్యేకముగా పాండుకుమారుల వేషభాషాపరిగ్రహణప్రకారములును, సైరంధ్రీ వర్తనాదులను జదివి యానందింపవలసినవి. అవ్వల సైరంధ్రీ కీచక సంభాషణాదికములు రససమాకీర్ణములు. విరాటుని సభకడ బరిభవానంతర మారాత్రి ద్రౌపది మహానసశాలలో భీమసేనునితో సంభాషించు ఘట్టములు నిరుపమానములు. వ్యాసమహర్షి కవిత్వమునకు కవిబ్రహ్మ తెలుగులిడిన తావు లెన్నియేని గలవు!

"ఉత్తిష్ఠోత్తిష్ఠ! కిం శేషే!
భీమసేన మృతో యథా!
నామృతస్య హి పాపీయాన్
భార్యా మాలభ్య జీవతి."

"నన్ను బరాభవించి సద
 నంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సు
 ఖోచితశయ్యను నిద్రసేయ నీ
కన్ను మొఱంగుదచ్చు నూఱటకు
 గారణ మెయ్యది భీమసేన! మీ
యన్న పరాక్రమంబు వల
 దన్ననొకో దయమాలి తక్కటా!"

'నన్ను' అనుటలో ద్రౌపదియాభిజాత్యాదులు వ్యక్తమగుచున్నవి! 'కన్ను మొఱంగుదచ్చునూఱటు' యనుటలో మిక్కిలి యూత (Emphasis) గలదు. వ్యాసుని శ్లోకమునకును, తిక్కన తెఱంగునకును వ్యత్యాసము విజ్ఞు లెఱుగుదురు.

"దశనాగసహస్రాణి హయానాం హేమమాలినాం, యం యాంత మనుయాంతీహ సోయం

ద్యూతేన జీవతి"—"పదివేల యేనుగులు, పదివేలగుఱ్ఱము"
లని యంగడిపట్టీల వలె నున్నదానిని కవిబ్రహ్మ—

"ఎవ్వని వాకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నణగు
నెవ్వని గుణలత లేడు వారాసుల
కడపటికొండపై గలయ బ్రాకు
నతడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణిపేష్టితాంఘ్రి
తలుడు! కేవలమర్త్యుడే ధర్మసుతుడు!"

ఇచ్చట రసమద్రము జాలువాఱుచున్నది!
అలరువిలుతు పూవుటమ్ములవోలె
అమ్మహీపతుని చిత్తమునకు వచ్చువాడు
ఊర్పుగాడ్పుల పరిమళముల్ల సిల్ల
చిత్తము నీరయిపోయె
అనార్యుడు కార్యమునందు
మెఱపు మెఱసిన తెఱగున దరియజొరుము
నీకు జుట్టంబు పక్కంబు నీవ
పేదమనసుట ధర్మము గాదు
సచేతనత్యాగధ్వజములు
నవదివియలు చేసె
రుచిపై గన్నిడియున్నాడు

—ఇట్టి పలుకుబడు లీగ్రంథమున నుప్పతెప్పలుగా బొడకట్టుచున్నవి!

"కందమునకు సోమయాజి ఘను డందు"రనునది సామెత రైనది. అన్నివృత్తములయందు నీతడు సిద్ధహస్తుడు. సమపాదముల మొదల జగణమునుంచి పలుకుల జిగి వెలయించుట యీయన కిష్టమైనది.

"పవిత్రచారిత్రులైన పరమద్విజులకు!"
"రుచివిూదం గన్నిడి యా
శచీవిభుడు దిరుగ విన మసంశయము సుమీ"
"ఆచానము మహత్త్వ మా శివుడ యెఱుగు."

అవ్వలి పర్వ ముద్యోగము. శ్రీకృష్ణుని రాయబార మిద్దానికి వజ్రకిరీటమువంటిది. ఇంతటి కళాసౌష్ఠవములో, నింత లోకోత్తరముగ నే కవియు నే రాయబారమును నడిపియుండలేదు. కౌరవసభకు వెడలు కృష్ణభగవానునితో పాండునందనులు వేఱువేఱుగను, ద్రౌపది ప్రత్యేకముగను దమతమ యభిప్రాయములు తెలుపు పట్టులను జదివియే యానందింపదగును.

శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని దర్శించుట, కుంతీదేవి నూరడించుట, విదురుని గదియుట లోనగు తావులు రసమునకు తావులు. అవ్వలిది కృష్ణుని కైజ పట్టు ఘట్టము. పిదప కృష్ణుడు కర్ణునితో మాటాడి వెనుకకు గదిలివచ్చును.

ఇది భారతమహాసంగరమునకు నాంది. భీష్ముడు కౌరవబలమునందలి యతిరథమహారథికులను నిరూపించును. గురుడు పరశురామదేవుని దివ్యచరిత్రము నభివర్ణించును. తిక్కనతప్ప మఱే కవియైన నుద్యోగము నింత రసవత్తరముగ నడిపియుండెజాల డనుట యతిశయోక్తి గాదు!

"అపద గోకంబెట్టగ
నోపి - శుభంబైనదాని నొడగూర్పను మా
కీ పుట్టువునను బాండు
క్ష్మాపాలుడు నిన్ను జూపి చనియె మహాత్మా!"

ఇది ధర్మజుని వాక్యము. కొలది పలుకులలో కొండంతటి యర్థ మిమిడింపబడినది.

"ఏ నిటులంటి నావలన
డింకను నీవును, రాజు, తమ్ములుం
గా నుచితంబు చూచి మన
కార్యము, మీ సుజనత్వముం జెడం
గా నొకభంగి సేయక త
గన్ గురువర్గములోడి సంధి మీ
కైన తెఱంగువన్ వలచి
నట్టులు సేయుడు నేర్పు లేర్పడన్!"

ఈ పద్యమున ద్రౌపది భార మంతయు దనపై మోపనీయ లేదు. 'మీరే యాలోచించుకొను'డని వారిపై మోపినది. 'మన కార్య' మనుటలో నాదరాభిమానములు, 'మీ సుజనత్వ' మనుటలో బ్రక్కపోటు పొడుచుటయు గనుపింపక పోవు. "నేనే కదా కడకు జెడ్డదానను. గట్టివాయి" ననునది నర్మగర్భోక్తి.

అవ్వలి పద్యములలో ద్రౌపదియొక్క ధృష్టతయు, నెదుటి వారి హృదయము నాకర్షించి కలంచు నేర్పును ప్రకటిత మగుచున్నవి.

"నీవు సుభద్రకంటె గడు
నెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయు! దిట్టి నను
బంకజనాభ! యొకండు రాజసూ
యావభృథమ్మునందు శుచి
యై పెనుపొందిన వేణి బట్టి యీ-
డ్చె పురుషాధముండుగా సభకు
నీడ్చె! కులాంగన నిట్లొనర్తురే!"

ఈ పద్యమున రసము మహోన్నతస్థాయి కెక్కి పోయినది.

"యమమహిష ఘంటికానా
దము విన కౌతూహలంబు దనుకొత్తెడు చి
త్తములు గల కౌరవుల కి
ష్టములగునే సంధికార్యశాంతివచనముల్?"

ఈ యౌదార్యవ రాయబారముపర్యవసానము సూచితమగుచున్నది.

ఇప్పటి కిది చాలును. ఇవి రసవత్పర్వములు-అవ్వలివి భీష్మద్రోణపర్వాదులు. వీనినింత యుద్ధవివరణమే. ఉభయపక్షములందలి యోధుల వీరవిక్రమవిహారములు కనులయెదుర బొడకట్టునట్లు వర్ణింపబడినవి. సౌప్తిక స్త్రీపర్వములు దాటునప్పటికి శారదాగమనముతో మహానదీప్రవాహమువలె గథాభాగము బలము గోల్పోవుచున్నది! కడపటి యేడెనిమిదిపర్వములును భావపుష్టికి, రసపోషణమునకు నంతగా ననువైనవి గావు! వైదికధర్మోపన్యాసములును, ధర్మనిర్ణయములును, వర్ణాశ్రమాచారవివరణములును, దానధర్మప్రశంసనములును, ధర్మసూక్ష్మోపదేశములును, పుణ్యపాపవివరణములును, సాంఖ్యాదియోగకథనములును, పిట్టకథలును, దృష్టాంతములును నంత యాకర్షకములుగా నుండవేమో! ఆకాలమందలి వారి యభిరుచులకును, లక్ష్యములకును, మనఃప్రవృత్తులకును, సంస్కారములకును ప్రస్తుతకాలము వానికి నెంతయు భేద ముండకతప్పదు—

ఒకనాటి రేయి చంద్రగ్రహణము తటస్థించినది. ముద్దుకుమారుడు తండ్రియుత్సంగమున కెగ్రాకి యుత్సాహముతో "నదిగో 'మామను' మ్రింగె రాహు"వనె. ఆశ్చర్యచకితుడై కొడుకునకేసి చూచి—

"నీ పక్కుళ్ళు రాలక! హిమాం
శుడు గన్పట్టడె! యామెయం చనెద" వం
చుక దండ్రి కోపింప
"పో,ముదు శ్రీలింగము! మాస్టరేమిటికిద
ప్పుల్ చెప్పు! బాల్యంబునక్
బడికిక్ బోతివా! లేదా!"
యక్ సుతుని ధీనై తద్య మేమందురో!

ఒకానొక సంసారి గురువుపాదములకు నమస్కరించి—

"మన జీవుండును దేవు డంచని వచిం
పకా బిందు! నెన్నేడులో
చని నాకున వసించి! 'ఫిబ్రవరి' మా
సంబద్దియే నీయగా
జనదే! తేలకు నిల్వ డోస నునుచుక్
జంకండు దుర్భాగ్య! డా
తని బుణ్యప్రభు డంచు గొల్చెదరు త
త్త్వజ్ఞుల్ వృథాభ్రాంతులై"

మానవదేహ మొక గేహమనియు, నందు వసించు జీవుడు దేవుడను నక్షిణోక్తి నాధారముచేసికొని బాడుగకై పోరాడు బుద్ధిమంతులును లేకపోలేదు.

ఇక బాండిత్యాదుల బరికించిన—

"అలమెక్ దుస్సహమైన యాకలి! రసం
తన్నం బిడక్ బోనిచో
నిలువక్ లేనని సాక్కు పెండ్లికొడుకుల్
వీక్షించి వాత్సల్యపే
శలుడై పాండితి జూపు కోర్కి దరహా
సశ్రీసముల్లాసరో
చుల "నిష్పైస్నహ భుజ్యతా"మ్మను రస
జ్ఞుక్ దండ్రి నేమందురో!"

ఇందలి "యిష్టై స్సహ భుజ్యతాం" అనువాక్యము "అన్న శేషః కిం క్రియతాం" అను కర్తప్రశ్నకు బదులుగా శ్రాద్ధమున నిమంత్రితబ్రాహ్మణులు పలుకు వాక్యము.

సందర్భశుద్ధియు, ఔచితియు సాత్మ్యముగా చూడదగును.

"క్రమతఁ మూడవక్లాసుబాలుఁడు మిహి
రాంశంబునఁ గల్గు వ
ర్ణములఁ దిచ్చుచు శబ్దముఁ బలుక నీ
వక్కిల్లు రాల్గాక స
ఖ్యముగా బల్కు తెలుంగ వెన్నడు మయూ
రాండం బటం చుండుగా
ని 'మిహిరాంశము' గాదటం చనిన తెం
డ్రిఁ గూర్చి రేమందురో!"

శబ్దసాదృశ్యము వలన నీ దోషము తటస్థించినది.

"కుడువఁగ జేరి బొట్టిసఁగ
గొబ్బున నద్దముఁజూచె! నందుఁ గ
న్పడె దన బింబ! "మాయతిథి
వండిన దంతయు మెక్కె! వీనిఁ
విడువఁడు! కొంప ముల్గె" నని
క్రేయని క్రేయుచు దల్పుమూయుచుఁ
వడివడి బీగముఁ వయిచి
పర్విడె నొక్కఁడు ప్రక్కయూరికిఁ!"

ఎన్న డెక్కని రాతి గుఱ్ఱము నెక్కిన పనుక ముంచయ్యో నను సామెత సార్థమయ్యె! అద్దమున దన ప్రతిబింబ మగుపడినంతనే "ఎవడురా శనివంటి యీ యతిథి దాపురించె? మెదుకైన మిగిలింపడే" యని చింతించి వాని దప్పుకొన నెంచి యేతప్పు సేయని యిల్లాలిని బాది క్రిందబడమొత్తి తలుపులు బిగించి తాళమువైచి యాలోభి ప్రక్కయూరికి బాఱిపోయెనట. విషయము స్పష్టము.

మఱియొకచో నొక వివాహము. మూర్తము డాయగా మేళము మ్రోయింపుడని వివాహయజమాని చెప్పెను.

"ఈ పెండ్లివేళలో శుభ
మా పాటను బాడు చవిక 'సంభ్రష్టులు' న
య్యొయ్యో! పదవే భద్రాద్రికి
శాపిష్ఠఘటంబ! యనుచు బాడిరట సుడీ."

కథావస్తువు మిక్కిలి తక్కువదైన చక్కవాటిన ఘట్టముల గూడ గవిబ్రహ్మ కౌశలముతో రసము పద చల్లినాడు!

"వినుము నరేంద్ర: విప్రసతి
వెఱ! జమదగ్నిసుతుండు శాపమి
చ్చె! నమరభర్త వంచనము
చేసె! వరంబని కోరిక కుంతి మా
న్పె శలంక! భీష్ము దర్ధరథు
జేసె యలంచె! గలంచె మద్రరా
జనుచిత మాడి! శౌరివిధి
యయ్యె నరుం డని జంపె గర్ణునిఁ!"

ఈ పద్యమున నెన్ని వాక్యము లిమిడియున్నవో పరిశీలింపదగు. మహారాజయొడారివలె శుష్కనీరసభాగముగ నీ తావున గూడ గవిబ్రహ్మ మహామహిమాన్వితముగ తన యింద్రజాలికపు గుంచె సోకించి సారవత్క్షేత్ర ఖండముగా మార్పగలిగెను.

అష్టావక్రు డొక బ్రహ్మచారి. వదాన్య డను మునిని సమీపించి యతని పుత్రిని సుప్రభ దన కిచ్చి పెండ్లి సేయింపుమని కోరెను! వదాన్యు "డట్ల కానింతు. ముందు నీ వుత్తరమున కేగిర" మ్మని పలికెను. "ఎచ్చటికి కేగుదు! ఏమిసేయుదు"నని యష్టావక్రుడడిగెను. వదాన్యుడును "కుబేరుని పురము దాటిన హిమవద్గిరి కానవచ్చు. పరమశివుడు పరమేశ్వరినిగూర్చి తప మొనరించిన ప్రదేశ మసమానపుణ్యప్రదంబు. దాని కవల నీహారణ్యము వచ్చును. ఆ పరిసరమున బుణ్యమూర్తియగు నొక పూఁబోడి వసించుచుండు. ఆమెను దర్శించిరమ్ము. వచ్చినవెంటనే వివాహము చేయించెద. ప్రమదం బెసగంగ బెండ్లిచేసెద అసదృశ రూపగుణ వర్తనాన్వయవిద్యా!" అని తిక్కన సంబోధనమును వాడినాడు.

"శ్రీయును గులమును రూపును
బ్రాయము శుభలక్షణములు బాంధవవిద్యా

శ్రేయము గల వరునిని గ
న్యాయుతుగా జేయవలయు నధిక ప్రీతిన్ !"

అని శత శతాబ్దములనుండి పారంపర్యముగా వచ్చుపద్యమందలి గుణగణములన్నియు వైశంపాయనమున గానవచ్చుచున్నవి. అనవసరవర్ణనము లుంచి గ్రంథము పెంచి పాఠకులను విసిగించుట తిక్కన కభిమతము గాదు.

అష్టావక్రు డలకాపురిని కుబేరుని యతిథియై యప్సరల యాటపాటల ప్రొద్దులు గడపుచు దిగులు లేనివాడై యొక్క సంవత్సర మందుండి మఱల బయనింప నెంచెను. కుబేరు డాతని డాసి "నీ కేమి కావలయును? తప్పక సమకూర్తు" ననియెను. మునికుమారుడు "నాకు సర్వంబు సంపన్నంబు. నీతోడి వేడుక నిలిచితి. గాని నా కభ్యర్థనీయ మొండు లే"దనెను.

**Seef-mastery is the greatest courage.**

హిమవద్గిరి దాటెను. కడిమిచెట్టునవి కనుపట్టెను. ప్రకృతిమనోహరమైన యాస్థలమున ననేక మణిమయహర్మ్యశ్రేణు లలరారుచుండెను. వానినడుమ నొక సమున్నత సౌవర్ణసౌధరాజ ముండెను. కమనీయకాంతి రూపవిలసనములు గల కన్నియలు గదియవచ్చి స్వాగతమిచ్చి యతనిని లోనికి దోడ్కొని వెళ్ళిరి. అం దసమానదివ్యరత్నరశ్మి విరాజితమగు నొక మృదుల పర్యంకమున నార్యమూర్తియు, ధవళవసనాంగరాగయు, దివ్యాభరణభూషితయు నగు నొక సర్వాంగసుందరి కూర్చుండియుండెను. ఆమె యష్టావక్రునకు సముచితోపచారము లొనరించి ప్రక్కనున్న సెజ్జపై కూర్చుండెను. సల్లాపము లుల్లాసముతో సంపతిల్లెను. నిశాసమయ మయ్యెను. భోజనాదులపదపడి మునికుమారుడు, నాయికయు రెంటిసెజ్జలపై బరుండిరి. కొంతసేపటికా కోమలాంగి లేచి—

"శీతర్తువనుచు నల్లన
నాతని శయనమున కరిగి యత డెడమీగా
నాతల్పమ్మున నొకదెస
ప్రీతహృదయయై శయించె బృథ్వీనాథా!"

"అత డెడమీగా" ఇది యెంతయో యనుభవము, మెలకువ కలిగి పలికిన పుష్టప్రయోగము. ఇట్టి వజ్రపుతునక లచ్చటచ్చట ముద్దులుగులుకుచుండును. ఇట్టి చమత్కారమైన ప్రయోగములు కదిరీపతినాయకుని శుకసప్తతికథలలో పెక్కులు చూచియున్నాను.

"అందగాడ వగుదు! నవ్వాడే తెలిసె నీ
దారి! మగడు నిద్రదేరి నన్ను
వెదకు! నటకు మున్నె వేగ బోవలయు! నీ
సుద్దులేల! ప్రక్క జో టొసంగు!

(శుకసప్తతి)

"పనుల కోడలువంగక కా
మిను లీరువురు గూడి 'గోళ్లుమీటుచు' దారుల్
దినదిన మెగబడ మేపగ
గనుపింతురు సున్నగచ్చు కాయలకరణిన్!"

(కదిరీపతినాయకుడు)

అప్పు డాదివ్యాంగనయు—

"పదపడి నయమున మెయిమెయి
గదియించి లతాంగి చిక్క గౌగిట జేర్పన్
గదలని చిత్తము గలిగియు
మద మేమియు లేక యతడు మ్రానైయుండెన్!"

ఆసుందరి చేసిన ప్రయత్నము లన్నియు జేసెను. కాని ప్రయోజనము గానరాదయ్యె! 'కుమ్మరి కొక యేడు, గుదెకు నొక నా'డనునట్లయినది. అష్టావక్రు డణుమాత్రమైన జలింపడయ్యెను. **Courage is the first sign of a soul's Nobility** అను వచనమును రూఢిచేసెను! "వట్టిమ్రానై యుండెన్" ఈప్రయోగము మిక్కిలి బలమైనది. వేయిసైగలు, లక్షలు గిలిగింతలిడినను మేను పులకరింపని పురుషపుంగవుడు **"To conquer a desire brings mere joy than to satisfy it."** అని యెఱిగిన నిగ్రహపరుడు.

**"A chivalrous man is the noblest work of God"**

మగవారు భోగపరులు. తాల్మి తరుణులందు గలుగు. "ఇవ్విధంబుగాక నేగోరంగ ననుభవింపకునికి యగునె నీకు!" అని సిగ్గువిడిచి యామె యర్థించెను.

అష్టావక్రుడు "మదనస్మృతి మాను! మే లోవలె" ననియె.

"కార్యమనుటంచయు నరిగాదుగాక పిదప!
నిలుపు మంతకు నని యామె పలికె! నన్ను
నీవు గదియకుండెద వేని నిలిచెదను వ
ధర్మ్యస్మృతి వను"
మని యతడు బోధించెను.

అంతట తెల్లవారెను. ఆయచ్చరమచ్చెకంటియు నతనికి స్వయముగా స్నానాదికములు దీర్చి భోజనాదు లమరించె. మఱల నిశావేళ యైనంత నాచెలువ యతనిని శయ్యకు బిలిచెను. అతడు నిరాకరించెను. ఆసమయమున నామెరూపసౌభాగ్యము లోకమోహనమే గాదు. చతుర్దశలోకమోహనమై విలసిల్లుచుండెను. అప్పు డష్టావక్రుడు—

"ఈ యనృతః రతము లే
లా! యున్న నిజంబు, నీతలంపును, నన్నున్
దోయజలోచన! చెప్పుము !
పోరొద బనులు గల! వనిచిపుచ్చుము నన్నున్"

"అనవుడు ప్రీతరై 'యనఘ! నిన్నారయ
తలపునజూవ వదాన్యుడిందు
బుత్తెంచె! నేను నీయుత్తరదిశజామ్మ!
నీనిష్ఠ గాంచితి! దీన నతడు
నిను మెచ్చు! నాడెన మనమున ప్రియమెందు!
మరుగను సుప్రభాపరిణయమున"

కని గర్వము విడిచి నడిపెను.

Pride is at the bottom of all great mistakes.

అష్టావక్రుడును "నీకొండ నాదరమకాక మతియొండు భావమున కాస్పదమే లే"దని యూరార్చి, తన కామె యొనరించిన సపర్యలకై కృతజ్ఞత దెలిపి నెడలిచనెను.

A chivalrous heart knows no offence.

The nobility of one is measured by one's capacity of gratitude.

హృదయపాకశ్యమున కష్టావక్రు డసాధారణ దృష్టాంతముగదా. ప్రతికూలశక్తులు ప్రోవులై నలు దెసల గ్రమ్మి కలచినపుడు చలింపక నిలువగలిగినది కదా స్థైర్యము, నిగ్రహము.

There are a thousand straight trees over the hills ; not one straight man in the whole world.

ఇట్టిదే మతియొక చిన్న ఘట్టము స్పృశించి చాలించుదము. రుచి దేవశర్మభార్య! సర్వాంగసుందరి యైయుండు. తదీయరూపాతిశయంబు దేవగంధర్వాదులకును లోచనీయంబు. పాపము! తిక్కనకు రుచి యేకాక సుందరి యనిన జాలదు. సర్వాంగసుందరి యనిననే తృప్తి. దేవగంధర్వాదులకు లోచనీయ యనుటతో రాగల కథ సూచితము.

క్రతువుసేయింప దేవశర్మ పొరుగూరికి వెళ్ల వలసివచ్చినది. విశ్వసనీయుడగు శిష్యుని విపులు డను వానిని బిలిచి యేకాంతమున—

"రుచి నెపుడు వేచియుండు
శచీవిభుడు! దాని నెఱిగి సంరక్షణ మే
నుచితంబుగ నొనరింతు! వి
కచకమలనిభాస్య జేర గాన డతండున్!
నాకు గ్రతువు సేయింపఁ జనంగవలసి
యున్న దిది! పరదారసముత్సుకుండు
శక్రు! డటుగాన రుచికి రక్షావిధాన
మాచరింపుము నీవు దృఢావధాన !"

అని నియోగించెను! 'దృఢావధాన' సంబోధనము మెలకువతో జూడదగ్గది. గాటమైన హెచ్చరిక గల మాటవనుట ! విషయమా— విప్పి విశేషముగా జెప్ప రానిది. ఒరుల కప్పగింపరానిది. నీవు లోతుపాతులు సూక్ష్మముగ గ్రహించు మెలకువ గలవాడ వని నిన్ను పనికి నియోగించుచున్నా నని తాత్పర్యము.

"ఇంద్రు డనేకమాయలు సేయగలడు. పశుపక్ష్యాదుల రూపము గైకొని రావచ్చును. నీవు జాగరూకుడవై కొంత గనుపెట్టుకొని కర్తవ్యము గావింపు" మని చెప్పివెళ్లెను. వినయప్రధానుడైన విపులుడు యోగ

మాయాప్రభావమున రుచిదేహమున దన యాత్మ నావహింపజేసి చూపెట్టుకొనియుండె! పురందరుడు సుందరరూపధరుండై రానేవచ్చెను. డాసి దాని "నీమూలమున భావజుడు నన్ను బాధించుచున్నాడు. కృపజూడు" మని వేడుకొనెను. కాని జడత్వము పైబడియుండి రుచి పలుకలేకపోయెను. అప్పుడు మహేంద్రుడు—

"ఏ నమరేంద్రుడ! నాదగు
మానము గామశిఖి గ్రాగె! మానిని తడయం
గానేల! నన్ను దగ న
మ్మానింపుము నీవు నిగ్గుమా టింకేలా!"

అని యర్థించెను. రుచిమేన నిండియున్న విపులుడా మెపలుకులుగా "నీ విందు రాబనేమి? పొ"మ్మని కసరెను. వేలుపుదొరమోము వెలవెల బారెను. అప్పుడు విపులుడు నిజతనువున కొచ్చి లేచి నిలిచి,

"ఏ నొల్లగాక! ధన్యము
గా నిన్నుగ జేతునే వికారీ! యనుడుం
దా నెదురుపలుక కంత
ర్ధానము వెసజేసె నతడు ధరణీనాథా!"

పిదప దేవశర్మ యింటి కేతెంచి విపులుని భక్తిశ్రద్ధలకు మెచ్చి వాని కభిమతమగు వర మిచ్చెను.

తిక్కన వ్రాసిన భారతమంతయు నటుగరాచిన కొలది నుదారసౌరభపూరములు గూరుచు శ్రీఖండఖండము. సానదీర్చినకొలది దీప్తిదీపించు దివ్యమాణిక్యము. పిండిన కొలది రసము లొల్కు పారవ ఇక్షుఖండము! పావిత్ర్యప్రభాపటలముల నలుదెసల నించు కమ్మకర్పూరపుహారతి. ఆంధ్రుల పాలిటి కల్పభూజము. అడిగించుకొనక కోర్కెలందీర్చు కామధేనువు. చేతికందిన చింతామణి. ముంగిటి పెన్నిధానము.

ఇంక నొక్కటే మాట! భారతగ్రంథము నారంభించినవాడు నన్నయభట్టారకుడు. పూర్తి చేసినవాడు తిక్కశౌరి. కాగా నిరువురలో నన్నయ్య చిన్నయని కొందరును, తిక్కన యెక్కుడని తక్కొరులును బహుముఖముల వివాదములు పెంచుచుందురు! ఇది నిక్కముగా చిక్కుచిక్కులతో గూడిన క్లిష్టతరసమస్య! నన్నయ వాగనుశాసనుడు—తిక్కన కవిబ్రహ్మ. మహాప్రవాహధాటిగల నన్నయ్య శైలి యనన్యసులభము—తిక్కనకవితాశిల్ప మద్వితీయము. ఇరువురు విష్ణ్వీశ్వరులవంటివారు. ఇరువురును మహాప్రతిభాధురంధరులు; ఒరులకు జేరిచూడరాని దుర్నిరీక్ష తేజోమూర్తులు. చిచ్చరకంటిని, చేతిత్రిశూలమును డాచి క్షితి నవతరించిన శ్రీకంఠునపరావతారములు. ఇరువురు ఉద్దండులే! వీరిరువురు సైకొని సమానముగా వర్ణించిన గరుత్మంతుని చరిత్ర వీక్షింపదగు. మూలముగ గథాంశము నొక్కటే! పోకడలలో మాత్రముగ భేదము కానవచ్చెడి. ఇరువురు వారివారి ప్రత్యేకతను, కళాసౌష్ఠవమును రూఢిచేసుకొనిరి.

ఎఱ్ఱాప్రెగడ ప్రబంధపరమేశ్వరుడు. వారిరువురకు మధ్యగుడు. తక్కువవాడు కాడు. మహాకవి ఇరువుర నవ్యాజభక్తివిశ్వాసములతో గొలిచెను. ఎఱ్ఱాప్రెగడ నన్నయ్యనుగూర్చి—

"ఉన్నతగోత్రసంభవము!
నూర్జితసత్త్వము! భద్రజాతిసం
పన్నము! ఉద్ధతాన్యపరి
భావిమదోత్కటమున్! నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి
యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తి గతి
నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్!"

తిక్కననుగూర్చి—

"తన కావించిన సృష్టి తక్కొరులకే
తరగాదు నా నేముఖం
బున దా బల్కిన పల్కు లాగమములై
పొల్పొందు నా వాణి న
త్తను నీతం డొకరుండు నా జను మహా
త్త్వస్ఫూర్తి గవిబ్రహ్మ నా
వినుతింతుం గవి తిక్కయజ్వ
నఖిలోర్వీదేవతాభ్యర్చితున్!"

[ఇటీవల నెల్లూరులో జరిగిన తిక్కనజయంతి నాడు చదివిన దిది.]

# పుట్టింటికి

[నాటిక]

శ్రీ రా. సీ. ఆంజనేయశాస్త్రి

[వెంకట్రావు బజారుకు బయలుదేరుతుంటే లోపల్నించి భార్య రాజేశ్వరి అంటుంది—]

రాజేశ్వరి : మల్లెపూలు మరిచిపోకండి. నాలుగు వందలు చాలు.

వెంకట్రావు : అవసరమైన వస్తువులు చెప్పమంటుంటే, మల్లెపూలూ, చేమంతిపూలూ మొదలెట్టావేమిటి ?...

రాజే : లలితకి సాయంత్రంపూట చెండన్నా పెట్టద్దుటండీ ?...అదీగాక సీత వంకీలజడ వెయ్యమని ఎన్నిరోజుల్నించీ అనుకున్నారు ? మరి కిట్టిగాడికి దండ యిచ్చితీరాలయ్యె ! లేకపోతే నిలవగలం ?

వెంక : ఇవి అవసరమనేనా ఏమిటి నీ ఉద్దేశం? అయితే అత్యవసరమైన వస్తువులుమాత్రం చెప్పు.

రాజే : బట్టలసబ్బు బారుది ఒకటి తెండి... చాకలివాడు రావటమే లేదు సరిగ్గా...మరీ రోజ్జు రోజ్జు చేసుకుంటున్నారు పిల్లలు దుమ్ములో పొర్లాడి...

వెంక : (విసుక్కుంటూ) "అత్యవసరం" అంటే "అది లేకపోతే యిక గడవదు." అనే వస్తువన్నమాట. తెలిసిందా ?

రాజే : (మామూలు ధోరణిలోనే) ఏమో బాబూ !...దాంతోపాటే ఒళ్ళు రుద్దుకునే సబ్బు కూడా ఒకటి తెస్తే సరిపోతుంది. దొరికేచోటా ఏమన్నానా? వేసంకాలంకూడాను...మొహాలు ఒకటే జిడ్డుకారుతూవుంటాయి.

వెంక : నీ కేం మతిపోయిందా ? బియ్యం లేకపోతే చెప్పు. కట్టెలయిపోతే తెమ్మను. అవసరమైన వస్తువు లంటే అవీ...

రాజే : మీమాటల కేంకానీండి...ఒక ఊలు పిడికూడా తీసుకురండి పనిలోపని... జంఝారంగులది కాసుంటుంది...

వెంక : (కోపంతో, వ్యంగ్యంగా) నయం. హేరాయిలూ, సెంటుబుడ్డీ లేవద్దూ ? ఊలుపిడిట ! ఊలుపిడి !!

రాజే : అలా కసురుకుంటే ఎలాగూ? కొబ్బరినూనె అదేం యిదోగాని, రామరామ ! ఒకటే కసుర్లు కంపుకదా ! మంచిరకం తలనూనె తెండి, కొబ్బరినూనెలో నాలుగుబొట్లు వేస్తే నిక్షేపంలాగా వుంటేట్లు.

వెంక : (అమితమైన విసుగుదలతో) ఇలా నన్ను చంపుకుతినకపోతే పోరాదూ మీవూరు ? మీనాన్నొచ్చాడుగా ?

రాజే : (కొంచెం రోషంతో) ఏమిటండీ మాట్లాడితే "మీవూరుపోరాదూ? మీవూరుపోరాదూ?" అంటారు ? మావూరదే ! మాయిల్లా యిదే...ఎక్కడికీ పోయేది ?

వెంక : సరే, సంతోషించారులే తెలివికి ! ఇదేట—యిదే వూరూ, ఇదే యిల్లూను...(కాస్తాగి) అయితే నేనే వెడుతాలే...నీయింట్లో నువ్వు హాయిగా వుందుగాని...

రాజే : (కొంచెం తీవ్రం తగ్గించి)...ఇవాళ పొద్దుట్నే ఎవరి మొహం చూశానోగాని...ఒకటే

కసబిసలుగా వుంది...ఏమిటండీ ఆ మాటలు !...ఏదో శాస్త్రం చెప్పినట్లు నేనేగా ఒకఅమ్మ కన్న బిడ్డను ? అలాగే పోతా మానాన్నతో. మీరూ, మీపిల్లలూ సుఖంగా వుండండి. చంటిదానికిమటుకు పాలు జాగ్రత్తగా పడుతూండండి బాబూ!...ఆనేవాళ్ళ కన్నా వుండాలి, పడేవాళ్ళకన్నా వుండాలి...ఎన్నాళ్ళని నేనుమటుకు ఛీ! ఛీ! అనిపించుకుంటాను...ఏదో...

వెంక : (భయపడుతున్నట్టుగా, నట్టునట్టుగా, నీళ్ళు నములుతూ)...అఁ...ఆ...అది కా...కాదు...నే...నేను...

రాజే : (వినిపించుకోకుండా) ఏదో పది కాలాలపాటు చల్లగావుంటే చాలు పిల్లలు...ఎవరి దగ్గిరై తేనేం ?...మావాళ్లూ తిండి కేమంత మొహం వాయలేదు. రెక్కాడినన్నాళ్లూ డొక్కాడకపోదు... ఎప్పుడో "హరీ" అంటే ఆనాటి కెవరో రానే వస్తారు...ఎలాగో వెళ్ళిపోతుంది...

వెంక : (అనునయంతో)...ఎందుకే అంతంత మాటలు ? నోరెత్తకుండా చేస్తున్నావేమిటి ? ఏదో పొద్దస్తమానం బళ్ళో వాగివాగి ఒచ్చిన చికాకులో కాస్తంత మాటంటే "చావులూ బతుకులూ" దాకా ఎందుకు ?...నా కెందుకొచ్చిన గొడవ...ఇంత చచ్చీ చెడీ...

రాజే : నేనుమాత్రం అన్నదే...

వెంక : (వినిపించుకోకుండా అర్థోక్తిలోనే) సంపాదించిపడేస్తున్నా ఎవరికీ సంతోషం లేకపోయె! ఏ బైరాగుల్లోనో కలిసిపోతే, హాయిగా "రామా! కృష్ణా!" అనుకుంటూ దేశం అంతా తిరిగిరావచ్చు... ఏచెట్టుకిందో రాలిపోగానే, ఇన్నాళ్ళన్నకం పెనీవా రిచ్చే మూడువేలూ పెట్టుకుని, నువ్వూ.పిల్లలూ చీకూ చింతా లేకుండా తింగురంగా అంటూ...

రాజే : (ధోరణి మార్చి) చాలుచాలు !... పట్టింట్లో నుంచుని ఏమిటా అపశకునం మాటలు ? మీకూ, మీ పెద్దలికీ ఓ నమస్కారంకాని, బాబూ, అవసరమైన వస్తువు లేమీ లేవు...ఏమీ లేనక్కర్లేదు...మీ షికారుకు మీరు పొండి బాబూ...

(మెల్లిగా సణుగుతుంది)...సిగిరెట్లకీ, కాఫీలకీ ఎంత తగలేసినా అనవసర మనిపించదు...పల్లెటూరుగదా వెళ్ళేది, అక్కడ సబ్బులూ, ఊళ్ళూ దుంచిని దొరక వని...కాస్త తెమ్మంటేనూ...పెద్ద రాద్ధాంతం చేస్తున్నారు...రాద్ధాంతమని...

వెంక : (నవ్వుతూ)...మరి ఆమాట చెప్పవేమే ?... మీవూరు ప్రయాణ మన్నమాట! మరి... ఆమాటే నేనంటే అంత కోపం దేనికి చెప్పు... కానియ్యి మరి, ఏం కావాలో !...బట్టల సబ్బూ... ఊలుపిడీ...యింకా ఏమిటీ ?...ఆ...తలనూనే ?...

రాజే : ఏమీ అక్కర్లేదు. మీ కవసరమైన వస్తువులు తెచ్చుకోండి... నే నెక్కడికీ వెళ్ళను...

వెంక : అదికాదే !...నేను వెళ్ళొద్దన్నానా ? తెస్తాగా ఏంకావాలంటే అవి...ఏదో నాలుగురోజు లుండిరావచ్చు...అందుకే వచ్చాకే పోకూడాను మీ నాన్న !...ఆయనప్రాణం చివుక్కుమంటుంది తీరా బయలుదేరకపోతే...పసిదానికి 'పౌడరుసబ్బా కూడా తెమ్మన్నావేమిటే...

రాజే : ఏం వెళ్లిస్తారండీ !...వెడితే పీడవిరగడైపోతుందికదా అని చూస్తున్నారు...వారం రోజుల్నించీ చూస్తూనే వున్నాలెండి మీ హుష్షూ పెళ్లాను. నేను పోతే మావూరు, తింగురంగా అంటూ స్నేహితులతోనూ, స్నేహితురాళ్ళతోనూ......

వెంక : (అర్థోక్తిలోనే)...చాల్లే, యిహ కట్టిపెట్టు...ఇల్లు కదలటానికి వీల్లేదు తెలుసా ? తమాషా కంటేనూ, లేచిపోదామనుకుంది పాపం !...వెధవ హోటలుభోజనం నాకు పడదుకూడాను...నువ్వొస్తావనే కామాలు తిప్ప వేశాడు మీ నాన్న !...

రాజే : ఆయనకి రెండు రోజులు గుప్పెడు మెతుకులు పెట్టడానికే మీకంత కష్ట మెందుకు ?... ఆయనేం తిండికి మొహంవాచి రాలేదు, మీ మోచేతి గంజికోసం...ఆయనబిడ్డను కానూ నేను ?...నన్ను మాత్రం మేపట మెందుకు? తోలెయ్యండి, పోతాను...

వెంక : వెళ్ళమంటే పోనంటావు. వద్దంటే పోతానంటావు. నీయిష్టం బాబూ. వెళ్ళదలుచుకుంటే

వెళ్ళు.....ఉండదలుచుకుంటే వుండు. కావాల్సిన వస్తువులన్నీ తెచ్చిపడేస్తాను. వెళ్ళదలుచుకుంటే మటుకు పిల్లల్నందర్నీ మాత్రం తీసుకెళ్ళుబాబూ!...

రాజే : అక్కడే వచ్చేది తగాదా. పెద్దవాణ్ని వుంచివెళితే వాడేం అడ్డంవస్తాడు? పైగా ఏదో చేతికీ కాలికీ సాయపడతాడు. మీరు రెండుముక్కలు చెబుతూకూడా వుండచ్చు...

వెంక : చేతికీ అక్కర్లేదు, కాలికీ అక్కర్లేదు. నాకంతంమీదికి వాడెందుకు, సి. ఐ. డి. లాగా? ఇంతలో వాడి బి. ఏ. లకీ, ఎం. ఏ. లకీ ఏమీ భంగం రాదులే. ఆ రెండుముక్కలూ మీ అన్నయ్యనే చెబుతూవుండమను. ఆయనగారూ ప్రైమరీ వరకూ వెలగబెట్టాడుగా!...

రాజే : ఏమీ ఎద్దేవాలు చెయ్యక్కర్లేదు... అందరికీ రమ్మంటే రావద్దూ మీ చదువులు? ఇలా పిల్లల్ని తిప్పితేనే ప్యాసయ్యారు కామాలు ప్యాసైన వారు బి. ఏ. లూ, యల్. టీ. లూను!

వెంక : కాక! తండ్రినెత్తిమీద ఎక్కించి పుట్టిళ్ళకి ఉడాయిస్తేనే కామాలు ప్యాసయింది?!

రాజే : తీరా వుంచివెడితే వాడిమీద కోపం కొద్దీ ఆ పసివెధవని బాదుతారోఏమో!...ఇంతకీ వాడుంటే మీ ఆటల కేం అడ్డమోలెండి!...

వెంక : (కోపం నటిస్తూ) ఇహ నోరుముయ్యి... పోతున్నా బజారు...కావాల్సిన వస్తువు లివేగా?...

రాజే : ఓ అరవీసెడు లడ్డూలూ, సవాసేరు కారప్పూసా తెండి పిల్లలికి...మాఅన్నయ్యకొడుక్కి బిస్కట్లు యిప్పం. తెలుసుగా?...సరే...పాలసబ్బాల మాట గుర్తుంటుందికదూ!...

వెంక : ఇహ ఫుల్ స్టాప్ పెడుదూ బాబూ... (సన్నగా వినిపిస్తుంది).

రాజే : (బిగ్గరిగా)...పాలసీకెలండరోయి...మర్చిపోరూ!

౨

(వెంకట్రావు కొల్లాయిగుడ్డ కట్టుకుని వంటింట్లో కుంపటి ఊదుతూవుంటాడు.)

వెంక : (విసుగుతో) వెధవకుంపటి అంటుకోనే అంటుకోదు. అరబుడ్డికిరసనాయిలు పోసి, అగ్గిపెట్టంతా వెలిగించినాను. (ఉఫ్! ఉఫ్! అని ధ్వని). ఛీ! ఛీ!! ఇదేం పొయ్యేకాలమో!...ఇట్టే రాజేసేది రాజేశ్వరి...ఏయ్! పనిమనిషీ!...

పనిమనిషి : సిత్తం...బాబయ్యా...

వెంక : ఇలా రా ఓమాటు! ఏమిటే నీపేరు... మరిచిపోయా?

పనిమనిషి : అప్పలమ్మ కాదుటండీ (నవ్వుతుంది).

వెంక : ఊ!...సరే...ఇదిగో, కుంపటి ముట్టించు కొంచెం...ఇందాకటినుంచీ ఒకటే యాతన పడుతున్నాను...

అప్పలమ్మ : (కుంపటి యిటూ అటూ కదిలించినట్టు చప్పుడుచేసి) బాబయ్యగోరూ, తడిబొగ్గ లేశారండీ...అందుకనే అంటుకోలేదండి...

వెంక : ఏడిచినట్టే వుంది...కుంపటి తడి కామాలు...నేను వెయ్యటం బస్తాలో బొగ్గులే వేశా... సరే, అవి పారబోసి యివిగో కొత్తబొగ్గులేసి అంటించు...

అప్ప : సిత్తం...(బొగ్గులు పోసినట్టూ, నిప్పుపుల్ల వెలిగించినట్టూ చప్పుడవుతుంది)...అమ్మగోరు పుట్టినింటికాడ కెళ్లితే పూటకూటింటికాడ భోంచేసేవోరుగా తోమరు?...ఎందుకు బాబూ యీ అగ్గి...

వెంక : నీమొహం...నీకు తెలీదులే. హోటలు భోజనం పడటంలేదు నాకు...ఆఁ...ఏదీ...అంటుకుందీ...? దీని తస్సాదియ్యా. యిట్టే అంటుకుందే?...సరేగాని, యిహ వెళ్ళి నీళ్ళపని చూడు...

అప్ప : సిత్తం బాబయ్యగోరూ!

వెంక : (విసురుతూ) పనిమనిషీ...ఆ...అప్పలమ్మా...

అప్ప : సిత్తం బాబయ్యగారూ...

వెంక : సిబ్బి తీసుకురా, కాఫీగిన్నె మీద మూతకి...

అప్ప : తెస్తుండా బాబయ్యా...(నిప్పు మీద వేసినట్లు చప్పుడు) ఎల్లేదాండీ...

వెంక : ఆఁ...పోఁ...ఊఁ...ఎందుకు చేత కాదో చూస్తా...ఆఁ...కాగినట్టున్నాయి నీళ్ళు... కాఫీపొడి వెయ్యాలికదూ యిహ...? పొడి వేసి కాగ పెడితే సరిపొయ్యేది!...ఇప్పుడు దించి వెయ్యాలా? వేసి దించాలా?

అప్ప : ఎలా నే త్తేనేం బాబయ్యా...

వెంక : కాఫీమొహం నీ కేం తెలుసు?...వేసే దించుతా...ఆఁ...కాదుకాదు. దించే వెయ్యాలి... అలాగే చేస్తున్నట్టు గుర్తు రాజేశ్వరి...ఓసీ...అప్ప లమ్మా...వెళ్ళావా?

అప్ప : సిత్తం బాబయ్యా...నేదుండి.

వెంక : చూడు. యివాళ నేను స్వయంగా వంట కూడా చెయ్యదలుచుకున్నా. అయేదాకా నువ్వు కాస్త సాయంగా వుండాలి తెలుసా?...

అప్ప : (నవ్వుతూ) మీ కేం శాతనవుద్ది బాబయ్యా...అయిగా పూటకూటింటికాడ...

వెంక : ఛీ! ఊరుకో. నేను చేసితీరుతా వంట! ఇదేం బ్రహ్మవిద్యా ఏమన్నానా?...అన్ని పనులూ అందరికీ చేతనవ్వాలి. గాంధీగా రేం చెప్పారు?...

అప్ప : సిత్తం బాబయ్యా.

వెంక : సరేకాని...ఎదీ, కాఫీగుడ్డ తీసుకురా.

అప్ప : యాకుందండీ బాబయ్యగోరూ?

వెంక : ఛీ! నీమొహం. ఎక్కడుందో చెబితే నువ్వు తెచ్చేదేమిటి?...వసారాలో దణ్ణానికి కట్టి వుంటుందేమో చూడు...ఊ. దబ్బునరావాలి. చల్లారి పోతుందేమో డికాక్షను...

అప్ప : (కాస్తాగి) ......కనిపింప లేదుండి (సన్నగా వినిపిస్తుంది).

వెంక : (బిగ్గరిగా) ఆఁ...కనిపించలేదూ?... నా కళ్ళుకూడా పెట్టుకొని వెతుకు...

అప్ప : ఆఁ...ఈడ వో గుడ్డుందండి...(సన్నగా వినిపిస్తుంది)...(దగ్గిరి కొచ్చి)...ఇదేనాండీ...

వెంక : ఛీ!...ఇది జేబురుమాల......సరేలే, ఏదయితేనేం? దాంతో నే వడపోస్తా. అసలు గుడ్డ కనపడలేదుగా మరి గుడ్డిమొహానికి?...

అప్ప : సిత్తం బాబయ్యా......అంట్లు రాసే దాండి...

వెంక : ఊ...పో...(కాస్తాగి)...మరిచి పోయా అప్పలమ్మా...

అప్ప : సిత్తం బాబయ్యా...

వెంక : పాలేవీ?

అప్ప : జానికమ్మండీ? మసగమసగ్గా వుండ గానే తనువు గొట్టిందుండీ...యారూ సెగవపోరయే తలికి ఎల్లిపోయిందుండీ...

వెంక : (విసుగ్గా) ఏడ్చినట్టే వుంది...పక్క భాగంలో కెళ్ళి ఓ గ్లాసెడు పాలు అప్పు తీసుకురా. డికాక్షను కూడా తయారయివుందయ్యే...

అప్ప : సిత్తం బాబయ్యా.

వెంక : దోసకాయకూరా, పప్పూ.. అంతే... చాలు యీపూటకి...దాం దుంపతెగా! యింకా రాలేదేం అప్పలమ్మ? తీరా పాలు లేవన్నారేమో వాళ్ళు!

అప్ప : నేవన్నారుండి...మరండీ...

వెంక : దరిద్రుడు తలగడిగితే వడగళ్ళవానని... అనుకున్నట్టే అయిందీ?...

అప్ప : సిత్తం బాబయ్యా...

వెంక : వెధవ "సిత్తం"...నువ్వూను...అగ్గా సక్కడ తగలేసిపో...యిహ వంటప్రయత్నమన్నా చేస్తా...దోసకాయలు తరిగేస్తా ముందు...

అప్ప : సిత్తం బాబయ్యా, బట్టలు గుంజే దాండి...

వెంక : ఊ...

(బట్టలుతుకుతున్న చప్పుడవుతుంది)

వెంక : బాబోయ్!...అప్పలమ్మోయ్!!... చచ్చానేవ్!!!

అప్ప : (గాభరాగా) ఏంటి బాబయ్యా... ఏంటి?...

వెంక : వేలు తెగింది బాబోయ్...దోసకాయ తరుగుతుంటేనూ...ఏం చెయ్యాలి...ఏం చెయ్యను?

అప్ప : అమ్మ బాబోయ్! ఎంత నెత్తురు? ఎంత నెత్తురు!! తడిగుడ్డ కట్టు బాబయ్యా...

వెంక : నువ్వు చుట్టు అప్పలమ్మోయి!...కుడి చెయ్యికూడాను...కూరావద్దు కుమ్మా వద్దుకాని... ఇంతపప్పువేసుకొని ఆవకాయేసుకు తింటా...!

అప్ప : కట్టనాండీ? నాను సెప్పనేదుం టుండీ!...ఆయిగా పూటకూటింటికాడ...

వెంక : ఛీ! నోరుముయ్యి...పొద్దుటినుంచీ ఒకటే కకునిపక్షికూతలూ నువ్వూను!

అప్ప: సిత్తం బాబయ్యా...ఏలమీన నీల్లోత్తాం డండి...

వెంక : రెండో కుంపటికూడా రాజేసి వంట శెట్టు. యిట్టే పప్పూ అన్నమూ ఒకేమాటూ ఉడికే ట్టుగా...అప్పుడే బడిటైం అవబోతోందికూడాను.

అప్ప : సిత్తం బాబయ్యా......(విసురుకుంది కుంపటి).

వెంక : ఆఁ...మండాయా?...ఇహ పోయి బియ్యం కడుక్కురా...

అప్ప : సిత్తం బాబయ్యా......చేరు పోసే దాండి...

వెంక : ఊ....పొయ్యి....కందిపప్పు యిట్టే వేసుకుంది...కణకణ మాడుతుంటే అత్తెసరవుతుంది కూడాను...

అప్ప : బియ్యం ఓడుచుకొచ్చానండి...

వెంక : ఆఁ......తెచ్చావూ...? ఇటియ్యి కుంపటిమీద పెడుతా...ఇహ నువ్వు పోయి పెరుగు మని పెవరన్నా వస్తోందేమో చూడు. రోజూపోసేగొల్ల దెందుకనో యింతవరకూ రాలేదు...ఊ...పో... దబ్బున...పనులు వెంటవెంటనే అయిపోవాలి...

అప్ప : సిత్తం బాబయ్యా...

వెంక : (పప్పు వేయిస్తున్నట్లు గరిటతిప్పిన చప్పుడవుతుంది) వేగిన వాసన వొస్తున్నట్లేవుంది.... అరెరే....బియ్యంలో నీళ్ళే పొయ్యలేదే? ఎన్ని పోయాలి నీళ్ళు?...ఓయ్! అప్పలమ్మా...అప్పీ!... వెళ్ళిందికామా లప్పుడే దొడ్డిగుమ్మం దాటి...అప్ప లమ్మా...

అప్ప: సిత్తం బాబయ్యా.(సన్నగా వినిపిస్తుంది)

వెంక : బియ్యంలో నీళ్ళెన్ని పొయ్యాలి?...

అప్ప : ఏల్లమునగా పొయ్యండి బాబయ్యా... (సన్నగా)

వెంకట : (సన్నగా) సరే.. (కాస్తాగి)-(బిగ్గరిగా) అరెరే! పప్పంతా మాడి మంగలమైపోయిందే ఒక్క నిముషంలో?...దీం దుంపతెగా...ఛీ! ఛీ!

అప్ప : (దూరంగా సన్నధ్వని) 'ఓయ్, పెరుగమ్మా...ఓయ్...'

వెంక : ఈపూట పప్పుకూడా లేదన్నమాటే... ఇంత పెరుగు పోసుకుని ఆవకాయిబద్ద నంచుకు తినాల్సిందే మరి...ఏం చేస్తాం—ఇదేమిటీ...అన్నం కూడా మాడువాసన కొడుతోందీ?.. యిన్ని నీళ్లు న్నాను...ఓయ్!...అప్పలమ్మోయి!...రా...రా...

అప్ప : (పరిగెత్తుకొచ్చి)...సిత్తం బాబయ్యా.

వెంక : (విసుక్కుంటూ) అరిచి చస్తున్నా మాట వినిపించుకోవేం? అన్నం ఉడకనేలేదు. నీళ్ళున్నా మాడుకొస్తోంది అడుగునుంచి. ఏం చెయ్య మన్నావు?

అప్ప : బొగ్గులు తగ్గించుండి బాబయ్యా... తగ్గించి పైన పొయ్యండి...

వెంక : సరేసరే!...అదెల్లా తగలడుతుందో యిహ?.. ఎదీ పెరుగు గిన్నెయిలా యియ్యి...రెండు మెతుకు లెలాగో గతికి బడికి పోతాను...

అప్ప : (జడుస్తూ)...మన గొల్లకి లేలు కుట్టిం దుంటండి...అందుకని రాలా యియాల...పక్కిం టోరికి పోసే అమ్మి సెప్పిందుండి...

వెంక : అఘోరించినట్టే వుంది. ఆ అమ్మిదగ్గిరే పోయించుకున్నా బాగుండేదిగా?...ఎక్కడినుంచి కొనుక్కొస్తాం తెలిది?...

అప్ప : సిత్తం బాబయ్యా...అడిగానండి, నేదంటే నేదంటుండి ఆ అమ్మి...

వెంక : ఇహ నామొహం...నేను తినేదేముందీ? (కాస్తాగి)...అన్నం వనుబాయయి కూర్చుంది.

అప్ప : సిత్తం బాబయ్యా...

వెంక : ఛీ!...నీసిత్తం, నిన్నూ తగలెయ్యా... ఈ అత్తెసరూ అత్తెసరూ నువ్వు తీసుకుపో...

అప్ప : నాను సెప్పనేదుంటుండీ...ఆయిగా... పూటకూటింటికాడ...

వెంక : చెప్పు తీసుకు తంతా.. ఆమాటంటే... వెధవకకునపక్షీ...చస్తే తినను హోటల్లో...యిప్పుడే టెలిగ్రాం యిస్తా రమ్మని...అమ్మగారికి...

అప్ప : సిత్తం బాబయ్యా...

# ఆధునిక నాగరకత-దానియెడ అసంతృప్తి

## శ్రీ ముడుంబ వేంకటరాఘవాచార్య

సైమండు ఫ్రాయిడ్ (Sigmand Freud) జర్మనీ దేశపు గొప్ప మానసతత్వజ్ఞుడు. ఆయన "ఆధునిక నాగరకత-దానియెడ అసంతృప్తి" అను చక్కని గ్రంథమును రచించెను. అందలి ముఖ్యవిషయము లీక్రింద పొందుపరచుచున్నాను. సృష్టింపబడిన నాటి నేటివఱకు జరిగిన మానవుని మానసపరిణామమందు చర్చించబడెను.

ఆధునికనాగరకత యభివృద్ధినొందుటకు ముఖ్యకారణము స్వార్థత్యాగము. మానవుడు స్వభావముచే హద్దుమీరిన కలహకారకుడు (aggressor), స్వార్థపరుడు, విద్యావ్యాసంగముచే నీరెంటిని తాను వశపఱచుకొనుటకు మానవుడు యత్నించుచుండెను. పాపభీతి యనునది నాగరకతకు గీటురాయియైనది. ఈ యూహలను తన గ్రంథమున ఫ్రాయిడ్ విపులపఱచెను.

సామాన్యమానవుడు అధికారమును, ధనమును వాంఛించును. కాని పూజనీయులనువారిలో నీరెండును లేనివారినే మనము చూచుచున్నాము. మహాత్మగాంధీ, గౌతమబుద్ధుడు మున్నగువారే దీనికి తార్కాణము. అనగా అధికార, ధనవాంఛల నతిక్రమించు శక్తి యొకటి మానవపరిణామమున గలదని గోచరించును. తాను (Ego) అనుదానికిని, బాహ్యప్రపంచమునకును గల సంబంధము పరిణామము నొందుచుండును. ప్రథమమున "తాను" అని యనుకొనునది సృష్టియం దొక భాగము. "ఆత్మవ త్సర్వభూతాని" అను ఆర్యోక్తి భావముకూడ నిదియే. రానురాను బాలుని యూహలలో ప్రపంచవస్తువులయెడ నాతనికి ప్రథమమునగల యేకత్వదృష్టి వదలి "తాను" అనుదానిని బాహ్యప్రపంచమునుండి వేఱుపఱచుకొనుచున్నది.

భగవంతుడు దయామయుడని, మన కెల్లరకు తండ్రియని మానవులు నమ్ముచుండిరి. కాని ప్రపంచమును జూచిన భగవాను డెల్లయెడలను దయామయుడని కాననగుట లేదు. మహానుభావులు క్రూరులచాత బడుట, మేధావులు జీవనమున కష్టభాజనులగుట మనము చూచుచున్నదేకదా! పరమాత్ముడు దయామయుడను తండ్రి యనుకొనుట మానవుని బాల్యదృష్టినే (infantile notion) సూచించును. అపారమైన పేదరికము, కష్టపరంపర మానవుల నకారణముగా కుదించివేయుట మన మెఱుంగనిది కాదు. ఇందులకు "పూర్వజన్మకర్మ" కారణ మనుకొనుటకు రుజు వేమి కలదు? హిందువులు తప్ప నితరులు కర్మసిద్ధాంతమును నమ్మరుకదా! మన మెఱుగని విషయమును సమర్థించుట కిది యొక తర్కవాదము. "ఇదమిత్థ"మని దీనిని గూర్చి శాస్త్రరీత్యా (Scientifically) చెప్పలేము.

ఇక మానవుని జీవితపరమావధి యేది? అనునది తరువాతి ప్రశ్న. "ఆనందము" (Pleasure) అనునదియే దీనికి సమాధానము. శారీరక, మానసికానందములకు వలయున వన్నియు పురుషుడే సేకరించును. విద్యాధనము లిందుల కుపయోగించుటచేతనే వానియెడ మనకు మహాగౌరవము. మనము కష్టములకు దూరమగుటకు యత్నించుటయు దీని రెండవ రూపమే. శరీరానారోగ్యము, మానసికాసంతృప్తి, యితరులు మనకు గలిగించు నిక్కటులు మనలను సుఖదూరులను

చేయును. హద్దుమీఱిన యానంద మిథునములకు గారణ మగుటయు జూచుచున్నాము. ఇక, కష్టసుఖము లన నేమి యని చర్చింతము. ఆగర్భశ్రీమంతునకు దినమునకు నాలుగుగంటలు పనిచేయుటయే కష్టము. పేదకు నాలుగంటలు మాత్రము పనిచేసిన దినము పర్వదినము. కనుక కష్టసుఖములు సాపేక్షములనిపించును. కాని యివియు హద్దుమీఱి యనుభవించిన ప్రమాదము గలుగును. ఇతరులు కలిగించు బాధలను సఱకు సేయక మనస్సును బాధనుండి తప్పింప యత్నింతుము. మనోనిగ్రహ మిట్టిదే. యోగి కష్టసుఖములను లక్ష్యము సేయక, మనస్సును దనవశము చేసుకొనును. ప్రపంచమును జయింపవలె నను కాంక్ష భగ్నమై, తన మనస్సును జయింప నారంభించును. ఇది కష్టములనుండి తప్పించుకొనుట కొక యుపాయము. ఆనందమయుడగుటకు ప్రపంచము కలిగించు నష్టంబులను దొలగింపజాలక, కష్టములను లక్ష్యపెట్టని విధమున మనస్సును నియమించును. దీనినే "ఆత్మనిగ్రహ" మనిరి. తనయందలి జంతుశక్తిని (Animal instinct) ఆధ్యాత్మికశక్తిగా నాతడు మార్చును. (Sublimates into Soul-force) అప్పుడు "కర్మ" యాతని నేమియు జేయజాలదు. ఏలనన, కష్టసుఖము లొకటియేయయినపుడు కష్టములకు వెఱవనేల ? కాని యిట్టిది యెవ్వరికో కాని సాధ్యపడదు. దీనివలన ప్రపంచమును యోగి కాలదన్నుచున్నాడు. ఇట్టిది సాధనవలన నగునేకాని విజ్ఞానమువలన సాధ్యపడదు. మహాకవి, చిత్రలేఖకుడు పేదవాడైనను దన జీవితమును దన యాశయమునకై ధారపోయును. లోకుల కతడు కష్టపడుచున్నట్లు కానవచ్చును. కాని యందు సుఖము లేనియెడ నాత డెందుల కామార్గము నవలంబించును ? సౌందర్యము సంతోషదాయకము. చక్కని కాంతయెడ, ప్రకృతిరామణీయకమునందు మానవుడు ముగ్ధుడగుట కిదియే కారణము. స్త్రీ పురుష ప్రేమకు ప్రధానకారణము సౌందర్యపిపాస. ఇది వారికి సంతోషదాయకము. అది కొన్ని దినములకు చిత్రకారునకు ప్రకృతియందువలె, దేహసౌందర్యము నతిక్రమించి మానసికానందముపై నిలుచును. బిడ్డలపై దలిదండ్రుల యభిమానము, స్త్రీయందలి మాతృత్వవాంఛ, బిడ్డలు లేనియెడ నితరుల బిడ్డలను దనవారివలె పెంచి పెద్దచేయుటయు నీ సామాన్యప్రేమకు బరిపక్వస్థితులు (Sublimation). అయితే కొందఱి మానస పరిణామ మీ యున్నతస్థితి నందలేదు. ఇది స్వార్థరాహిత్యమునకు మొదటి మెట్టు. దీని నధిగమించి, ప్రపంచ మంతయు దన సంసార మనుకొనుట దీని తుదిమెట్టు. మతమనునది మానసమున కొక విధముగ తృప్తిగలిగించు తంత్రము.

మానవశరీరము రానురాను నశించుట దాని ప్రకృతి. శరీరమన నశించునది యని వ్యుత్పత్త్యర్థము. "అనిత్యం అసుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వ మాం" అను గీతావాక్య మిదియే ధ్వనించుచున్నది. ఆధునిక నాగరికత మనలను దుఃఖభాజనుల జేయుచున్న దనియు, దీనిని విడవలె ననియు కొందఱి యభిప్రాయము. సృష్టియందు "అన్న, ప్రాణ, మానస, విజ్ఞాన, ఆనందము"లను అయిదుమెట్లు కలవని ఉపనిషత్తులు పలుకుచున్నవి. ఇందును ఆనందమే పరమావధియైనది. మానవుడు సుఖింపవలెననియే వాంఛించునని మనము సమ్మతించునపుడు, మానవజీవితమును సుఖప్రదముగా జేయగల యంత్రములు, మందులు మున్నగునవి విసర్జింపనేల ? అనాగరకుడు కష్టములను భరింప నలవడియుండుటచే, నతడే మనకంటె సుఖముగానున్నట్లు మనకు దోచును. అంతమాత్రమున ననాగరికతయెడ ఘనత లేదు. దీనిచే మన మెఱుగున దేమన, నాగరకుడు కష్టసహిష్ణుత నేర్వవలెననియే. నాగరికతచే మనము మనకు లేని శక్తులను సంపాదించితిమి. పక్షులవలె విమానములలో నెగురగలము. దూరమున నున్న శబ్దములను రేడియోవలన వినగలము. ఇట్టివి మఱెన్నియో చేయగలము. కాని యీ విజ్ఞానమును మానవాభ్యున్నతికి నుపయోగింపక, స్వార్థపరతచే నొక మానవుడుగాని, ఒక జాతిగాని వినియోగించుకొన యత్నించుచున్నది. ఆధునిక నాగరికతను రక్షింపగలిగినది స్వార్థరాహిత్యము. "జగద్ధితాయ కృష్ణాయ" అని మన పెద్దలు "భగవంతునికొఱకు, ప్రపంచముకొఱకు" అని కలిపియే వచించుట కిదియే కారణము. స్వార్థరాహిత్యము కుటుంబమున నారంభించి యఖిలమానవసేవవఱకు నభివృద్ధి

తెలుపుచున్నది. మానవసేవయే మాధవసేవ (Service of man is service of God) యన నిదియే.

మరియొక విషయము. "సౌందర్యము, శుభ్రత" యనునవి నాగరకతాచిహ్నము లైనవి. అనాగరకులు వీనియెడ నంత శ్రద్ధ వహింపరు. పూర్వము బలమున్న వారిదే రాజ్యము. ఇప్పుడును జాలవఱకంతియే. కాని సామాన్యమానవజీవితములో బలహీనుని ప్రహరించి బలవంతు డాతని భార్యను, ధనమును అపహరింపలేడు. అనగా బలముయొక్క స్థానమును న్యాయ మాక్రమింప మొదలిడినది. న్యాయ మననేమి? సంఘశ్రేయస్సున కనువగు నొక పద్ధతి. సంఘశ్రేయస్సు ప్రత్యేక మానవ శ్రేయస్సును మించినదనియు, వాంఛనీయ మనియు మన మొప్పుకొనినట్లేకదా! ఇది యాధునిక నాగరకతకు ప్రథమ సోపానము. దీనివలన నాగరకజాతులు సంఘశ్రేయస్సుకై తమ యిచ్ఛలను గొంతవఱకు బలి యొసగినవి. దీనిచే సామాన్యమానవులయందలి సంతోష వాంఛకు నాధ్యాత్మికత (Sublimation) సంభవించినది. ఇది మానవుని నాగరకతాపరిణామమునందలి ముఖ్యఘట్టము. స్వార్థరాహిత్యమే ఆధునిక నాగరకతకు పునాది.

నరు డనాగరకస్థితిలో ననేక శతాబ్దములక్రింద వానరముపలె తన శక్తిపైననే తన జీవిత మాధారపడెనని తలచెను. అటుపిదప దన కితరుల సహాయ మవసరమని గ్రహించెను. దీనివలననే సంసారమును సృష్టించుకొనెను. స్త్రీ యేదో యొకసారి వాంఛనీయ యను దృష్టి మాని, ధర్మపత్ని యగుటకు నిదియే దారితీసెను. స్త్రీ తన శరీరభాగమగు బిడ్డను దనయొద్ద నుంచుకొనగలుగుటకును, దన రక్షణకొఱకును స్వభావముగ బలవంతుడగు పురుషునిపై నాధారపడి, యాతని గృహిణియై, గృహకృత్యముల నలవఱచుకొనెను. అనేకు లొకచోట వసించుటయే నాగరకత కారంభము. ప్రథమమున బురుషుడు స్త్రీలోలత్వము సుఖకారణమని గ్రహించెను. దీనికై, తనను దాటి మఱియొక వ్యక్తితో సఖ్య మతని కవసరమాయెను. స్వార్థము నుండి మానవుడు విముక్తి నందజొచ్చెను. ఈవిముక్తి భార్యాప్రేమతో నారంభమై, సంసారాభిమానముగను, పిదప సంఘాభిమానముగను, నటుపై మానవాభిమానముగను మారినది. ఈ తుదిమెట్టు జూచినవారు బుద్ధుడు, ఏసుక్రీస్తు, గాంధీ మహాత్ముడు మున్నగువారు. స్త్రీ యంగములయందును, నామెసౌందర్యమునందును దృష్టి వీడినది. ఇం దాధ్యాత్మికత వెలసినది. దీనికి మత మొక నూతనార్థము కల్పించినది. ధర్మమనునది దీనికి వ్యాఖ్యానమైనది. ఈ సర్వజీవములయెడ ప్రేమయే మానవుడు చేరగల యుత్కృష్టదశ.

మరియొక విచిత్రపరిణామమేమన, ప్రథమమున స్త్రీవలననే యాధునిక నాగరకతకు ప్రధాన చిహ్నమైన స్వార్థరాహిత్య మేర్పడినది. పిదప నామెవలననే దాని యభివృద్ధికి అంతరాయములును గలిగినవి. ఆమె తన యెడలను, దన కుటుంబమునెడలను గల ప్రేమచే పురుషుని బంధించి వైచినది. పురుషునకు వీని నతిక్రమింప మహాకష్టమైనది. బుద్ధుని సంసారత్యాగగాథ దీనిని జ్ఞప్తికి దెచ్చును. నాగరకతాభివృద్ధి చేయు భారము పురుషునిపై బడినది. ఆధ్యాత్మికశక్తి నలవఱచుకొని, పెంపొందించుటకు స్త్రీకి శక్తిచాలదు. అందుచే పురుషుడే యా భారమును వహించెను. దాన, స్త్రీయెడ నాతనికి విముఖత యేర్పడసాగెను. కనుకనే నాగరకుడు స్త్రీసంబంధమును తగ్గించి విశ్వజీవకళ్యాణమునకై ప్రయత్నము జేయుట చూచుచున్నాము. ఈ దృష్టిచే గాంధీజీ మహానాగరకుడని తోచుచున్నది.

ఏసుక్రీస్తు "నీ శత్రువునుగూడ ప్రేమింపు"మని యాదేశించెను. ఇది సాధ్యమా? ఒకవేళ ప్రయత్నముచే సాధ్యమైనను, నిన్ను ద్వేషించువానిని నీ వేల ప్రేమింపవలెను? అకారణప్రేమయే అసంభవమైనపుడు, శత్రునియెడ ప్రేమ యెట్లు కలుగును? అన్ని మతములును సామాన్యముగా శత్రునైన ప్రేమించుమనును. కాని యందలి యసంభవత్వమును గుర్తించుట లేదు. దీని కొకటియే కారణము స్ఫురించును. మానవుడు కలహకారకుడు. అకారణముగ నితరులను హింసించును. "చెంగిజ్ ఖాన్", "తామర్లేను"లు దీనికి ఉదాహరణము. ఇదియే నాగరకతను నశింపజేయగల మహాశక్తి. దీని నణచుటకే ప్రవక్తలు "శత్రునైన ప్రేమింపు"మని యాదేశించిరి.

సామ్యవాదులు (Communists) మానవ ప్రకృతిని మఱియొక దృష్టితో జూచిరి. నరుడు సాత్వికుడనియు, నితరుల ప్రేమించుట యాతని ప్రకృతియనియు, ధనకాంక్షయే యాతని చెరచినదనియు, దానిని తీసివైచినచో నాగరకతాభివృద్ధి యగుననియు వారు నమ్మిరి. కాని సర్వమానవ సమత్వము సాధ్యమా? ప్రకృతిలోనే కొందఱు మేధావులు, కొందఱు మూఢులు, కొందరు మహాబలవంతులు, కొందరు బలహీనులు. వీరి నందఱ నేకముగా దలచుట సరియగునా? అదియుగాక అనేక శతాబ్దముల క్రింద ధన మనునేమో తెలియని యనాగరకదశలో మానవులు ప్రశాంతముగ నుండిరా? ఆస్తిహక్కులను బూర్తిగ దీసివైచినను, స్త్రీ కొఱకై మానవులు తగవులాడుదురు. మహాయుద్ధములకును, వైరములకును వనిత యెన్నిసారులు కారణభూతురాలు కాలేదు? అయితే స్త్రీ పురుష సంబంధమును నియమించు సంసారమునే తీసివేసి స్వేచ్ఛా ప్రణయమును (Free love) ఏర్పఱచిన, వివాదకారణములు మాయమై, నాగరకతాభివృద్ధి గలుగునా? ఈ నూతన మార్గముల నూహించుట దుష్కరము.

సర్వమానవ సౌభ్రాత్రమును క్రైస్తవమతము బోధించెను. అటుపై యూదులను క్రైస్తవులు ద్వేషింప నారంభించిరి. రష్యనులు సామ్యవాద ప్రచార మారంభించిరి. అంత అమెరికనులు వారిపై కత్తిగట్ట సిద్ధమగుచుండిరి. కనుక జరా, మృత్యువులను దేహ మెట్లతిక్రమింపలేదో, యట్లే కొన్ని గుణములను మానవుడు దాటజాలనట్లు ప్రకృతియే మనకు బోధించుచున్నది.

మహాకవియు, వేదాంతియు నైన "షిల్లరు" "ఆకలి, ప్రేమ యనునవే ప్రపంచమును నడిపించుచున్న"వని పలికెను. ఆకలిని దృప్తిపఱచుటకు మనము కష్టింతుము. ప్రేమవల్లనే జీవుల యుత్పత్తి గలుగుచున్నది. ఇందు మనము నూతన విషయ మేమి కనుగొంటిమి? సిరా, కాగితములను వృథాగా వాడుచుంటిమా యనిపించుచున్నది. తెలిసినంతవఱకు భావములను సమన్వయపఱచుకొంటిమని యనుకొనవలెను. "ఫ్రాయిడ్" మానవ స్వభావమున కలహవాంఛ నిబిడీకృతమైయున్నదనియు, ఇదియే యాధునిక నాగరికతను పెంపొందనీయకున్నదనియు దృఢముగా విశ్వసించుచున్నాడు. నాగరికతాప్రవాహ మొక మహాశక్తి. దీనియందు మానవుడు కొట్టుకొని పోవుచున్నాడు. ఇది యెటకు గొనిపోవునో సరిగా చెప్పలేము. ఇంతులకు ప్రధానచిహ్నమైన ప్రేమ ప్రథమమున కుటుంబములయందును, పిదప జాతులయందును, అటుపై సర్వమానవైక్యమునందును లగింప యత్నించుచున్నది. ఇది యేల ఇట్లు చేయుచున్నదో మన మెఱుగము. ఈ మహాకార్యము ప్రస్తుత మింకను జరుగుచునేయున్నది. ఇదియే యాధునిక నాగరకతా పరిణామము.

నేటి నాగరకతా ప్రవాహము నరికట్టు మానవుని కలహవాంఛ నిది యెట్లు జయించుచున్నది యను నది ముఖ్యమైన ప్రశ్న. ఇతరులపై బడవలెనను కలహవాంఛను నరుడు ఆత్మనిగ్రహమున కుపయోగించుచున్నాడు. ఈ అంతర్యుద్ధమున ఆత్మ (Conscience) యనున దేర్పడినది. ఇందువలననే పాపభీతి గలిగినది. ఇతరులను హింసించుట పాపము; పరోపకారమే మహాధర్మము అనునవి వీనివలననే కలిగినవి. చెడు కార్యముల జేయుటయేకాక, చెడుయూహలు గలుగుటయు పాపమే యనునది వీని పరిణామము. మంచి చెడుగుల నెఱుగుట యెట్లు? అది స్వభావముగనే కలుగుననుట మనము సమ్మతింపజాలము. పదుమూడేండ్లబాలికల వివాహము యూరపు, అమెరికాలలో పాపముగ బరిగణింతురు. హిందూదేశమున నదియే శాస్త్రసమ్మతము, నాచారసమ్మతము నైనది. ఒకేపని యొకచోట నధర్మము, వేఱొక యెడ ధర్మము నైనది. కాన స్వభావముచేతనే ధర్మాధర్మముల నెఱుగనగు ననుట తప్పు. బాహ్యపరిస్థితులే ధర్మాధర్మములను నిర్ణయించుచున్నవి. కుంతి పుత్రులగనినట్లు నేటిస్త్రీలు బిడ్డల గనుట శాస్త్రసమ్మతమగునా? సంభవమా? కాలపరిస్థితులు మాఱినంతనే ధర్మమునను మార్పు గలిగినట్లే కదా! మానవుని ధర్మకాంక్ష ప్రేమను గోల్పోదునను భయముచేతనే (dread of losing love) కలిగినది. తన ప్రేమపాత్రులు ప్రేమను

గోల్పోయినచో వారు తన కష్టములకు గారుకదా! కష్టమే లేని మానవు డుండునా? కష్ట సమయమున సహాయ మపేక్షించుట సహజమేకదా? ప్రేమాస్పదుల ప్రేమను గోల్పోవుటచే గష్టసమయములందు వారి యుపకారమునకు మా అపకారముకూడ గలుగవచ్చును. ఒక మనుష్యునకు వర్తించునదే సంఘమునకు గూడ వర్తించును. సంఘముయొక్క కట్టుబాటుల నతిక్రమించుటకు, మనము భయపడుటకు మూలకారణ మిదియే. ఎంత పెద్దమాటలు చెప్పినను, సామాన్యముగా నితరుల సహాయము, సంఘసహాయము నెల్లర కవసరమే. మానవప్రేమకు, సంఘప్రేమకు దూరుల మగుదుమను కారణమే మానవులను ధర్మబద్ధులను, సంఘనియమములను పాటించువారినిగా జేయుచున్నది. ప్రతివాడు నివి యన్నియు యోచించియే యీ విధముగా నడచుచున్నాడని భావముగాదు. తెలిసియో, తెలియకయో యీ కారణములు మనస్సు నొక విధమున నడిపించుచున్నవనియే యభిప్రాయము. ఈ పరిణామముల దెలుపుటలో వేలకొలది సంవత్సరములలో గలిగిన మానవుని మనస్తత్వమును విశదీకరించుచుంటి మనునది పాఠకులు మరువరాదు.

ఇప్పటి కాత్మ (Conscience) కొక నూతన స్థాన మేర్పడినది. మంచి చెడుగులను నిరూపించు శక్తి దానికి గలిగినది. మఱియొక చిత్రమేమన, ఎవ్వడు సుజనుడో వాడే తన యందలి లోటులను బహునిశితముగా విమర్శించును. అతని యాత్మ యతనియొక మహోకతివముగ వర్తించును. స్వల్పవిషయములందు గూడ నాతడు తన్ను దానే శిక్షించుకొనును. గాంధీజీ యుపవాసదీక్షలే యిందులకు దార్కాణములు. కర్మ యనుదానిని విశ్వసించుటకును, భగవానుడు మానవుని గర్మకర్తనిగ జేసెననుటకును నరుడు సిద్ధపడెను. భగవంతుడు సుఖదుఃఖముల రెంటిని గలిగించువాడని యొఱుగక, తనకు గల కష్టములకు తన దుష్కృతములే కారణములని యెంచి మానవుడు కఠినతరమగు మతశిక్షణ నేర్పఱచుకొనెను. ఇందుల కొక చిన్న యుదాహరణము గలదు. సామాన్యముగ పెరిగిన పిల్లలు ప్రతిస్వల్పవిషయమును మనసున నాటించుకొని యిష్టములేని దేదైన జరిగిన గుమిలి కుమిలి యేడ్తురు. అపురూపముగా పెరిగినవారు కష్టముల నంతగా నెఱుగక తమకు నిష్టముకాని దే స్వల్పవిషయము జరిగినను భరింపలేక అతిగా దుఃఖింతురు. సత్పురుషుని యాత్మయు నిదేవిధమున ధర్మమార్గమున కేమాత్రి మెడకైనను అది అతనిని బరితాపసముద్రమున ముంచును.

పాపపుణ్యముల పరిజ్ఞాన మాధునిక విజ్ఞానమున నొక ముఖ్యఘట్టము. ఇదియే మానవుని సుకుమారుని జేసినది. ఇది కొంత వికృతముగా గనుపించుట నిజమే. పాపినని మనసునకు గట్టిగా దోచుటచే సామాన్య వైద్యుల కర్థముగాని యనేక రోగములు గలుగుచున్నవి.

ఆధునిక నాగరకత మానవుని స్వసుఖకాంక్షకును, స్వార్థరాహిత్యమునకును జరుగు సంఘర్షణ యొక్క ఫలము. భూమి తనచుట్టును దాను దిరుగుటయే కాక సూర్యునిచుట్టుకూడ దిరుగుచున్నది. అదె విధమున మానవునియందు రెండురీతులు గానవగును. అందొకటి స్వసుఖాభిలాష; రెండవది సంఘశ్రేయస్సునకు స్వార్థరాహిత్యము.

మఱియొక విచిత్రభావమును "ఫ్రాయిడ్" అనువదించెను. మానవుని యాత్మ యభివృద్ధిజెందినట్లే సంఘమునకుగూడ నాత్మ (Conscience of a Society) యభివృద్ధిజెందును. ఒక సంఘమునందొక్క పురుషునియందు ధాయాత్మ లక్షణములన్నియు మూర్తీభవించును. స్వార్థరాహిత్యము, శాంతి, ధర్మము, శౌచము వారి నాశ్రయించును. అట్టివారిని జనులు పరిహసించి, బాధించి, తుదకు జంపివేయుదురు. అటుపిదప వారికి దైవస్థానము లభించి ప్రజలు వారిని బూజింతురు. ఏసుక్రీస్తు, గాంధీమహాత్ముడు నిట్టివారే కదా! శ్రీ కృష్ణభగవానుని కిట్టి యిక్కటులు లభింపమి నాయనను పూర్ణపురుషు డనిరి.

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

అను గీతావాక్య మీ సత్యమును మరియొకవిధమున వెల్లడించుచున్నది.

మానవుని ప్రధానగుణములగు కలహవాంఛ, సంతోషకాంక్ష యనునవి ఆధునిక నాగరకతకు శత్రువులు. వీని నిర్మూలనమునకే మహాపురుషులు యత్నించిరి. పుణ్యపాపములకు దగు ఫలమున్నదని మతములు బోధించుటచేతనే యవి శక్తిమంతములైనవి. సామ్యవాదులు చెప్పినట్లు ధనముకొక్క ప్రాముఖ్యము తీసివేయుటచే నాగరకతాభివృద్ధి కలుగుట నిజమే కాని, వాడు ప్రకృతిచే మానవుడు శాంతిప్రియుడని, ధర్మపరుడని యనుకొనుట పొరపాటు. ఆధునిక నాగరకత మనల ననిర్వచనీయమగు మహోన్నతపదవికి జేర్చునా యనునది వేఱొక విషయము. దాని మంచిచెడుగుల నటుంచి, యీ ప్రవాహమున కెదురీత నీదలేమనుట మాత్రము నిశ్చయము. ఆధునిక శాస్త్రజ్ఞానముచే మానవులందఱును సుఖింపదగు జీవితపథము లేర్పఱచ నగును; లేదా, మఱియొక యుద్ధమున "ఆటంబాంబు"ల నుపయోగించి మానవజీవితమే లేకుండ చేయవచ్చును. ఈ సంఘర్షణమున మానవుని కలహవాంఛయే పైచేయి యగునా, లేక స్వార్థరాహిత్యమే గెలుచునా?



# బురదనీరు

[కథానిక]

•

శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

ఆ రోజు వర్షం వసి వెలిసింది. ఊళ్ళో పెద్దలూ, పిన్నలూ అంతా రచ్చరాయిమీదికి చేరేరు. అందులో నలుగురు డబ్బులేని పేకాటాడుతూంటే తక్కినవాళ్ళు చూస్తూ, సలహాలిస్తూ ఆనందిస్తున్నారు. మాంతివీథి అప్పలనాయుడు మీసాలు పెనవేసుకుంటూ రాయిదగ్గరికి వచ్చేడు. అప్పలనాయుడికి ఊళ్ళో మంచి గౌరవం ఉంది. ఊరికి మునసబు. డబ్బులేకపోయినా మంచి తెలివైనవాడని ప్రసిద్ధి. గొప్ప వ్యవహారవేత్త. తను ఊళ్ళో ఎవరికేసు పట్టుకున్నా జయం తప్పదు. చదువురాకపోయినా, తనలాగ ఏ ప్లీడరూ సలహా లివ్వ లేడు. ప్లీడర్లతోనూ, మేజిస్ట్రేటులతోనూ మాట్లాడాలన్నా, కోర్టుకి సాక్షుల్ని జతపెట్టాలన్నా, పోలీసు వాళ్ళతో వ్యవహారాలు చక్కబెట్టాలన్నా అతడి సహాయంలేంది ఏమీ జరగదు. ఊళ్ళో చదువుకున్న కరణంకూడా అతనిదగ్గర పనికిరాడు.

అప్పలనాయుడిని చూడగానే తమ్మన్నతాత లేచి దండం పెట్టేడు. తమ్మన్నతాత ముసలివాడు కాడు. యువకుడూ కాడు. ఓ నలభైఏళ్ళుంటాయి—మోతుబరిరైతు—మంచివాడు—ఒహరిజోలికి వెళ్ళడు. అంచేత అతడంటే ఆ వూళ్ళో గౌరవం ఉంది.

అప్పలనాయుడు నమస్కారం అందుకుని, "ఏం తాతా, ఏటిసమాచారం, మీ పొలం ఉభా అయిందేటి?"

"ఆ—అయింది మామా. కాని బాబులు తిగొచ్చినారు" అన్నాడు తమ్మన్న.

"ఏం?"

"ఈ కూలోళ్ళతో పడలేక పోతున్నాం మామా—మొగోడికి రూపాయి, ఆడదానికి అర్ధ. బాగా పొద్దెక్కేలకి దిగబడి పొద్దు గూకకముందే పనొగ్గేస్తారు—ఏటి బరించడం చెప్పు?"

"నీకేటి, మారాజువి—"

"నీరు సమంగా సేనుగదా; నీరుంటే పోనీ, నువ్వన్నమాటే—"

"తాతా, నీరంటే యాదస్తొచ్చింది. ఈ యీధిలోంచి పోతూన్న మురగటినీరు ఎవరి పొలంలోకి ఎల్తాందిరా?"

వీథిలోంచి మురగటినీరు తాచుపాములా పారుతోంది. అందులో సాయంత్రపు అరుణకాంతులు పడుతున్నాయి. కాని బురదనీరు కాబట్టి మసిబారిన చిమ్నీలా ఉంది.

అప్పలనాయుడికి తెలుసు ఈ నీరు గంటెప్పడి పొలానికి పోతూందని. గంటెప్పడు కూడా మోతుబరే. కాని మోతుబరి రైతుల్లోకల్లా ఇంతవరకూ దావాల్లోకీ, కోర్టుల్లోకీ దిగకుండా కాలక్షేపం చేస్తున్నవాళ్ళు గంటెప్పుడూ, తమ్మన్నతాతే. అంచేతే అప్పలనాయుడికి వీళ్ళనిచూస్తే కన్నెర్ర.

"ఒరే తాతా, ఈ నీరు నీయింటి పక్కనుంచే గదరా పోతాది—నీ మిరపతోటల్లో కెట్టగా—" అని సలహా ఇచ్చేడు అప్పలనాయుడు.

"తప్పు మామా, మనకెందుకా నిష్టూరం— తొలికాకినించి ఆడిదే ఈ నీరు—"

"ఆడిదా నీరు—ఆడి బాబు గడించేడేట్రా? ఈదిలో పారే నీరు ఒకడిదేట్రా—అందరిదీన్నీ. ఒరే! వన్నాకరికి ఎవ్వారగ్యానం లేనోడికింద కట్టేసి వావు—"

తమ్మన్నకి ఆశ కలిగింది. మురగటినీరు మంచి పస్తుయింది—ఆ నీరు పెడితే మిరపతోట ఇప్పటి కంటే నాలుగురెట్లు కాస్తుంది. కాని ఎలాగ?

"భయమేంటిరా, పదేశ్, నేనున్నా—" అప్పలనాయుడు తమ్మన్న చెయ్యిపట్టుకుని ఈడ్చుకెళ్ళేడు. వీథిలోంచి పారే నీటికి కాలితో మన్నుతోసి మిరపతోటకి చిన్నకాలవ చేసేడు. నీరు దగ్గరగానున్న మిరపతోటలోకి పరుగెత్తింది.

అప్పలనాయుడు తన ప్రజ్ఞకి తనలో తను సంతృప్తిపడ్డాడు. తను వేసిన పాచిక బాగానే పారింది. తమ్మన్న బుట్టలో పడ్డాడు. ఇంక గంటెప్పడు కూడా పడాలి. అందులో వాడెంతసేపు! తన శిష్యులలో ఎవడినేనా ఒకడినిపంపి వాడిని రెచ్చగొట్టించగలడు.

బాగా చీకటి పడింది. తమ్మన్న తాత ఇంటి కొచ్చి గుమ్మంలో చూరుకింద కూర్చుని ఆలోచిస్తున్నాడు. సంవత్సరానికి పాతిక రూపాయలొచ్చే మిరపతోట తన కెన్నో ఆశలు కలిగించింది—ఆ మురగటి నీరుగాని పారితే, ఆ తోట ఇంక ఎంతైనా కాస్తుంది. నాలుగేళ్లూరుకుంటే ఆతోటమీద వొచ్చే దానితల్లి ఒక చిన్న పెంకుటిల్లు లేవదీయొచ్చు. మరో నాలుగెకరాలు కొని చిన్న మామిడితోట వేశామంటే ఇంక తన వెనకాల ఎంతమంది తిరుగుతారు! గంటెప్పడికి పెంకుటిల్లూ, మామిడితోటా ఉన్నాయి. వాడి బంగారపు కడియం, సిలుకులాల్చీ, అబ్బో—వాడిని చూడగలమా!

భార్య గురివి కిరసనాయిలుబుడ్డి వెలిగించి లోపలికి వచ్చింది.

"ఏ టెక్కడ కూకున్నావు—సీకటి"—బుడ్డి నేలపెట్టి నిలబడేసరికి, చూరు గురివిబుర్రకి తగిలింది.

"దీని తెమ్మడ—అబ్బ—"

"గట్టిగా తగిలిందేటే—"

"నేదునే—"

"గురివీ! పెంకుటిల్లు కట్టిద్దామని ఎంతకాలమయో మనసుంది. కాని డబ్బుతో పని"-

"ఓలమ్మో- ఏటాశ - పెంకుటిల్లంటే మజాకా లేటి- పోనిద్దూ, బగవంతుడెంతిస్తే అంతే- నెసు, గంజి తాగుదుగాని—"

వీథిలో అడుగుల చప్పుడయింది. ఏమిటో అని లేచాడు తమ్మన్న.

"ఒరేయి తమ్మన్నా, ఇలా రారా—" వీథిలో గంటెప్పడు ఓ పదిమందిని తీసుకుని వచ్చేడు.

"నీ బాబుగాడి సొమ్మేటిరా, ఆనీరు, నీ మిరపతోటలో కట్టేశావు—"

"ఫోఫోన్—నీబాబుదేటి పరసపునీరు—"

వచ్చిన పెద్దమనుషులందరూ తలోకరీతి తీర్పు చెప్పేరు. కాని తగువు పెద్దదయి, కొట్టుకున్నంత వరకూ వచ్చింది. గంటెప్పడి పెళ్ళాం నోరు విప్పిందంటే మాడు లోకాలూ మానెలు కొట్టిస్తుంది. తమ్మన్న పెళ్ళాం మాత్రం తక్కువదా—అదీ తిట్టింది. పౌరుషం, పరాక్రమం రెండువేపులా బాగా కనబరచారు. రాత్రి ఎవరి మానాన్ని వారు వెళ్ళిపోయారు.

కాని అప్పలనాయుడు రెండువేపులా ఊది గాలి పేడు. కోర్టులో దావాలు పడ్డాయి. తమ్మన్న అప్పలనాయుడి దన్నుమీద మీసం మెలివేశాడు. గంటెప్పడు అప్పలనాయుడి శిష్యుడి దన్నుమీద లేచి నిలబడ్డాడు. రకరకాల సాక్ష్యాలు, ఫీజులు, లంచాలు, ఖర్చులు—అన్నీ ఓ వెయ్యిరూపాయలవరకూ వదిలిపోయాయి తమ్మన్నకి. కాని కేసుపోయింది.

తమ్మన్న మొహం వేలేసి, ఇంటి గుమ్మంలో కూర్చున్నాడు—అప్పలనాయుడు వచ్చి ఓదార్చేడు.

"మామా, కోర్టుకెక్కినోడూ, గాడిదెక్కినోడూ ఒకటేనట—ఊరికేనే చెప్పినారేటి పాత్రం—" అన్నాడు తమ్మన్న.

"తాతా, ఇంకట్లోకే తేజాగా తిప్పోతే ఎలాగెల్తాయి ఎవ్వారాలు—మనం గెలిపిచ్చీరుతాం".

"ఇంక గెలిసేదేమిటి—పేనపిడకలు—"

"ఏటి, దీన్తోటి పరేటి—ఈడ కాకపోతే ఈడి బాబు ఇంకోడు. జిల్లాకోరటులో ఈ ఏసాలు సాగవు రోయ్—అంతా న్యాయమే. భగమంతుడున్నాడ్రోయ్ తాతా—"

"ఏటి సెప్తూ సివబాబూ, ఈ కాలంలో న్యాయమేటి ?" అన్నది సురివి. మళ్ళీ కోర్టుకెక్కితే తన వొంటిమీదున్న ఆ వొక్క నానూ ఎగిరిపోతుంది—

ఇది జూదం లాంటిది—ఓడిపోతున్న కొద్దీ పౌరుషం ఎక్కువవుతుంది.

"సీ—మీ కసలు పౌరుషం లేదేన్—మీతోటి నాకేటి? ఎలమోడినికావురా ? చిగ్గసేమా? గంటెప్పుడు అలా ఛాతీ ఇరుచుకు తిరుగుతూంటే—"

తమ్మన్నలో దాగిఉన్న వెలమ పౌరుషం అంతా ఒక్కసారి సముద్ర కెరటంలా తోసుకొచ్చింది. మీసాలు మెలివేసి "సరే, పద మావా, దీని అంతేటో సూదాం—" అంటూ లేచాడు.

మళ్ళీ ఈసారి న్యాయం కోసం జిల్లా కోర్టుకి వెళ్ళారు. ప్లీడరు బాగా ధైర్యం చెప్పేడు—అయినా ప్లీడరు రంగారావు కూడా మహా గట్టివాడు. ప్లీడరు వరకూ ఎందుకు, అతడి గుమాస్తా నరసయ్య—అబ్బో—అసాధ్యుడు. అతడు ప్లీడరుగారికే సలహాలు ఇస్తూంటాడు. కోర్టుచుట్టూ తిరగ్గా తిరగ్గా, లంచాలు, సాక్ష్యాలు, వతలబులు అన్నీ అవగా, తీర్పుఅయింది. బురదనీటి కేసు చాలా పెద్ద ప్రసిద్ధమయిన కేసయింది. తీర్పు చేసేసరికి చాలాకాలం పట్టింది. తమ్మన్నకు ఈసారి వెయ్యిరూపాయిలొదిలిపోయాయి—కేసు మాత్రం పోలేదు. కాని గెలవాలేదు. బురదనీటి హక్కు ఊరందరికీ ఉందనీ, అందరూ ఉపయోగించుకో వచ్చుననీ, గంటెప్ప ఒక్కడే ఉపయోగించుకోకూడదనీ, కాబట్టి ఇప్పుడు అందరికీ ఉపయోగంగా ఉండేటట్టు ఆ నీరు ఊరి చెరువులోకి వెళ్ళాలనీ కోర్టువారు తీర్పు చెప్పేరు. తీర్పుకి ఊళ్ళో అంతా సంతోషించారు.

తమ్మన్నకి రెండువేలు వొదిలిపోయాయి—ఆ విచారం ఉన్నా, వెలమ పౌరుషం చూపించానన్న సంతృప్తి ఉంది. "రామిగాడి సాచ్చికం పాడైయింది లేకపోతేనా—ఆ నీరు మన మిరపతోటలో కొచ్చేదే" అన్నాడు పెళ్ళాంతో. పోయినడబ్బు పోతేపోయింది గాని కోర్టురూల్సు బాగా తెలిశాయి తమ్మన్నకి. కేసు గురించి పెళ్ళాం దగ్గిర డాబులుకొట్టేడు.

"సాల్నెద్దూ—కడుపులోనికూ డరక్క కోరటు లెక్కినాం—నాగులోడు, తీగ, నాను, మడిసెక్క అన్నీ ఎల్లిపోనాయి—ఏటో, కరమం—"

అంటూ ఏడిచింది సురివి.

ఆరిపోయిన చుట్ట గుమ్మం వొద్దున పెట్టి, ఆవలిస్తూ నులకమంచం మీద పడుంవాళ్ళేడు. సురివి నేలమీద గోనెపరుచుకుని పడుకుంది. తమ్మన్న పూరిల్లు కూడా వాళ్ళతోటే నిద్రపోయింది.

కాని దూరాన్న చీకట్లో అప్పలనాయుడు కొత్తగా కట్టిన డాబా తెల్లగా కనిపిస్తోంది.



# భిక్షాం దేహి !

## శ్రీ కె. అన్నమరాజశర్మ

గగన మగలించు తపనుఁ డగ్గమ్మురీఁకు
సార్థకాఖ్యతఁ జెలఁగ మధ్యాహ్న వేళ
భిక్షుకుం డొక్కఁ డాఁకటఁ బెంచు వారి
దేహి యని వాడవాడలఁ దిరుగుచుండె.

బారులుదీరినట్టి యొక
బ్రాహ్మణవీథిని జేరి, భూసుర
ద్వారము చెంత భిక్షుకుఁడు
భైక్షుకపాత్రను జాపినంత, కో
పారుణితాక్షుఁడై యొక ధ
రామరపుత్రుఁడు "యాచకుండ, దో:
సారము గల్గి, యింద్రియపు
సౌష్ఠవ ముండియు, ముష్టిమెత్తెదే ?

బలమును యౌవనమ్ము నిను
బంచుకొనెన్ సమభాగ మూని, యె
ద్దుల గొని కర్షకుండ వయి
దున్నుచు భూముల హర్షచిత్తతం
జెలువము స్వేచ్ఛయుం దొరఁక
జీవము దాల్చుట లగ్గు, కుంటి గ్రు
డ్డుల పగిదిం జరింపఁగఁ గ
డుంగడు హేయము సిగ్గుచేటుగన్."

అని పరుషోక్తులం బలుక
నార్ద్రమనస్కుఁడు భిక్షుకుండు లో
చనములఁ బ్రేమవీచికలు
జాల్గొన "నేస్తు ! బికారి జీవనం

బనయము మూష్యమే యగుఁ; య
థార్థము నే నొక హాలికుండనే!
మనుజహృదంత రాళముల
మానక సేద్యము చేయుచుండుదుఁగా.

జననమరణాదివికృతసంసారజగతి
కర్మబీజమ్ములను నాటు కర్షకుండ,
అవ్యయానందముం బ్రజ కందఁజేయ
ఏకలక్ష్యపు వ్యవసాయ మే నొనర్తు.

పాపతృణసంకులంబయి పాడువడిన
చిత్తకేదారముల జ్ఞానసీర మూని
పెల్లగించుట జీవనవృత్తి నాకు
హాలికుఁడనో, బికారినో యరయు మింక.

ఈ యనాసక్తిహృద్వ్యవసాయమందు
శమదమాదులె మామకసాధనములు,
అస్ఖలితపూతవిశ్వాస మవధిగాఁగ
ఇంద్రియపు టెడ్ల నదలింతు నేకధాటి!”

అని వచించిన భిక్షుకు నార్ద్రదృష్టి
బ్రాహ్మణుఁడు చూచి భక్తిప్రపత్తిఁ బలికె
“భిక్షుకా! విశ్వవిస్తృతప్రేమభరిత
గౌతమాకృతిగాఁగ సాక్షాత్కరింతె!”

---



3. బెలూచిస్థాన్ బాలిక



౪. నిసర్గరమణీయమైన నైరోబీ పర్వతప్రాంతము భారతి. జూన్ '48

# అహింస - మానవజీవనము

శ్రీ దండిపల్లి వెంకటసుబ్బాశాస్త్రి

విమర్శాత్మకమైన మానవబుద్ధికి సృష్టియొక్క ప్రారంభదశలో మానవునివ్యవస్థ ఏమిటి? మానవుడెలా సభ్యుడు కాగలిగాడు? అనే రెండు ప్రశ్నలుదయిస్తాయి. మానవుని ఇతిహాసాన్నిబట్టి చూస్తే ఒకానొకప్పుడు పశువులవలెనే మానవుడు తన జీవితాన్ని గడిపినట్లు వ్యక్తమౌతుంది. ప్రారంభదశయందు పశువుల్లో వుండే అన్యోన్యతకూడా మానవులయందుండేది కాదు. మానవుడు ఎల్లకాలమూ యుద్ధాల్లో నిమగ్నుడై వుండేవాడు. "పాడుకుచేతుల పందేరము" వలె బలిష్ఠుడైనవానిదే ఏకచ్ఛత్రాధిపత్యము. సృష్ట్యారంభంలో కేవలము బలవంతుడు, సాహసి యైన మానవుడే ప్రపంచములో బ్రతుకగలిగేవాడని మానవచరిత్ర మనకు తెల్పుతున్నది.

కాలక్రమాన్ని అనుసరించి మానవునిలో పశుత్వం తొలగిపోసాగింది. ఈ పశుత్వం చాలాకాలంపాటు మానవుల్లో వున్నట్లైన మానవజాతి ఏనాడో నశించేది. మానవవినాశకారణాలైన యుద్ధము - హింసస్థానాల్లోనే క్రొత్తశక్తులు వెదకబడినాయి. ఆ క్రొత్తశక్తులే కుటుంబ- జాతి- రాష్ట్రములనెడి సామూహికవాంఛల పుట్టుకకు కారణాలైనాయి. ఈ సామూహికవాంఛల నుండి శాంత్యహింసలు తలెత్తి, మానవుల్లో పాదుకొని వుండిన రాక్షసత్వాన్ని రూపుమాపి నిజాయితీవిన మానవ గుణాలతో మానవజీవితాన్ని సుశోభితం చేయగలిగాయి.

హింసనుగూర్చి ప్రత్యేకంగా విపులీకరించి చెప్ప నక్కరలేదు. ఏదైతే ప్రాణులకు దైహికంగానూ, మానసికంగానూ బాధ కలిగిస్తుందో అదే హింస. ఈ హింసావ్యవస్థ సృష్టిలో ఒక అంగంగా వుండటం మాత్రమే కాక, చార్వాకునిలాంటివారు దీనికి ప్రపంచంలో విపరీతప్రచారంకూడా చేశారు. దానితో హింసాప్రభావం ప్రపంచాన్ని ఆవరించుకొని పోయింది. హింసకానిదే అహింస. "అహింసా పరమో ధర్మః" అనేసూత్రం మన ధార్మికవ్యవస్థలో వున్నప్పటికీ ప్రత్యక్షంగా ప్రపంచం పాటించేందుకు పూనుకోలేదు. బుద్ధుడు, ఆయనఅనుయాయులు అహింసాప్రచారంకోసం తమ సర్వస్వమూ ధారపోశారు. ఫలితంమాత్రం చాలాకొద్ది. అహింస ప్రచారం వల్ల మానవుల రక్తనాళాల్లో ప్రవేశించలేకపోయింది. ప్రతివాడూ పరోక్షంగా అహింసను పాటిస్తూనే వున్నాడు. మానవుని జీవనంలో గొప్ప గొప్పమార్పులు సంభవించేకొలదీ అహింస సముచితస్థాన మాక్రమింపవచ్చు. ఈ యభిప్రాయాన్ని హింసలో క్రుళ్ళిపోతున్న నేటి నాగరకవ్యవస్థ, సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక పరిణామాలూ మరీ దృఢతరం చేస్తున్నాయి. ఈ రక్తపాతాలు- ఈ మారణసాధనాలు- ఆటంబాంబులు చూస్తే మానవజాతిమనుగడ దుర్భరమనిపించబట్టే నేడు సంఘంలో అహింసాప్రభావం దినదినాభివృద్ధి పొందుతున్నది. ఈ అభివృద్ధి మన కంటికి గోచరించదు. మానవుని నైతికవిధానంలో అహింసకు స్థానమేర్పడుతున్నది. నేటి అనుక్షణపరిణామాలతో కూడిన అంతర్జాతీయరాజకీయవ్యవస్థనుగూర్చి దీర్ఘంగా ఆలోచిస్తే ఈపాటికి మరోయుద్ధం రానూవచ్చి సర్వనాశనంతో అంతమైకూడా వుండేది. అలా కాక 'యుద్ధం' అనే మాటకు అన్ని దేశాలూ భయపడే స్థితికి వచ్చాయి. ఈ ఆటంబాంబు విసురులో యుద్ధమే తటస్థిస్తే మానవజాతి సగానికి సగమైనా నశించక తప్పదు. పరోక్షంగా ప్రపంచజాతులు అహింసకు లొంగిపోయినా యనే విషయం ముమ్మాటికీ నిజము. కొందరికి సందేహం కలుగవచ్చు.

అహింసకూ, మానవజీవితానికీ పూర్వంనుండి ఎలాంటిసంబంధం ఉంటూవచ్చిందో ఇప్పుడు ఆలోచిద్దాము. మానవుడు అవగతం చేసికోకుండానే అహింసను ఆచరిస్తున్నాడు. ఈ విషయాన్ని సిద్ధాంతీకరించుటకు మానవుని జీవితక్రమాన్ని పరిశీలిద్దాము.

మానవుని జీవితక్రమాన్ని పరిశీలించేందుకు ముందు యుగవిభజన మవసరము. అందులో మొదటిది మాతృసత్తాకయుగము. ఈ యుగంలో మానవుడు అజ్ఞానియై వెలసినాడు. అతను ఎందుకు పుట్టిందీ, కర్తవ్యమేమి అనే విషయా లెరుగలేదు. దానిని దాటి పితృసత్తాకయుగములో ప్రవేశించాడు. ఈ యుగంలో తన పుట్టుకకు కారణభూతు లిద్దరని గ్రహించి వారితో గల సంబంధాన్ని మానవుడు గుర్తించటం జరిగింది. ఆతర్వాత మానవుడు తన నివాసంకొరకు తోడి మానవులతో కలిసి ఒక్క ప్రదేశాన్ని నిర్ణయించుకొన్నారు. దీనినే జనపదయుగ మన్నారు. మానవు లొకరినొకర ర్థంచేసికోవటమూ, కష్టసుఖాల్లో ఒండొరులు సహాయపడటమూ ఈ యుగంలో తటస్థించింది. తదుపరి వచ్చిన రాజసత్తాకయుగంలో మానవులు తమలో నొక బలవంతుని పెద్దగా చేసికొని అతని ఆజ్ఞలను పాలించు క్రమశిక్షణను అలవరచుకొన్నారు. అక్కడనుండి మానవుడు సామాజికవాంఛలకు బద్ధుడై ఎలా తన జీవితంలో అహింసాసిద్ధాంతాన్ని ఆచరణలో పెడుతూవచ్చాడో ప్రత్యేకంగా పేర్కొందాము.

## ప రి వా ర ము

మానవుని చరిత్రలో ప్రాచీనమైనది పరివారము. ఈ కారణమువల్లనే మానవజీవనము మృత్యుముఖము నుండి రక్షింపబడి ఉన్నతిని పొందగలిగింది. ఆ పరివారవాంఛయే క్రమముగా హింసను వదలి అహింసను ఆశ్రయించింది. భార్యపై భర్తకు, పిల్లలపై తల్లిదండ్రులకు ఆధిపత్యం లభించటంమూలాన తన పరివారంలోని మనుష్యులకు మానవుడు కఠినమైన శారీరక దండన విధించలేకపోతున్నాడు. అవసరం కలిగినప్పుడు మాటలతో మందలిస్తాడు; లేదా సుకుమారమైన దండనతో సంతృప్తిచెందేవాడు.

పరివారంవల్లనే తనవారిని దండించే విషయంలో మానవునకు అనియంత్రితమైన అధికారముండేది. ఇందులో పాలకుడైన ప్రభువుకూడా చేయికలుగజేసికొన వీలులేదు. మానవుని ఇచ్ఛామాత్రమే నియంత్రణము. శిక్ష సుకుమారమైనదైనా, కఠోరమైనదైనా అతని ఇచ్ఛపైననే ఆధారపడి వుండేది. అతిగంభీరవిషయాల్లోమాత్రము రాజ్యాధికారి చేయికలుగజేసికొనుట కద్దు. నేడు సాధారణముగా కుటుంబపరిస్థితి తన అవధిని దాటి బహిఃప్రపంచములోనికి చొచ్చుకవస్తున్నది. కొంచెము వయసువచ్చినవారందరు స్వతంత్రు లవుతున్నారు. చిన్నచిన్న పిల్లలకు సయితము రాజ్యపరిస్థితు లాకర్షింపబడుతున్నాయి. వారివారి అధికారాల్ని సయితము చట్టసమ్మతము చేసే ప్రయత్నాలుకూడా ప్రారంభమైనాయి. తన బిడ్డల్ని అధికంగా శిక్షించే పట్ల ప్రభుత్వంవారు జోక్యం కలుగజేసికొని వారివారి హక్కుల్ని కాపాడేందుకు ప్రయత్నిస్తున్నారు.

## వి వా హ ము

వివాహబంధ మనేది మానవజీవనంలో గొప్ప మార్పు తెచ్చింది. ఒకానొకప్పుడు మానవుడు స్త్రీని దొంగతనంగాకానీ, జబర్దస్తీగాకాని తీసికొనిపోయి వివాహమాడుటను గొప్పగా తలచేవాడు. దీనికి మన పురాణాల్లోనూ, ధర్మశాస్త్రాల్లోనూ రుజువు కనిపిస్తున్నది. పైశాచిక, రాక్షసవివాహవిధులు మన మెరిగినవే! మానవుడు బలాత్కారముగా ఒకస్త్రీని వివాహమాడినప్పటికిని భార్యావిషయంలో కఠినంగా ప్రవర్తించేవాడు కాడు. ఇందుకు ప్రేమే కారణం కావచ్చు. నేడు వివాహానికి జాతి-పాతులూ, కుల-గోత్రాలూ మన దేశంలో చూచుకొంటున్నారు. అమెరికా, ఇంగ్లండు మొదలగు దేశాల్లో స్త్రీ పురుషులు స్వతంత్రించి పెండ్లాడుతున్నారు. మన దేశంలోనూ ఇట్టి స్వతంత్రవివాహాలు ఇప్పుడిప్పుడు విజృంభిస్తున్నాయి. వివాహవ్యవస్థ మానవజీవనంలో గొప్ప విప్లవం తెచ్చిందనే చెప్పవచ్చు.

ఈనాడు వివాహానంతరం భార్యాభర్తల్లో సమానత్వం అభివృద్ధిచెందుతున్నది. దినదినప్రవర్ధమానమవుతున్న 'నేటి' నాగరికత స్త్రీలయొక్క ఆర్థికదురవస్థను దూరముచేస్తున్నది. స్త్రీలకు, పురుషులకు మధ్యనున్న వ్యక్తిత్వఘర్షణమును రూపుమాపి స్త్రీజాతియొక్క స్థాయిని పెంపొందింపజేయుటకు నేటి సభ్యతా ప్రపంచము ముందడుగు వేస్తున్నది.

స్త్రీలు తమ స్థాయికొరకు పడు ఘర్షణమువలన స్త్రీ పురుషులలో అన్యోన్యత తగ్గుచున్నదనే విషయాన్ని ఎవ్వరూ గమనింపజాలకున్నారు. నేటికిని హిందూ దేశపు గ్రామాల్లో పురుషుడు తన భార్యను వ్యతిరేకింపక ఇద్దరూ ప్రేమతో నుండుట చూచుచున్నాము. ఆధునికవివాహసంస్కారము కూడా అట్టి ఉన్నతిని పొందవలెనని ఆశిద్దాము. ఇంతవరకు మనకు తెలిసిన దాన్నిబట్టి ఆలోచిస్తే వివాహసంస్కారము అహింసా సౌధానికి మూలస్తంభమనే విషయంలో ఏలాంటి సందేహమూ లేదు.

## శిశుపోషణ

"దండించకపోతే పిల్లలు చెడిపోతారు." (Spare the rod, spoil the child) అను విశ్వాసం పూర్వమున్నట్లు తెలుస్తున్నది. నేటికి కూడా ఇట్టి విశ్వాసాన్ని విడువలేనివారు కొందరున్నారు. సంఘం పెరిగేకొలదీ, నాగరికత అభివృద్ధి అయ్యేకొద్దీ మానవుల్లో ఇట్టి విశ్వాసం సన్నగిల్లింది. పిల్లల్ని కొట్టటంలో అర్థంలేదనీ, అట్లయిన పిల్లలకు-పశువులకు అంతర ముండదనే భావన మానవుల్లో ఏర్పడటంచేత పిల్లల లాలన-పాలనల్లో మానవజాతి ప్రత్యేకశ్రద్ధ చూపే స్థితికి వచ్చిందనటం యుక్తియుక్తము. నేడు పిల్లల మనఃప్రవృత్తియందుకూడా మార్పు కలగటంచేత తన్నులు తినుటకు వారెంత మాత్రమూ ఇష్టపడని స్థితికి వచ్చారు. నేటి సభ్యత కూడా పిల్లలవిషయంలో దయాళుత్వమూ, మంచిగా వ్యవహరించటమూ కావలెనని చెప్పుతున్నది. ఎన్నటికైనా ఈ పద్ధతి అమల్లోకి రాకతప్పదు.

## మతము

మతము మానవజాతిని ఎన్నో పరీక్షలకు గురిచేసింది. ఈమతంపేరిట జరిగిన అన్యాయాలు పేర్కొన సాధ్యంకాదు. మతంవల్లనే ఎంతో సారస్వతం ఉదయించింది-ఎంతో సారస్వతం నశించింది కూడా! మతము పేరిట పశువధ, కలహాలు విరివిగా జరుగుతుండేవి. ఈ మతోన్మాదంచేత ఎన్నో రాజ్యాలు కూడా ధ్వంసమైనాయి. ఈ మతాచారాలు నేడు కూడా గ్రామాల్ని పీడిస్తున్నాయి. గ్రామదేవతలకొర కీనాటికి పశువధ నిరాఘాటంగా సాగుతున్నది. ఈ మతపుపిచ్చి అహింసకు గొడ్డలిపెట్టువంటి దని చెప్పకతప్పదు. నేడు నాగరికులు మతమనునది ఒక వైయక్తికవస్తువుగా పరిగణిస్తున్నారు. మతవిషయాలపై నే డెవ్వరికీ నమ్మకంలేదు. పూర్వంలాగా మతమాఢ్యంతో ఏవిధమైన అవకతవకవ్యవహారాలూ చేయలేని స్థితికి మానవజాతి వచ్చింది.

## వ్యాపారము

మానవునిలో పశుత్వం నశించనప్పుడు లూటీ చేయటను, దొంగతనము చేయటముకూడా వ్యాపారమేనని భావించేవాడు. ఈ సాంప్రదాయ మిటీవలి వరకూ వుండింది. కొంతకాలంక్రింద పాశ్చాత్య దేశాల్లో వ్యాపారసంస్థ లిదే ఉద్దేశ్యాల్తో స్థాపింపబడినాయి. ఆ సంస్థలు సముద్రంలో ప్రయాణంచేసి ఓడల్ని లూటీచేయటం, ఇతరదేశాల్ని దోచుకొనటం వ్యాపారంగా పెట్టుకొని వుండేవి. అలాంటి సంస్థలకు ఆఅ దేశాల ప్రభుత్వాలుకూడా కావలసిన ప్రత్యేకాధికారాలు ప్రసాదించేవట! మహారాణి ఎలిజబెత్ హయామున ఇంగ్లండులో స్పెయిన్ దేశపు ఓడల్ని లూటీచేయటము, అమెరికానుండి దొంగతనముచేసి వస్తువులను తెచ్చుకోవడము వ్యాపారముగానే భావింపబడుతూండేది. ఆఫ్రికానుండి మనుష్యుల్ని జబర్దస్తీగా తీసికొనివచ్చి అమెరికా వీధుల్లో పెట్టి అమ్మించటంకూడా వ్యాపారంగానే పరిగణిస్తుండేవారు. నే డివన్నీ తప్పుడుపనులుగా తెలిసికొనటంచేత వ్యాపారంలో ఇటువంటి ఘాతుకచర్యలకు స్థానం లేకుండాపోయింది. మొదట వ్యాపారములో హింసా — మోసము అధికాధికముగా నుండి రోజురోజుకూ క్షీణిస్తూ వచ్చింది. నేటి సభ్యప్రపంచములో వ్యాపారమునకు, వ్యవసాయమునకు న్యాయసమ్మతమైన పరిస్థితి ఏర్పడిందనే చెప్పవచ్చును.

నేడు ప్రపంచములో పరుగులు వారుతున్న వైజ్ఞానికవ్యవస్థ అహింస నూతగా గొనునాడే మానవకళ్యాణానికి దోహదం కాగలదు. మన నిత్యజీవితంలో అభివృద్ధినిరోధకశక్తుల నధిగమించి అహింస ఏవిధముగా ఔత్కృష్ట్యమును సంపాదించుకొన్నదో కనుగొన్నాము. మానవజాతి ఇంకొక మెట్టు పైకెక్కవలెనన్నప్పటికీ, సంపూర్ణాభివృద్ధి పొందవలెనన్నప్పటికీ అహింసయే శరణ్యము. దానికొరకే అహింస కింతటి పవిత్రత, మన్నన కల్గింది.*

---

* ఆచార్య కృపాలనీ వ్రాసిన వ్యాసాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ వ్యాసం వ్రాయబడింది.

# ప్రాచీన ఖగోళము

## ౩. చంద్రుడు

## శ్రీ వేలూరి శివరామశాస్త్రి

ప్రాచీన వాఙ్మయమునందు చంద్రసూర్యులను గురించిన అభిప్రాయములు నా ప్రాచీన భూగోళమునందును, ప్రాచీనఖగోళమునందును స్వల్పముగా నచటనచట తెలిపియుంటిని.1 ఖగోళవైజ్ఞానికులు చంద్రునిగూర్చి తెలిపిన విషయము లిచట చూతము.

చంద్రుడు జలమయుడు. చంద్రునిపై సూర్యుడు కలడు. అతని కిరణములు చంద్రునిపై బడుచుండును. చంద్రుడు గుండ్రముగా నున్నాడు. కావున చంద్రగోళపు పైభాగముననే సూర్యకిరణములు సోకును. అటులగుటవలననే చంద్రునిలో సాబాలు మనకు తెల్లగా కానిపించును. ఆకాశమున ఎండలో నొక కుండను జేనికేని త్రేలదీసి చూచునది. క్రిందిభాగమున ఎండ తగులదుకదా. దానిక్రింద నున్న మనకు ఆ కుండక్రిందిభాగము నిజచ్ఛాయచే నల్లగా కానిపించును. అటువలెనే చంద్రుని క్రిందిభాగముగూడ తన ఛాయనుబట్టి మనకు నల్లగా కనబడును.

చంద్రునిలో సగబాలే మనకు కనిపించును. ఇటులు చెప్పగలుగుటకు హేతువు చంద్రకళంకము. అది మనకు చంద్రునిలో సాబాలే కనిపించు నని చెప్పక చెప్పును. అటులగుచో కుండక్రింది నలుపువలె కలంకనీలిమమాత్రమే కాక తెల్లగాగూడ నేల కనబడును? అద్దములో సూర్యకిరణములు పడి నను కొందము. అవి దాన మూర్ఛితములై యింటిలోని చీకటులను పారద్రోలునుగదా! అటులే జలమయమగు చంద్రబింబముమీద సూర్యకిరణములు మూర్ఛితములై రేయిచీకటి తుటుములను పారద్రోలగలవు.2

పాశ్చాత్యదేశములందలి ప్రాచీనులును చంద్రుని జలమయునిగను, స్థలమయునిగను భావించిరి. చంద్రబింబము సమముగా లేదనియు, అనగా ఎత్తుపల్లములతో కూడియున్నదనియు, అందలి ప్రకాశాంకము స్థలభాగమై యుండుననియు, నీలాంశము జలభాగమై యుండుననియు తాను కనిపట్టిన టెలెస్కోపులో చూచి గాలీలియో చెప్పెను. అతనికి ముందున్న కెప్లరు 'నీలాంశము సముద్రమైయుండు' నని అనుకొనెను. నాటినుండియు వచ్చుచున్న యీ విశ్వాసమే నేటి ఖగోళవిజ్ఞానమునందును అనుస్యూతమగుచున్నది.3

### కల

చంద్రు డొకనాటికంటె మరియొకనాడు ప్రకాశము వడయును. ప్రాచీనవైజ్ఞానికులు బింబవ్యాసమును కలలచే లెక్కించిరి. కల యనగా నొక యంశలో పదునారవ పాలు. ఈ పరిమాణముచే చంద్రబింబపు కలలు సుమారు ముప్పదిరెండు. దినమునకు రెండేసి కలలచొప్పున చంద్రుడు వృద్ధిపొందును. దీనిని బట్టి అమావాస్యమొదలుకొని పౌర్ణమాసివరకును గల

(1) విద్యుల్లోకము, రెండు, మూడు వ్యాసములు—భారతి ౨౮ సం. ౬, ౭ సంచికలు.

(2) వరాహమిహిరుడు.

(3) మన పురాణములలో నొకచో సుదర్శనద్వీపచ్ఛాయ చంద్రకళంకము.

పదునారు తిథులును పదునారు కళలుగా గ్రహింపబడె నని మనము తెలిసికొనగలము. ఈరీతిగా కలాతిథిశబ్దములు రెండును ఏకార్థకము లాయెను. దీనినిబట్టి చంద్రునిలో పదునారవపాలుగూడ కలగా వ్యవహరింపబడియుండును.[4] సిద్ధాంతములలో ఈ యభిప్రాయమున్నటులు కానము. సిద్ధాంతముల కాలమునందు పండ్రెండు వేళ్ళు ఎడమీసముగాపట్టి బింబవ్యాసమును చూచెడివారు. ఏసమయమున ఎన్ని వేళ్లు తెల్లగా కనబడునో ఆవేళ్ళనుబట్టి లెక్కకట్టెడివారు.[5] చంద్రుడితరగ్రహములకంటె జంఘాలుడు. ఒక్కరాత్రిలోనే ఆతడెన్నియో నక్షత్రములను దాటిపోవుట మన కంటికగపడును. ప్రాచీను లీచంద్రగతిని సూక్ష్మతిసూక్ష్మముగా పరిశీలించిరి. చంద్రుడు ౨౭.౩౨౧౬౭ సావన దినములలో పండ్రెండు రాసులను చుట్టివచ్చు నని సూర్యసిద్ధాంతము చెప్పెను. నేటి ఖగోళవిజ్ఞానమున చంద్రుని భగణభోగకాలము ౨౭.౩౨౧౬౬ దినములు.

## దవ్వు

చంద్రునకును, భూమికిని ఎంత దవ్వు? ఇది పిచ్చిప్రశ్నగా తోచవచ్చును. ఏలయనిన, చంద్రుని కడకు నడచిపోవుటకా వీలులేదు. తాడుపెట్టి కొలుచుటకా అంతకన్న వీలులేదు. కాన ఇది ఎవ రెటులు చెప్పగలరు అని తోచును. కాని మానవుని బుద్ధి దీనికొక యుపాయమును వేలయేండ్లక్రిందటనే కనుగొనెను.

నీవు నివసించిన భూమికొలత తెలిసికొనవలయును. అది గోళముకాన దాని రెండుప్రాంతములనుండి రెండుసూత్రములను నీవు కనుగొనదలచిన వస్తువుకడకు, అనగా చంద్రునికడకు తీసికొనిపోవలెను. అపుడు ఈ రెండు సూత్రములకును మధ్యముగా, నొక కోణ మేర్పడును. అపుడీ భూచంద్రులకు గల ఎడము చెప్పవచ్చును.

'ఓయీ! వెర్రి కుదిరినదికాని రోకలి తలకు చుట్టుము అనినటులులేదా? చంద్రునికడకు త్రాడెవడు పట్టును?' అని అందువు. కాని ఒక డొక సూత్రము పట్టినటులే భావించి యీదిగువ భేద్యకము చూచునది—




భూ అనునది భూగర్భము. ద్ర భూపృష్ఠమునను్న ద్రష్ట. చ అనగా చంద్రుడు. అడ్డగీటును, నిటవాలుగా నున్న గీటును రెండు సూత్రములు.

భూ-కోణము సమకోణ మగునేని చ-కోణము ఎన్ని అంశములు, ఎన్ని కలలు ఉండునో వానికి పరమలంబన మని పేరు.

'భూ' కడనుండి 'ద్ర' వరకును భూవ్యాసములో సగము. దాని లెక్కయు, అనగా యోజనములుగాని, క్రోసులుగాని అలవాని లెక్కయు పరమలంబనపు యోజనముల లెక్కగాని, క్రోసులలెక్కగాని తెలియుచో 'భూ-చ'ల యెడము, అనగా భూమిచంద్రులకు గల ఎడము తెలిసిపోవును.

## లంబనము[6]

భాస్కరాచార్యుడు లంబనోత్పత్తి నిటులు

(4) 'కలాతు షోడశో భాగః' అని అమరుడు.

(5) కామశాస్త్రములం దీ కలలతో స్త్రీలకు సంబంధము చూపదురు. కలాశాస్త్ర మను పేరే దీనికి గురుతు. కాని నేటి వైజ్ఞానికులలో కొంద రీమాటను శంకించిరి.

(6) 'మధ్యలగ్న సమే భానౌ హరిజస్య న సంభవః' అని సూర్యసిద్ధాంతమున లంబనార్థమున హరిజశబ్దము చూపదురు. వరాహమిహిరుడు పంచసిద్ధాంతికలో క్షితిజమునకు మారుగా హరిజశబ్దమును వాడెను. హరిజ, Horizon శబ్దముల చరిత్రమునుగూర్చి తరచవలసియున్నది.

చెప్పెను. భూగోళమును, చంద్రకక్షను, సూర్యకక్షను గీచునది. (చూ : దిగువనున్న ఛేద్యకము)

ఇచట భూ అనగా భూగర్భము, లేక భూగోళ కేంద్రము. ద్ర భూపృష్ఠముననున్న ద్రష్ట. భూక్ష తిర్యగ్రేఖ. భూఖ ఊర్ధ్వరేఖ. తిర్యగ్రేఖయు, క్షితిజ రేఖయు క్ష'క్ష వద్దను, క్షబిందు వద్దను రవికక్షతోడను, చంద్రకక్షతోడను గలిసిపోయెను. ఖ అనునదియు, ఖ' అనునదియు చంద్రసూర్యకక్షల ఊర్ధ్వబిందువు. అది ఆకాశమధ్యమున. భూమినడుమనుండి సూర్యునివరకును గల భూరేఖ గర్భసూత్రము. భూపృష్ఠముమీద నున్న ద్రష్టనుండి సూర్యునివరకును గల రేఖ దృక్సూత్రము.

ఏకమయిపోవును. దానచేసి ఆకాశమధ్యమున ఏగ్రహమునకును లంబన మనుమాట ఉండదు. (౮-వ ఛేద్యకము)

ఇచట దృక్సూత్రమునందే గర్భసూత్రముకూడ ఏకీభూత మాయెనుగాన దేనికిని లంబనము ఉండదు.

ద్రష్ట భూవ్యాసమున అర్ధభాగముపైన ఉండుట బట్టి దృఙ్మండలమున గ్రహము, తానున్న చోటునుండి నతమయినటులు కనబడును. దర్శచివర సూర్యుని అవనతి 'ఖ' ఎన్ని అంశములు, ఎన్ని కలలో అప్పటియమునసే చంద్రునియు అంశములును, కలలును అన్నియే యగును. ఇటులయినను భూపృష్ఠమున నున్న ద్రష్టకు చంద్రుని నతాంశములు సరిగా అన్నిగా కానరావు. ఉభయా•

అమావాస్యాంతమున చంద్రుడును, సూర్యుడును 'భూచసూ' రేఖమీద, అనగా గర్భసూత్రముమీద కనిపింతురు. అపుడు సూర్యచంద్రుల రాశ్యంశములు సమానములుగా నుండును.

భూపృష్ఠమున నుండి చూచువారికి దృక్సూత్రమునుండి చంద్రుడు లంబితు డయినటులు, అనగా క్రింద నున్నటులు అగపట్టును. అనగా దృక్సూత్రమునకు సూటిగా కనబడడు. క్రిందుగా నతు డయినటులు అగపడును. (చూ : ౩-వ ఛేద్యకము)

ఇచట ద్రష్ట చూపునకు సూటిగా సూర్యుడు కనబడును. చంద్రుడు దృక్సూత్రముక్రింద, గర్భసూత్రము మీద నున్నటులు కానబడును.

సూర్యుడుగాని, చంద్రుడుగాని ఆకాశమధ్యమున నున్నపుడు గర్భసూత్రదృక్సూత్రములు రెండును

తరము, అనగా చ చ' చాపాంశము సూర్యునినుండి లంబనము. ఈరీతిగా సూర్యునినుండి కనబడు చంద్రలంబనము సూర్యచంద్రుల దైనికగతిలో పదునయిదవ వంతు. అనగా ౮౭|౮౬ క.

సూర్యునికన్న నక్షత్రములు దవ్వు. నక్షత్రములనుబట్టి సూర్యునకును లంబనము ఉండును. చంద్రుని మాట వేర చెప్పనక్కరలేదు. అతనికిని ఉండును. సిద్ధాంతముల మతమున ఈ యుభయుల లంబనమునకును గల అంతరము అన్ని కలలు. సూర్యచంద్రు లేకాంతరమునసే ఉన్న యెడల వారికి లంబనము ఉండదు. ఈ విషయములను చూడగా సిద్ధాంతములందలి లంబనోత్పత్తికిని, ఆధునికఖగోళజ్ఞులు చెప్పు లంబనోత్పత్తికిని

లేదా కనబడదు. ఈ రెండు మతములును అచ్చముగా నొకటి.




ప్రాచీనులు ప్రయోగనిపుణులు. వారు కంట వత్తిడుకొని చూచిచూచి చాల విషయములు సూక్ష్మముగా నిర్ధారించిరి. గ్రహణగణనాదికమునకు లంబన గణన మత్యావశ్యకము. వా రందులకు కన్నుపొడుచుకొని మరి లెక్కకట్టిరని చెప్పితీరవలెను. చూపువలన వచ్చు లెక్కకును, అకుమీద వ్రాయగా వచ్చు లెక్కకును ఎన్ని కారణములచే తేడావచ్చునో వాని నన్నిటిని వారు గుర్తించి వానికి తగిన సమాధానములను




చెప్పిరి. వా రుపయోగించిన యంత్రమా, స్థూలము—మాంసమయమగు నేత్రము. స్థలవిశేషమున దానిచే కనుగొని పడసిన ఫలమా, సత్యసూక్ష్మము. ఇది పరమాశ్చర్యము. నేడు కేవలసూక్ష్మయంత్రముల సాయముచేతనే కనుగొనదగిన వని మన మనుకొనదగిన పలువిషయములకు వారు ఎన్నియేం డ్లెంత చూచి తమ యొరుకను మన కొసగిపోయిరో కదా!

చంద్రుడు భూమికి దాపున గలడు. దానచేసి కొన్ని యుపాయములచే చంద్రుని పరమలంబనమును కనుగొనవచ్చును. ప్రాచీను లేయుపాయ మవలంబించిరో తెలియగలుగ టరిది. కాని కొన్ని కారణములచే నీ క్రింది యుపాయ మవలంబించిరేమో అని ఊహింప గలము.

ఒకే మధ్యరేఖమీద దూరదూరముగా నున్న రెండు నగరములనుండి ఒకేసమయమున చంద్రుని నతాంశమును, ఆ రెండు నగరములయు అక్షాంశమును తెలిసికొనగలిగినయెడల చంద్రుని లంబనమును గణిత పఱచవచ్చును. వరాహమిహిరాదుల వ్రాతలలో కొన్ని పట్ల నిట్టివి కలవు. వా రీయుపాయముచేగాని, మరియొక యుపాయముచేగాని తేల్చిన పరమలంబనము ఇంచుమించు ౫౩ కలలు. ఇటులు తేల్చినను చంద్రుని మార్గము వృత్తాకారము కాదు. మరి వృత్తాభాసము. దానచేసి చంద్రుని లంబన మొకొకప్డు హెచ్చుగను, తక్కువయు నగును. ఆధునిక ఖగోళజ్ఞుల మతమున చంద్రుని మధ్యమలంబనము ౫౭ కలల 3 వికలలు.

సిద్ధాంతములు చంద్రుని లంబనమును తక్కువ లెక్కకట్టుటకు కారణము లనేకము లుండవచ్చును. వానిలో ఆలోకవివర్తన మనుమాట ఆనాటికి తెలియక పోవుట యొకటి. యూరపుదేశమునందును పదునారవ శతాబ్దిపరకును ఆలోకవివర్తన మజ్ఞాతము.

సూర్యసిద్ధాంతముచొప్పున చంద్రుని పరమ లంబనము ౫౩′ ౨౦″ వికల అని యెరిగియుంటిమి. రెండవ ఛేద్యకమునుబట్టి యీదిగువ అనుపాతము పడయ నగును—

౫౩′—౨౦″జ్య : త్రిజ్య : : భూవ్యాసములో సగము : చంద్రునకును, భూమికిని గల దవ్వు.

౫౩′—౨౦″=౫౦క్షి త్రిజ్య=౩౪౩౮. కావున చంద్రుని దవ్వు ౬౪—౪౭. భూవ్యాసార్ధములతో సమానము. నేటి ఖగోళజ్ఞుల మతముచొప్పున ఇది సుమారు ౬౦. భూవ్యాసార్ధములతో సమానము.

భూవ్యాసార్ధము ౮౦౦ యోజనము లను మతము చొప్పున చంద్రుని దవ్వు:కక్షాయోజనకర్ణము ౫౧౫౭౦ యోజనములు. చంద్రుని యీ యోజనకర్ణమునుబట్టి చంద్రకక్ష ౩౨౪౦౦౦ యోజనములు. ఆకక్ష ౩౬౦ అంశములచే విభక్తము. కావున ౩౬౦ × ౬౦= ౨౧౬౦౦ కలలు. కావున చంద్రబింబపు కల ఒక్కొంటికి ౧౫ యోజనములు. ౨౧౬౦౦ × ౧౫=౩౨౪౦౦౦ యోజనములు.

సిద్ధాంతమతమున చంద్రుని ప్రత్యక్షబింబము ౩౨ కలలు. కావున వ్యాసము ౩౨ × ౧౫=౪౮౦. భూవ్యాసము ౧౫౦౦ యోజనములు. ఈ వ్యాసముతో చంద్రవ్యాసానుపాతము ౦. ౩.

ఆధునికఖగోళజ్ఞుల మతముచొప్పున చంద్రవ్యాసానుపాతము ౦.౨౭౩. కావున భూపరిమాణమును బట్టి చంద్రుని పరిమాణము చాల తక్కువయని ప్రాచీన వైజ్ఞానికులు కనుగొనగలిగిరి.



# కీ. శే. చిదిరెమఠం వీరభద్రశర్మగారు

**శ్రీ బండారు తమ్మయ్య**

ఆంధ్రవిద్వల్లోకమునకు చిరపరిచితులయి, సికింద్రాబాదునందు వీరశైవగురుకులమును, శివధర్మగ్రంథమాలికను నెలకొలిపి, 'విభూతి' యను సారస్వతమాసపత్రికను ౧౯౩౯ సం. నుండి రమారమి నాలుగు సంవత్సరములు నిర్వహించి, తారణవత్సరవిజయదశమి (౨౧-౯-౪౪) నాడు కాశీక్షేత్రమందలి శ్రీ జగద్గురు విశ్వారాధ్యపీఠమునకు పట్టాభిషిక్తులయిన శ్రీ పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు నల్వదిరెండేండ్ల ప్రాయమున, సర్వజిన్నామ సంవత్సర పుష్యశుద్ధ పూర్ణిమాభానువాసరమున (౨౫-౧-౪౮) రాత్రి గం. ౭-౩౦ లకు కాశీక్షేత్రమున దమ జంగమవాటికా మఠమునందు లింగైక్యమయిరి.

ఈ మహాపండితుని, జగద్గురుని యకాలమృతి వలన భాషాప్రపంచమునకు తీఱని నష్టము వాటిల్లినది. వీరి జీవితచరిత్రమును సంగ్రహముగనైనను ఆంధ్రసోదరులు తెలియుట యావశ్యకము.

శ్రీ వీరభద్రశర్మగారు నిజాము మండలమున నల్లగొండజిల్లాలో నల్లగొండకు సమీపముననున్న చర్లపల్లె యను గ్రామమున, వీరశైవమతమునందు గురువర్గమునకు చెందిన మాహేశ్వరశాఖలో ౧౯౦౬ సం. ప్రాంతమున శ్యామలాంబా నాగభూషణ నామాంకితులగు దంపతులకుదయించిరి. తల్లిదండ్రులకు వీ రేక పుత్త్రులు. వీరి కొక కనిష్ఠసోదరిమాత్ర ముండెను. నల్లగొండజిల్లాలోని డెబ్బది గ్రామములవఱకు చిదిరెమఠము కుటుంబమువారే మఠస్థులుగా నుండిరి. ఆ కుటుంబమునకు నల్లగొండ, చర్లపల్లె, మునుకుంట్ల యను గ్రామములలో గృహములు, భూములు మున్నగు స్వాస్థ్యము లుండెడివి. పది నాలుగేండ్ల వయస్సు వచ్చు లోపలనే తలిదండ్రులు చనిపోవుటచేతను, జ్ఞాతులు, బంధువులు తమ యాస్తుల నపహరించుటచేతను, మఱి కొంతకాలమునకు వివాహితయైన సోదరికూడ మరణించుటచేతను ఆదరించువారు లేక చిన్నతనమున బహుకష్టములకు లోనయి శర్మగారు జన్మస్థలమును విడిచి హైదరాబాదు, నీరడగుంథ, నారాయణపేట మున్నగు తావుల కేగి వీరశైవుల యిండ్లలో భిక్షాటన మొనర్చుచు,



సంస్కృతవిద్యాభ్యాసము గావించుచుండిరి. త్వరలోనే వీరు కావ్యనాటకాలంకార సాహిత్యము సంపాదించిరి. వీరి తెలివితేటలకు, నైపుణ్యమునకు సంతసించి హైదరాబాదులో హైకోర్టువకీలుగా నుండిన శ్రీ దేశముఖ్ బాపూరావు అను భక్తవరులును, శ్రీ మహాంతమఠము చెన్నబసవయ్య అను మాహేశ్వరులును వీరి నాదరించుచుండిరి. పదునెని

చేండ్ల ప్రాయమునాటికే సంస్కృతముతోపాటు ఆంధ్ర, కర్ణాట భాషలయందుగూడ దగు పాండిత్యమును శ్రీ శర్మగారు గడింపఁగల్గిరి.

ఇంతలో వీరి భావివిద్యోన్నతికి బీజముగా నిజాము దేశమున నొక విచిత్రసంఘటన పేర్పడెను. ౧౯౨౨ సంవత్సరప్రాంతమున శ్రీ శివకోటి వీరభద్రయ్య అను మాహేశ్వరులు - పరమశివభక్తిసంపన్నులు పెక్కు దివ్యక్షేత్రములు సేవించి యాయా స్థలములందు గణార్చనలు గావించుచు, పరళీక్షేత్రమును చేరి ద్వాదశజ్యోతిర్లింగములలో నొక్కటియగు నచ్చటి వైద్యనాథేశ్వరలింగమున కభిషేక మొనరింపఁ బోవ నచ్చటి బ్రాహ్మణులు ప్రతిఘటించిరట. అందుపై వీరశైవులకు వేదాధికారము గలదా, లేదా యను విషయమున వివాదములు గలిగి యవి వ్యాజ్యస్థానములకుగూడ నెక్కెను. ఈ వివాదపరిష్కారవిషయమున నిజాము హైకోర్టువారు ౧౯౨౩-౨౪ సంవత్సరములలో నొక పండితసభ నేర్పఱచిరి. అదివఱకు గాశీక్షేత్రమున విద్యనభ్యసించి 'వేదతీర్థ' పట్టము నంది, ధార్వాడజిల్లాలో చౌడదానపురమఠాధ్యక్షులుగా నుండిన శ్రీ విరూపాక్షఒడయరు మహాస్వాములవారు పండితసభలో వీరశైవుల పక్షమున బ్రధానపండితులుగా నుండి వాదించిరి. అప్పుడు ప్రమాణగ్రంథపరిశీలనాదికములలో వారికి శ్రీ వీరభద్రశర్మగారుకూడ దోడ్పడుచుండిరి. తుదకు హైకోర్టునందలి యభియోగము వీరశైవుల పక్షమున దీర్మానమయ్యెను. అందుపయి శ్రీ బాపూరావు (హైకోర్టువకీలు) గారు వీరభద్రశర్మగారు పండితసభాసందర్భమున బ్రకటించిన చాకచక్యమునకు సంతసించి, శ్రుతిస్మృతిశాస్త్రాదికములందు సమధిక ప్రావీణ్యము సంపాదించుటకయి వారిని గాశీక్షేత్రమున జేరి విద్యాభ్యాస మొనర్పుడని హెచ్చరించిరి.

వారి యాదేశానుసారముగ శ్రీ శర్మగారు ౧౯౨౫-౨౬ సంవత్సర ప్రాంతమున వారాణసి చేరి ౧౯౩౦ సంవత్సరమున 'వేదతీర్థ' పరీక్షయందు ఉత్తీర్ణులయిరి. శ్రీ బాపూరావుగారు వీరి వ్యయములకయి నెలకు రూ. ౧౧౬ లు పంపుచుండిరి. కాని "శ్రేయాంసి బహువిఘ్నాని" యన్నట్లు వీరు కాశి చేరిన యయిదాఱువత్సరములలోనే శ్రీ బాపూరావుగారు వ్యాధిగ్రస్తులగుటయు, తరువాత మరణించుటయు సంభవించెను. అయినను బట్టు విడువక, వీరశైవసోదరుల యాదరాభిమానములతో నెట్లో వీరు ౧౯౩౬ సంవత్సరము వఱకు గాశిలో విద్యాసముపార్జన మొనర్చి స్మృతితీర్థ, కావ్యతీర్థ, ధర్మాచార్య, సాహిత్యవిశారద మున్నగు పట్టపరీక్షలందుఁగూడ కృతార్థులయిరి. వీరి విద్యార్థివేశము బహుముఖమయినది. అభ్యసించుచున్న వైదికవిద్యలందేకాక యాంధ్రగీర్వాణ కర్ణాటసారస్వత విమర్శనములందు, 'బ్రాహ్మీలిపి' జ్ఞానమునందు, శాసనపరిశోధనములందు గూడ వీరు పాల్గొని కాశిలో విద్యార్థిగా నున్నప్పుడును సారస్వతమతవిషయకవ్యాసము లనేకములు పత్రికలకు వ్రాయుచుండిరి. ౧౯౩౪ సం. వేసవిలో వీరు హిమాలయయాత్రను అయిదువందల మైళ్లు కాలినడకను సాగించి యాయా విశేషములను వివరించుచు నొక గ్రంథమునుగూడ వ్రాసిరి. అది యింతవఱకు నముద్రితమే. ఆంధ్ర, గీర్వాణ, కర్ణాటకములందేకాక మరాఠీ, హిందీ, ఉర్దూ భాషలందును విశేషపాండిత్యము నార్జించి యందు గవిత్వము చెప్పు శక్తిసహితము గలిగియుండిరి. హిమాలయయాత్రలో ఉత్తరకాశీక్షేత్రమున నదివఱకు శాసనపరిశోధకులకు దురవగాహముగా నున్న జయస్తంభలేఖను వీరు సరిగా నిర్ధరించి దానిని ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయందును, భారతియందును ౧౯౩౫ సంవత్సరములో బ్రకటించిరి. ఇట్లే బ్రాహ్మీలిపియందలి యనేకదుర్గమశాసనములను వీరు పఠించి ప్రకటింపగలిగిరి. ౧౯౩౬ సం. లో గాశి విడిచి స్వదేశమునకు దిరిగివచ్చునప్పు డచ్చటి పండితమండలి వీరిని సన్మానించుటకయి సభచేసి 'విద్యారత్న', 'విద్యానిధి' యను బిరుదములొసఁగి సత్కరించిరి.

దేశమునకు రాగానే వీరు కొంతకాలము యాదగిరియందలి శంకరసంస్కృతకళాశాల కధ్యక్షులుగా బని చేసిరి. అటుతరువాత శ్రీ మటికె నాగయ్య అను భక్తవరులు దానపూర్వకముగ నొసగిన ధర్మనిలయమున వీరు వీరశైవగురుకులమును, శైవభారతీభవనమును సికింద్రాబాదులో నెలకొల్పి వీరశైవ

విద్యార్థుల మచ్చికముగ విద్యగఱపుచుండిరి. అంతే శివధర్మగ్రంథమాలికను గూడ స్థాపించి వీరశైవమాహాత్మ్యము, రేణుకవిజయము, శ్రీకరభాష్యము (చతుస్సూత్రి), శివపంచస్తవి మున్నగు గ్రంథములు పదునొకండు ప్రకటించిరి. బహుధాన్య సంవత్సర మహాశివరాత్రి దినమున 'విభూతి' అను పేరితో ఒక సారస్వత మాసపత్రికను ప్రారంభించి రమారమి నాలుగు సంవత్సరములు నిర్వహించి సారస్వత సేవయు, శైవమతసేవయు గావించిరి. తమ భాషా సేవకు, మతసేవకు ప్రతిబంధక మగునని యెంచి కాశీ నుండి వచ్చిన యాజ్ఞాంతరము గూడ గృహస్థాశ్రమము స్వీకరింపక బ్రహ్మచర్యమునే కొనసాగించిరి.

వీరశైవ పంచాచార్య పీఠములలో రంభాపురి (శృంగేరిసమీపమున నున్న బాళెహొన్నూరు) నుండలి రేణుకాచార్యపీఠస్వాములవారును, శ్రీశైలభీమావృత్తి మఠ స్వాములవారును దాము వృద్ధులగుటచే నుత్తరాధికారమును శ్రీ వీరభద్రశర్మగారి కొసగెద మనియు, స్వీకరింపుమనియు హెచ్చరించిరి. కాని యీ జగద్గురు పీఠాధిపత్యములు తా మభ్యసించిన వేదసేవకు, భాషా సేవకు, మతసేవకు బంధకములగునని శ్రీ శర్మగారు వానిని నిరాకరించిరి. కాని విధివిధానములు దుర్నివార్యములు. కాశీక్షేత్రమందలి జగద్గురు విశ్వారాధ్యపీఠము శర్మగారు రచ్చట విద్యాభ్యాస మొనర్చుచుండిన కాలమునందే యప్పటి స్వాములవా రొనర్చిన కొన్ని వ్యవహారములవలన విశేషఋణగ్రస్తమయి, దాని స్వాస్థ్యములన్నియు వ్యాజ్యస్థానమువా రేర్పఱచిన రిసీవరు పరిపాలనమం దుండెను. అప్పుడు పీఠాధీశ్వరులుగా నుండిన శ్రీజగద్గురు రాజేంద్రమహాస్వాముల వారు కొలదికాలములో శివైక్యులగుచు శ్రీ పంచాక్షరమహాస్వాములవారి పేర నుత్తరాధికారమును వ్రాసి యుండిరి. శ్రీ పంచాక్షరస్వాములవారు కొన్నిసంవత్సరము లాపీఠ మధిష్ఠించి, రిసీవరుపాలనమున మఠము యొక్క స్థితిగతులు చక్కబడి యెప్పటికి ఋణవిముక్తి కలుగని దుస్థితి కెంతయు సంతాపించి, లౌకికవైదిక ప్రజ్ఞాధురంధరులగు శ్రీ వీరభద్రశర్మగారికి ఆ పీఠము యొక్క యుత్తరాధికారమును సంక్రమింపజేసినచో దను కాశీవిశ్వారాధ్యపీఠసింహాసనమునకు దరణోపాయ మేర్పడునని యూహించి, ౧౯౪౪ సం. లో దాము కొలదిదినములలో శివైక్య మగుటకు ముందుగా శ్రీ శర్మగారికి దెలియకుండ, వారి యనుమతిని గయికొనకయే యుత్తరాధికారమును రిజిష్టరు విల్లు పూర్వకముగ వారిపయి నియోగించి పరమపదించిరి. ఈ వార్త శ్రీపంచాక్షరమహాస్వాములవారి నిర్యాణానంతరము తంతివార్తలమున శ్రీ శర్మగారికి దెలిసి పిడుగు మీద బడినట్లాయెను. ఏమయినను స్వదేశమును విడిచి యీ కాశీజగద్గురుత్వము స్వీకరింపవలదని శర్మగారిని గోరుచు నిజామురాష్ట్రమునందలి యాంధ్రులు, భాషాభిమానులు నాందోళనము గావించిరి. శర్మగారికి విషమసంధి సంఘటిల్లెను. వారికిగూడ దత్పదవిని గ్రహింప నిష్టములేకుండెను.

కాని కాశీసింహాసనమునకు విషమపరిస్థితు లేర్పడునని తక్కిన పంచాచార్య సింహాసనములవారు నిర్బంధించుటచే శ్రీ శర్మగారు విధిలేక యీ జగద్గురుత్వమును స్వీకరించి తారణసంవత్సర విజయదశమీదినమున బట్టాభిషిక్తులైరి. అప్పు డామహోత్సవమునకు ఆంధ్ర కర్ణాటక మహారాష్ట్రదేశములనుండి వేనవేల భక్తులు, వీరశైవులు చనుదెంచి దానిని జయప్రదముగ నిర్వహించిరి. శ్రీ వారి నిరంతర పరిశ్రమముకలన, వారి యందలి భక్తిగౌరవములచే వీరశైవమహాజనులు గావలసినధనమంతయు నొక్కసంవత్సరములో సేకరించి ౧౯౪౫ సంవత్సరము డిసెంబరు నెలలో మఠమునకు ఋణవిముక్తి గావించిరి. భక్తుల విరాళముల మూలముననే శ్రీ జగద్గురువులవారు శైవభారతీభవనమునకు గాను జంగమవాటికా మఠావరణములో జ్ఞానమందిర మను పేరితో నొక దివ్యనికేతనమును నిర్మించి పార్థివ సంవత్సర మహాశివరాత్రినాడు (౨-౩-౪౬) ప్రవేశోత్సవ మొనర్చిరి. విభూతిపత్రిక నుద్ధరించి జ్ఞానమందిరమునుండి 'జ్ఞానశ్రీ' యను పేరితో వివిధభాషలలో వెలువరింపజేసి యందుకు వలయు సహాయముల గావించుచుండిరి.

వీరశైవపంచాచార్య సింహాసనములలో దేనిని నింతవఱకు నాంధ్రవీరశైవు లెవరు నధిష్ఠించినట్లు

కావరాదు. శ్రీ శర్మగారే గ్రంథములని చెప్పవచ్చును. ఈ మూడు సంవత్సరములనుండియు గాశీవిశ్వారాధ్య పీఠముననిముక్తి, జ్ఞానమందిరనిర్మాణమునకు వీరు గావించిన కృషి నిరుపమానమయి శాశ్వతయశంబును వారికి ఘటించినది. ఆంధ్ర వీరశైవులయొక్కయు, ఆంధ్రభాషయొక్కయు నభివృద్ధికయి విశేషముగ బరిశ్రమించుటకును, దమ జగద్గురుపీఠమునభారము తగ్గిన తరువాత దాని యాదాయములనుండి విశేషవిరాళము లొసగుటకును శ్రీవారు తలచుచుండిరి. కాని కాశీ పీఠసముద్ధరణమునకయి యీ మూడేండ్లనుండి వారు గావించిన యత్యధికపరిశ్రమకారణముగ నేడెనిమిది నెలలనుండి యారోగ్యము చెడి తుదకు రాజయక్ష్మగా బరిణమించి యకాలమరణమునకు వారు గురియగుట ఘటిల్లినది. నే రచించిన 'పాలకురికి సోమనాథకవి' అను చరిత్రగ్రంథము ముద్రణము పూర్తియయ్యి యొదు నెనిమిది నెలలనుండి శ్రీ వీరభద్ర మహాస్వాములవారి యవతారికకొఱకే యింతకాలము ప్రకటితము కాలేదు. మతవ్యాపారముల రొత్తిడివలనను, దరువాత ననారోగ్యముకలనను నీ యవతారికారచనవిషయమున గాలవిలంబన మొనర్చి, తుదకు శ్రీవారు తమ నిర్యాణదినమున సాయంకాలము గం. ౬-౩౦ లకు నాగ్రంథమునకు ముఖపత్రాదికములు లిఖించి యవతారికను వ్రాయ జాలనందులకు జింతించుచు గొన్ని సూచనలతో నాపేర నొక లేఖను వ్రాసి "నేను శివలోకయాత్రకు సిద్ధము" అను వాక్యముతో దానిని విరమించి మఱియొక గంటలో శివైక్యమయినారు. నిర్యాణసమయము కొన్ని దినములకు ముందునుండియే శ్రీవారి కవగతమయి యున్నట్లు తెలియుచున్నది.

జీవితకాలములో నాహారవిహారములందు వీరు పెక్కు నియమముల బాటించుచుండిరి. నెలకొక దినము మౌనవ్రతము జరుపుచుండిరి. ఆరోగ్యము చెడిన యీ యెనిమిది నెలలనుండి యాహారమయిన విసర్జించిరి గాని స్నానజపతపాద్యనుష్ఠానముల నొక్కింతయు విరమింపరయిరి.

ఇట్టి దివ్యజ్ఞాని, పండితశిరోమణి, జగద్గురువు, శివాచార్యరత్నము, మహాస్వామి, విద్యానిధి యింత త్వరలో నిట్లు లస్తమించుట దేశదౌర్భాగ్య మనక తప్పదు.

శివపంచస్తవమునకు నా ప్రార్థనముపయి వీరు రచించిన 'భక్తరంజని' అను టీకాతాత్పర్యరూపకమయిన వ్యాఖ్య భక్తలోకమున వీరి కీర్తిమూర్తిని చిరస్థాయిగ వెలయింపగలదు.

శ్రీ శర్మగారితో వీరశైవ మతాకాశమునం దొక దివ్యజ్యోతి యంతర్ధానమయినది. అనంతమగు వీరి విజ్ఞానఫలితముగ భాషాప్రపంచ మెదురుచూచు మహోత్తమగ్రంథము లనేకములు ప్రకాశమొందు నవకాశము శూన్యమయ్యెను.

సచ్చిదానందమూర్తి యగు పరశివుడు వీరి యాత్మకు శాశ్వతశాంత్యానందముల బ్రసాదించుగాక!



# వినతాంజలి*

## శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

అది భారత చరిత్రలో, ఉత్తరభూముల్లో రవీంద్ర కవిచంద్రుడు, ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, కేశవచంద్రసేనుడు, పూజ్య మహాత్మా గాంధీజీ మున్నగు ప్రపంచవిఖ్యాతమూర్తుల అవతరణంచే పూతమైన గత శతాబ్దం. ఆ స్వర్ణయుగంలోనే దక్షిణభారతాన్ని అన్నివిధాలా ఉద్ధరించడానికి పైయందులోను ఉన్న అన్నిలక్షణాలతోను భగవానునిచే అనుగ్రహింపబడిన మహనీయమైన అమృతఫలం మన (కందుకూరివీరేశలింగం) పంతులుగారు. ఐతే వీరు తెలుగువారవడంచేతనే వీరికి ప్రపంచవిఖ్యాతి కలగలేదేమో!

వారి మహనీయతనుగూర్చి చెప్పుకోవడం ఒక విధంగా సులభమైనది; ఇంకోవిధంగా కష్టమైనదీను. ఎట్లంటే, తెలుగుపరగణాలోని మానవత్వమూ, జాతికి పరమప్రాణమైన తెలుగుసారస్వతమూ ఈమాత్రం సజీవ చైతన్యంతో అలరారుతున్నదంటే దానికి శ్రీ పంతులుగారి చలవే కారణం. ఇట్లా శ్రీ పంతులుగారి సేవను స్థూలంగా కొలబద్దవేసుకోవడం సులభమే కాని పంతులుగారు ఒకమహాసాగరం. ఆ సాగరంలో తరంగాలు ముట్టి చూడని సంస్కారతీరాలు లేవు. బహుముఖమైన వారి సేవావిధానాన్ని విశదంగా వివరించాలంటే 'తలమే బ్రహ్మకునైన నీయనమహాత్త్వం బెన్న' అని ఒక నమస్కారం చేసి ఊరుకోవలసినదే.

మానవుడు మానవసహజమైన శుభలక్షణాలతో కాక వక్రలక్షణాలతో ఉండడం ఈశ్వరభక్తుడైన శ్రీ పంతులుగారికి విపరీతంగాను, వింతగాను కనబడింది. చరిత్రకందిన అనాదికాలంనుండీ మానవసంఘం ఎప్పుడూ స్వార్థంతోనూ, ప్రలోభంతోనూ దూషితమయ్యే కనబడుతూఉన్నది. ఇట్టిసంఘాన్ని నిష్కళంకమైన నైతికపంథలో ఉన్నతాదర్శాలతో నడపటానికి పూనుకొన్నారు పంతులుగారు. దీనికై వారికి ఈశ్వర ప్రేరణా, ఈశ్వరప్రీతీ తప్ప వేరె యింకెవరి ప్రేరణా లేదు. ప్రతిఫలకాంక్ష అంతకంటే లేదు. మహనీయుల కర్మలక్షణమే అంత. అందుకే చెప్తాడు భర్తృహరి- 'సన్త స్స్వయమేవ పరహితరతాః' అని.

వారి కాలంలో సంఘంలో అనురాగమూ, అనుభూతీ అన్నవి ఆహుతియైపోయినవి. మానవహృదయం మౌఢ్యానికీ, శాఠ్యానికీ వశమై గ్రుడ్డిదైపోయినది. హృదయం నశించిన సంఘం క్షయరోగానికి పాలుబడినది. ఈ అనారోగ్యాన్ని మాన్పి సమాజశరీరానికి సదా ఆరోగ్యవాతావరణం కల్పించడానికి అనుదినమూ, అనుక్షణమూ పాటుపడ్డారు వారు. పెద్దపెద్ద అధికారులలో ఉండే లంచగొండితనాన్ని రూపుమాపి నైతిక వర్తనాన్ని నెలకొల్పడానికీ, నిరంకుశమైన, బాధ్యతారహితమైన ప్రజల అవినీతిపరతంత్రతను పోగొట్టి ఆ స్థానంలో ఈశ్వరభావమూ, పాపభీతీ కల ధర్మసామ్రాజ్యాన్ని స్థాపించడానికీ, అవిద్యను పోద్రోలి సద్విద్యను బోధించడానికీ, పిరికితనాన్ని వెడలదోసి సత్కార్యాచరణపట్ల ధైర్యాన్నీ, సాహసాన్నీ అవలంబింపచేయడానికీ, వేయేల- అసత్తునుండి సత్తునకు, అంధకారమునుండి ఆలోకానికీ సంఘాన్ని నడపడానికీ పంతులుగారు పడని పాట్లు లేవు. ఐనా వారు జంకలేదు. సంఘం మొత్తానికి వారు సల్పిన సేవ ఒకఎత్తూ, స్త్రీలకు వారు కావించిన మహోపకృతి ఒక ఎత్తూను. నిజంగా ఈ ఉపకారాన్ని స్మరించుకొంటే ఒడలు కృతజ్ఞతాభావంతో జలదరిస్తుంది. ఆయన స్త్రీలకు ఆప్తమిత్రుడు. ఆత్మబంధువు. నేటి స్త్రీసంఘం సంధ్యవేళ దీపంపెట్టి ఆ పుణ్యమూర్తికి వేయినమస్కారా

* ఆలిండియా రేడియో-మద్రాసు కేంద్రము వారి సౌజన్యముతో.

చేసినా ఋణం తీరదు. మగవారు విద్య నేర్చుకోవడం అంటేనే ఉలిక్కిపడే ఆ కాలంలో అనేకములైన పనులలో అంతంత తీరికా, అనారోగ్యంవలన ఓపికా లేక బాధపడుతూ ఉన్నా స్త్రీలకూ, బాలికలకూ ప్రత్యేక పాఠశాలలు తన యింట్లోనే పెట్టి తానే స్వయముగా ఉపాధ్యాయుడై స్త్రీజాతికి విజ్ఞానభిక్ష పెట్టారు. వారు నడిపే వివేకవర్ధని, హాస్యసంజీవని కాక స్త్రీలకొఱకు ప్రత్యేకించి సతీహితబోధిని అనే వేరే పత్రికను నడిపారు. ఇంతగా స్త్రీలకోసం వారు పాటుపడుతూంటే సనాతనులైన శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు దాని నధిక్షేపిస్తూ వారి పత్రికలో "స్త్రీలకు చదువెందుకు? స్త్రీలు అసలే చంచలమతులు. వారికి విద్య నేర్పితే చెడిపోతారు." అని వ్రాస్తే, దానికి శ్రీ పంతులుగారిచ్చిన సమాధానం చూడండి: "మగవారికి విద్య ఎందుకు? మగవారు అసలే తెలివిమీరినవారు. మగవారు విద్య నేర్చినందువల్ల కోర్టులలో తప్పుడుసాక్ష్యములసృష్టి ఎక్కువై పాపం హెచ్చుకాగలదు." అని. దీనివలన వారు ఎంత అకృత్రిమంగా సేవచేసేవారో, వారి కవి ఎంత సహజమో, ఎంత ప్రీతిపాత్రమో తెలుస్తుంది. అంతలో ఊరుకోక 'అమృతమ్ము ఒడమదనుక తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత' అనునట్లు స్త్రీవిషయంలో ముఖ్యసంస్కరణమైన వితంతూద్వాహసంస్కారం నిర్విఘ్నంగా సాగేవఱకూ వారు నిద్రపోలేదు. దక్షిణ భారత విద్యాసాగరులని బిరుదునార్జించిన ఈ ఘట్టంలో వారు ఎన్ని ఆటంకాలను, ఎన్ని అవాంతరాలను ఎదుర్కొన్నారో అంతా చెప్పవలసివస్తే ఒక సవాలక్ష గ్రంథం ఔతుంది.

అప్పట్లో అంతా వాక్శూరులే కాని క్రియాశూరులొక్కరూ లేరు. ఎందరో పెద్దపెద్ద పేరు కలవారే 'వితంతు వివాహం మేము చేసుకొంటాము. మేము చేయిస్తాము.' అని కబుర్లుచెప్పి తీరా సమయానికి వీరిని మోసం చేసి తాము తప్పించుకొనేవారు. అట్టిసమయాల్లో వారు అసహాయశూరులై కార్యం సాధించుకుపోయేవారు. తనకు సంతు లేకపోయినా ఉదారచరితుడు కాబట్టి వసుధయే తన కుటుంబంగా సంభావించి, విశ్వశ్రేయం కోసం ఒకరినిందలను లక్ష్యం చెయ్యకుండా ఒకరి మెప్పు నాశించకుండా, కడిచినచోట పంపకుండా, పండిన చోట కుడువకుండా, ధీరుడు కాబట్టి విఘ్ననిహన్యమానులైనా జంకకుండా, మళ్లీ నీతిశ్లాఘ్యపథం తప్పకుండా ప్రజ్ఞానిధులై ప్రారబ్ధార్థాన్ని ఉజ్ఝగించకుండా కడముట్టా నెఱవేర్చారు.

స్త్రీని రాజకీయరంగంలోకి కూడా తీసికొని రావడానికి గాంధీజీ చేసిన కృషికి సహితం మన దేశంలో తగిన వాతావరణ కల్పించినది మన పంతులుగారి ప్రబోధమే.

పంతులుగారి సేవను మూడుభాగాలుగా విభజించవచ్చును. ఒకటి క్రియాపరిణతి చెందిన సంఘ సంస్కారము; ఇంకొకటి భాషాభివృద్ధికరమైన సారస్వతసేవ; వేరొకటి ఆస్తికమతప్రచారము.

సారస్వతరంగంలో తీసుకొంటే వారు సహజ కవి అని చెప్పాలి. కేవల కవిమాత్రుడే కాదు. హాస్య కవి. ఆశుకవి కూడా. ఏదైనా ఒక రచన చేస్తే మళ్లీ వేరే శుద్ధప్రతి వ్రాయ నవసరంలేదు. ఏవైనా కావ్యాలు చెప్పాలన్నా ఆలోచనా, తడబాటూ అనేదే ఎప్పుడూ లేదట. ఇట్టి నవనవోన్మేషమైన సహజ ధిషణతో వారు తెలుగులో శతాధికగ్రంథాలు రచించారు. అనేకపత్రికలు నడిపారు. ఇంతేకాక ముద్రితంకాని గొప్ప పూర్వసాహిత్యం ఉన్నదనే తెలియని ఆ రోజుల్లో చాలా శ్రమించి సుమారు పాతికగ్రంథాల వఱకూ స్వయముగా సంస్కరించి ముద్రింపించారు.

సహజంగా పంతులుగారు రోగపీడితులు, దుర్బలులూ. ఐనా వారు ఒక్కముహూర్తం నిర్నిమిత్తంగా కూర్చోవడం వారి స్వభావానికి కిట్టనిపని. అనునిమిషమూ తన రోగశరీరంతో విధివిరామం లేకుండా పోరాడుతూ నిత్యమూ ఏదో సేవాకార్యక్రమం జరుపుతూనే ఉండేవారు. వారు చరమదశలో విశ్రాంతికోసం చెన్నపురివెళ్లి అక్కడకూడా ఊరికే ఉండకుండా అనేకవ్యాపకాలతో శ్రమిస్తూండేవారు. ఒక సమయంలో ఏఒక్కమనిషిచేతా సాధ్యపడని అనేకఉద్యమాలతో తలమునకలై తెప్పరిలలేకుండా బాధపడుతూండేవారు. వారు సహజశాంతగంభీరులు. సంస్కా

కోద్యమంలో వా రెంత కర్కశంగా ఉండేవారో, అంతరంగంలో అంత దయాసింధువులు. అందుచేత వారు తనకు లోక్యం లేని ఎన్ని యితరవిషయాల్లోనో కల్పించుకుని ఒకరికి ఉపకారం చెయ్యడమే పరమావధిగా ఎన్నో మారులు కోర్టులవరకూ కూడా ఎక్కి ఎంతో ద్రవ్యాన్ని ఖర్చుపడవలసి వచ్చింది కూడా. వారి ధారణాశక్తి అనుపమాన మైనది. నేను ఏకసంథాగ్రాహినని వారే ప్రస్తావనగా చెప్పియున్నారు. వారి కచంచలమైన ఈశ్వరచింతా, పాపభీతీ, పుణ్యరతీ కలవు. కలలోనైనా అసత్యమాడని సూనృతవాదులు వారు. ఆలోచనతోను, వివేచనతోను, పట్టుదలతోను పెనవేసికొనిపోయిన సాహసమూ, ధైర్యమూ అడుగడుక్కీ ఆయనను ముందుకు నెట్టుకొనిపోయి ఆంధ్రాభ్యుదయకాలంలో వారిని ధ్రువతార చేసినవి. ఇన్ని విధాల జాతికి జాగృతీ, ఉపకృతీ చేకూర్చిన ఈ మహనీయస్మృతినిగూర్చి ఆలోచించినకొలదీ ఈయన మానవుడేనా అనిపిస్తుంది. తీరికగా కూర్చొని పంతులుగారినిగూర్చి సమీక్షచేస్తే 'క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణైః' అనేది తప్ప ఇంకో సమాధానం దొరకదు.

ఇట్టి ఉద్యమాలతో వేలుకొలుపులు పాడి తన దేహము, తన గేహము, తన ధనంబు, తన విద్య జగజ్జనులకు వినియోగించి, తాను రిక్తుడైనా నాటికీ నేటికీ ఏనాటికీ తెల్గువారికి గురువుగా, నేతగా, తండ్రిగా, హితుడుగా, బంధువుగా, కడకు భృత్యుడుగా సేవచేసి పూజ్యుడై అజరామరమైన కీర్తిని తన జాతికీ, తనకూ ఆర్జించిన మహనీయమూర్తియై, ఆంధ్రసంస్కృతితో పాటు తానూ చిరంజీవియైనాడు.

[మొన్న మేనెల ౨౭వ తేదీనాడు జరిగిన వీరేశలింగంపంతులుగారి వర్ధంతిని పురస్కరించుకొని చేసిన పవిత్రసంస్మరణ ఇది]






# శ్వాసించే గృహము

ఈ గృహము సిమెంటు, ఇటుకలు, ఉక్కు మొదలయినవాటిచే నిర్మితమయినది. కార్కు చేత ఉష్ణనిరోధకత్వము గలదిగా చేయబడినది. దీని గోడలు బయట ఇటుకవరుసతోను, లోన కార్కుతోను చేయబడిన బోలు కట్టడములు.

ఈ ఇంటి కప్పున గల గవాక్షములలోనుండ గాలి లోన చొరబడును. చొచ్చి, బోలు గోడలలో పయనించి గొట్టముద్వారా వేడిగాలి కొలిమికేగును. అచ్చట ధూళినుండి శోధింపబడి (Filter), ఉష్ణము, ఆర్ద్రిత (humidity) ఎక్కువ చేయబడిన గాలి కప్పుకద్ద చాకపు వాతాయనములోనుండ గదిలోనికి ప్రసారము చేయబడును. తర్వాత ఈ గాలి కిటికీల చట్రములలోని చీలికలనుండి మరల బోలుగోడల గుండా పునాదిసేలను జేరి, యచ్చట గొట్టముద్వారా బయటికి త్రోయబడును. చలికాలములో ఇంటిలో ఈ విధముగా గాలి వెచ్చగా, సౌఖ్యప్రదముగా ఉండ గలదు. అదిగాక, వెచ్చని గాలి బోలు గోడలగుండా బయటికి త్రోయబడునపుడు ఇంటిలో వేడి సమముగా నుండగలదు.

వేసవిలో గాలి బయటినుండి, ఇంట పునాది సేలకు గల వాతాయనముద్వారా లోనికి ప్రవేశించి, బోలుగోడలలో పారును. గోడలలోని ఇటుకలు గాలి లోని తేమ పీల్చుకొనుటచేత గాలి చల్లదనము పొందును. తర్వాత ఈ గాలి శోధింపబడి, శీతలత్వము గలదిగా నయి ఇంటిలోని గదుల కిటికీల చట్రముల చీలికలద్వారా లోనికి పోవును. తర్వాత మలినమయిన ఈ గాలి కప్పుకద్ద గల కిటికీద్వారా బయటికి త్రోయ బడును.

—ఇదీ శ్వాసించే గృహపు శ్వాసకనుగుణమయిన నిర్మాణము, శ్వాసక్రియావిధము. ఈ గృహములో నుండువారికి పడిశెము, దగ్గు మొదలయిన శ్వాసావయవముల రోగములు రావు. ఋతుభేదములు వీరి శరీరములలో మార్పు కలిగించవు. వీరికి వేసవిలో ఆరని దప్పి, తాక కలుగవు. చలికాలములో చలి అసలేయుండదు. ఇంటిలోని గాలి కోరినయట్లు సర్వకాలములోను హాయికలిగించునదిగా ఉండవలయు నను మానవుని కోర్కె కిది శాస్త్రజ్ఞుని ప్రత్యుత్తరము. శ్వాస కనుగుణముగా నిర్మింపబడిన ఈ ఇండ్లలో పర్వతశిఖరములలో, సముద్రపు ఒడ్డులలో కల్గు చురుకుదనము, ఆనందము అనుభవించవచ్చునట!

కోరిన గాలి నేర్పరచుకొను విధానము (Air-conditioning) మనకు మరీ క్రొత్తదిగాదు. కాని ఈ విధానము సంపూర్తిగా నేర్పరచుటకు శ్వాసించే గృహమువంటి యిల్లు అత్యవసరము. ఇంటియొక్క నేల విస్తీర్ణమును బట్టి, కావలసిన గాలి, గాలి పారు గొట్టముల ఏర్పాటు చేయబడవలెను. ఒక్కొక్క గది ఎల, ఎందరు ఉపయోగింతురో అను విషయము గూడ ముఖ్యమే. ఇట్టి గృహముల నిర్మాణము రాబోవు ఇంజినీర్ల కొక ముఖ్యసమస్య.

ఈనాడు బజారులో ఇంటియంతకు కాక పోయినను ప్రత్యేకముగా గదియందు కోరిన గాలి రచించు సాధనము లున్నవి. కొన్ని విద్యుద్దీపకంటె ఎక్కువ పనిచేయవు. ఇవి గదిలోని గాలిని సంగ్రహించి బయటికి త్రోయుచు, గదిలో వాయుప్రసారమును క్రమపరచును. కొన్నింటిని

కిటికీలో నమర్చవచ్చును. ఇవి గాలిని ధూళి లేకుండ వడపోసి, పరిశుభ్రమయిన గాలిని ఇంటిలో వ్యాపింప జేయును. వీనిలో కనబడని వీవనలు గాలిని సంగ్రహించి గదిలోనికి పంపును. వీటిలో నే బయటి ధ్వని ఏమాత్రము లోన వినిపించకుండ చేయు యంత్రము గూడ ఉండును.

పైన చెప్పిన సాధనము లమర్చబడిన గదిలో ప్రవేశించినవెంటనే చలివేయును. అందువల్ల గాలిని చల్లబరచుటయే Air-conditioning అని మన మనుకొనుచుందుము. కాని దీని పరమావధి దేహమునకు సౌఖ్యమొసగుటయే. ఆయా శీతోష్ణ పరిస్థితులకు తగినట్లుగా ఇదిగూడ మారుచుండును. అధిక తేమగల గాలి శరీరమునకు కీడొనరించునని పరిశోధనవల్ల తేలినది. అదిగాక దేహమునకు తట్టిన గాలి, ఎంత కాలముండవలెనో ఇంకను పరిశోధనలలో తేలవలసియున్నది. తెలిసినంతవరకు ధూళిలేని, మితముగా తేమగల గాలి బాగుగా వీచినపుడు హాయిగా నుండునని మాత్రమే.

ఋతువులకు తగినట్లుగా సౌఖ్యము నిచ్చు సాధనములుగూడ లేకపోలేదు. కొన్ని శీతకాలములో అధికార్ద్రతగల వెచ్చని, ధూళిలేని గాలిని గదిలో విసరును; వేసవిలో ఆర్ద్రతలేని, చల్లని, ధూళిలేని గాలి వీచును. ఈ సాధనములు చూచుటకు రేడియోపెట్టెవలె నుండి విద్యుచ్ఛక్తిచే నడుపబడును.

కోరిన గాలి నేర్పరచు సాధనములన్నింటిలోను సూత్రమొక్కటే. వీవనలు బయటనుండి గాలిని సంగ్రహించును. అటుపిమ్మట గాలి వడపోయబడును. శీతకాలమయిన వేడి, తేమ కలిగినదిగాను, వేసవియయిన తేమలేని, చల్లని గాలిగాను చేయబడి, ఇంటిలో వివిధభాగములకు నాళములద్వారా ప్రసారము చేయబడును.

గాలినుండి ధూళి వేరుపరచు, వడపోయు సాధనములు రెండుమూడు రకములు. ఒకటి నూనెలో అద్దబడిన వెంట్రుకలవంటి పదార్థముతో చేయబడిన రెండంగుళముల మందము గల అట్ట. మరొకటి సూక్ష్మములయిన గాజుదారములు చిక్కగా అల్లబడి చేయబడిన జల్లెడ. వీటిలో దుమ్ము పేరుకొని చిల్లులు మూసికొనిపోయినపుడు ఒక గంటకొట్టును. వెంటనే క్రొత్త జల్లెడ అమర్చబడును.

ఆయా దేశమునుబట్టి నిర్ణీతకాలములో కావలసినంత గాలి అనార్ద్రితనో, ఆర్ద్రితనో పొందుచుండును. గాలిలో ఆర్ద్రత నధికము చేయుటకు గాలిని చక్కటి జల్లుగుండ పోనిచ్చెదరు.

చలికాలమునకు కావలసినయట్లు గాలిని వేడి చేసినపుడు, గాలినుండ నీటి ఆవిరి పంపి ఆర్ద్రితగలదిగా చేసెదరు. వేసవిలో గాలిని తేమ లేనిదిగా చేయుటకు దాని తుషారాంకము (Dew-point) కన్న తక్కువ ఉష్ణోగ్రతకు చల్లపడునట్లు చేసెదరు. అప్పుడు గాలిలో అధికముగా నున్న తేమ ఘనీభవించి క్రింద పడిపోవును. తేమ పోగొట్టుటకు లిథియమ్ క్లోరైడువంటి పదార్థములలోనుండ గాలిని పంపుటగూడ కలదు.

మంచుగడ్డలు లేక నీరు పారు గొట్టములచుట్టు గాలిని పంపి, దానికి శీతలత్వము కలిగించెదరు. లేక విద్యుచ్ఛక్తిచే నడుపబడు శీతలపు పెట్టెల నమూనాపై నుండు గాలి చల్లార్చు సాధనములు కూడ కలవు. చలికాలములో గాలిని వేడిచేయుటకు దానిని నూనె బాయిలరుయొక్క వేడిఅంచులపై విసరెదరు.

పాశ్చాత్యదేశములలో శ్వాసించే గృహములు వాడుక అయిపోయినవి. భూగర్భగృహములు చాలవరకు నే. భూమిపై నివసించువారికన్న భూమిక్రింది ఇండ్లలో నివసించువారే ఎక్కువ ఆరోగ్యము కలిగియుండగలరట. ఇంటిలో వాతావరణము అత్యుత్తమమయినది. దానిలో సూక్ష్మక్రిములు, ధూళి ఉండవు.

శాస్త్రపరిశోధనలవల్ల గృహనిర్మాణమునకు వలయు క్రొత్తవస్తువు లెన్నో కనిపెట్టబడినవి. రేపటి గృహము శ్వాసించునదే కాక అన్నివిధముల సౌఖ్యము నివ్వగలదు. సౌరదీపములు (Solarium lamps) నిరంతరము సూర్యరశ్మిని, ముఖ్యముగా అతినీలలోహిత కిరణములను ప్రసాదింపగలవు. ఇంటిలో విద్యున్నయనములే (Electric eyes) సేవకులు. టెలివిజన్ ద్వారా ఇంటిలోనివారు కాలు కదుపనక్కరలేకుండ అన్ని సౌకర్యములు లభింపగలవు. ఇకమీద ఇండ్లలో పెద్దగ్రంథాలయముల బదులు చిన్న ఫిల్ముచుట్ట లుండగలవు. ఈ ఫిల్ముపుస్తకముల ఇంటిలోని సినిమా యంత్రములద్వారా తెరపై బడునట్లుచేసి, శబ్దగ్రాహక (Sound recorder) యంత్రముతో చదువుటకు బదులు వినవచ్చును.

"రాము"

# ఒంటరిపల్లెపిల్ల*

శ్రీ నాళము కృష్ణరావు

అల్లదే చూడు మొంటిగా పల్లెపిల్ల
సాయ మెవరును లేకమె సంజవేళ
చేలుదున్నుచు గింజలు నేలఁ బాతి
పాడుచున్నది మ్రోడులు పల్లవింప.

సద్దు సేయక మెల్లగా సాగు మోయి—
సేవ్య మొనరించి ఆ బాల శ్రావ్యముగను
ఏదొ యొక్క ప్రశాంత విషాదగీతి
ఆలపించుచునున్నది - ఆలకింపు.

భువనమోహన మైన యా మధురపాట
వేణునాదముకన్నను, వీణకన్న
హాయి గొలుపుచు నా ప్రాంతలోయనుండి
మాఱు మ్రోగుచు వినిపించు మరల మరల.

ఓహో! ఆపాట యెంత మనోహరంబొ!
దరిని సెలయేటి గలగల ధ్వనులె సరిగ
తనదు పాటకు శ్రుతియును తాళములుగ
పాడుచున్నది ఆ బాల వేడుకలర.

దవ్వుదవ్వులనుండి యాదారిఁ జనుచు
మ్రానినీడను శ్రమ వాయ మేను వాల్చు
పథికజనులకు కోయిలపాటకన్న
కోమలం బయి సొక్కించు నామెపాట.

ఏమి పాడుచునున్నదో ఎఱుఁగ రెవరు;
కరుణరసపూరిత పురాణగాథ లెవియొ,
కాక పల్నాటివీరుల కదనకథలొ,
వీరబొబ్బిలి వెలమల విక్రమంబొ?

గేయమో, లేక త్యాగయ్యకృతియొ, లేక
జానపదగీతమో, లేక జావళియొ,
అదియుఁ గాక తరంగమో, అష్టపదులొ
మువ్వగోపాలపదములో - ఎవ్వఁ డెఱుఁగు?

ఏమియైనను గానిమ్ము ఆమెగాన
మంత మొందదు, ఎంత సేపైనఁ గాని;
చేనిలోనుండి సేవ్యంబు చేయుచున్న
యప్పుడెల్లను వినిపించు నామెపాట.

ప్రక్కనే యున్న కొండపై నెక్కి చనుచు,
విందు నా పాట వీనుల విందు లొలుక;
చిత్తరువువోలె నంతన చేష్ట లుడిగి
నిట్టనిలువున మ్రాన్పడి యట్టె నిలుతు.

చెవులచేరల నా పాట చవులు గులుక
జుఱ్ఱుకొందును చుబ్బనచూఱలుగను;
ఎంత యాలించినను గాని తృప్తి గనక
మగుడ మగుడంగ నాలింప మనసుపుట్టు.

ఇప్పుడును నేను కొండపై నేగునపుడు
-పొలములోపల నా బాల కలదొ లేదొ-
ఎడద నాటిన ఆపాట విడువ కెపుడు
రింగు మని మ్రోగు వీనుల పొంగి పొరలి.

* అనువాదము



# సమర్పణ



[ కథానిక ]

'అమరేంద్ర'

తను ఒక్కత్తే మిగిలింది. తనకు నాలుగేళ్ల పసిమనమడు ఒక్కడే దక్కాడు. తక్కిన వాళ్లంతా దారిలోనే మట్టిపాలయ్యారు. కొడుకులూ కోడళ్లూ, కూతురూ అల్లుడూ అంతా తనను ఈ శూన్యలోకంలో ఏకాకిని చేసి వెళ్లిపోయారు. ఆకులన్నీ రాలి మోడయిపోయి భీకరంగా కనిపించే ఎండు రాసిచెట్టులాగా తను ఒక్కత్తే మిగిలిపోయింది. కొమ్మల్లో ఏమూలనో చిగురించిన లేతచిగురులాగా పసిమనమడొక్కడే ముసలిమామ్మ శూన్యహృదయంలో జీవితాశను రేకెత్తిస్తున్నాడు. ఈ మనమడికోసం కాకపోతే తను ఈపాటికే తన సంతానంతో కలిసి స్వర్గానికి చేరుకునేది. ఈ పసికందును దిక్కులేని పక్షిని చేసిపోవటానికి మనసు పుట్టకపోవటంవల్లనే తన మొండిఘటాన్ని ఈడ్చుకొంటూ ఇంతదూరం నడిచివచ్చింది. అడుగుతీసి అడుగువేసే ఓపికలేని వయస్సు. అధఃపాతాళానికి అణగదొక్కివేసే దుఃఖభారం. అన్నిటినీ దిగమింగి అనాథుల సమూహంలో కలిసి తనూ బయలుదేరింది. అన్నిటినీ ఎదిరించి రగిలే శోకంతో, మండే ఆకలితో గజగజ వణుకుతూ మొండిగా ముందుకు సాగుతోంది. తన పసిమనమడిని ప్రాణంకన్నా భద్రంగా కాపాడుకుంటూ దీనంగా, బరువుగా అడుగు వేస్తోంది. దారిలో నదులూ, కొండలూ, అడవులూ అడ్డంవచ్చినా ఆగలేదు. ఆకలీ, చలీ, శోకం, రోగం ఎన్ని అణగదొక్కినా కుంగిపోలేదు. మృత్యువునుకూడా జయించివేసే ఆశతో, సాహసంతో, పూనికతో ఆ ముసలి తన ముడతలుపడిన శరీరంతో, చూపుమందగించిన కళ్లతో మొండిగా ముందడుగు వేస్తోంది. ఇది అంతులేని ప్రయాణంలాగుంది. బయలుదేరి ఎన్నాళ్లయిందో! అసలు ఈయాత్రకు అంతం లేదేమోనని నిస్పృహ తోస్తోంది. ప్రాణాలను గుప్పెట్లో పెట్టుకుని అడుగడుగునా మృత్యువుతో యుద్ధంచేస్తూ నరకంలో నడుస్తున్నట్లనిపిస్తోంది. అనుక్షణమూ హృదయంలో ఆ హాహాకారాలే ప్రతిధ్వనించి అణువణువూ ఆవేశంతో కంపించిపోతోంది. అహర్నిశలూ ఆ దారుణదృశ్యాలే కళ్లలో మెదులుతూ హృదయంలో ఆరనిచిచ్చు రగులుస్తున్నయ్. అవన్నీ తలపుకురాగానే ముసలమ్మ నిలువునా నీరుకారిపోతుంది. మరుక్షణంలోనే ఆమెముసలిహృదయం దెబ్బతిన్న తాచులాగా చ్రగన త్రుళ్లిపడి బుసకొడుతుంది.

తను కాటికి కాళ్లుచాపిన ముసలి దనే సంగతి మరిచిపోయి ప్రచండమైన ఆవేశంతో కంపించిపోతోంది. తన భుజాల మీద కూచుని అమాయకంగా, జాలిగా చూసే పసిమనమడికేసి ఒకసారి చూస్తుంది. "బాబూ! నాప్రాణం వుండగా నీకే ఆపదా రానివ్వను. నిన్ను సురక్షితంగా గమ్యస్థలానికి చేరుస్తాను. కంటికి రెప్పలాగా పెంచి పెద్దవాణ్ని చేస్తాను. పెద్దవాడివి కాగానే నువ్వు......" అని ఎన్నో ఆశలతో క్షణంలో ఆమెహృదయం వెయ్యిమెరుపులు మెరిసిన ఆకాశంలాగా వెలుగుతుంది. తన గుండెల్లో రగిలే చిచ్చు చల్లార్చే శక్తి ఆ పసికందులో వుందనే ఆమెవిశ్వాసం. వాడు పెరిగి పెద్దవాడైతే తనను దహించివేసే ఈ శోకాగ్ని చల్లారుతుంది. ఈ పసివాడే తన ముసలి చేతుల్లో మిగిలిన ఆయుధం. వీడిని పదునుపెట్టి తన సంతతినంతనూ చిత్రవధచేసిన శత్రువుల శరీరాన్ని చీల్చిచెండాడాలని ముసలమ్మఆశ. తనకు జరిగిన దురన్యాయానికి ప్రతీకారం జరపటంకోసమే ఈ పసికందును సురక్షితంగా గమ్యంచేరుస్తుంది. అందుకోసమే వాణ్ని పెంచి పెద్దవాణ్ణి చేస్తుంది. శత్రువులమీద పగను చల్లారనివ్వకుండా క్రోధాగ్నిని వాడిగుండెల్లో రగుల్చుతుంది. అప్పటికిగాని తన కడుపుమంట చల్లారదు. అప్పటికిగాని తన కూతురూ, కోడలూ తన కళ్లముందు మానభంగానికీ, చిత్రవధకూ గురి అయిపోతూంటే, హాహాకారాలు చేస్తూంటే శవంలాగా వింటూ నిలబడ్డ తనలో రేగిన చిచ్చు చల్లారదు. అప్పటికిగాని తన కొడుకులూ, అల్లుడూ జంతువులకన్న నీచమైన చావుకు గురిఅయినప్పుడు తనలో ఎగసిన మంట చల్లారదు. ఈ మంట ఆరని బడబాగ్ని. ఇది చల్లారని దావానలం. దీన్ని చల్లారకుండా విసరటానికే ముసలమ్మ తన బడుగుదేహంలో అసువులు మిగుల్చుకుంది. ఈ ఆవేశంతోనే ఇంతదూరం నడిచి రాగలిగింది. ఈ ఉద్రేకంతోనే గుండెల్ని చీల్చుకువచ్చే ఆక్రోశాన్ని దిగమింగుకోగలిగింది.

"మామ్మా, ఇంకెంతదూరం?" అని అడిగాడు కుర్రాడు.

"ఇంకెంతో లేదు బాబూ, దగ్గిరికి వచ్చేశాం. అదుగదుగో, ఆ కనిపించే మేడలే ఢిల్లీపట్నం" అంటూ ముసలమ్మ మరింత ఉత్సాహంతో గబగబా నడుస్తోంది.

ఆ సమూహంలో ఏమూలనుంచో సంభాషణ వినిపిస్తోంది. ముసలమ్మ వాళ్లంతా చెవులుచేసుకుని వింటోంది.

"చంపితే తిరిగిచంపద్దు అంటాడు. ఇళ్ళూ వాకిళ్ళూ తగలబెట్టి బైటికి తరిమినా బదులుకు బదులు తీర్చుకోకూడదంటాడు. తన కేం పోయింది? ఒడ్డున నిలబడ్డవాడు ఎన్నికబుర్లయినా చెప్పొచ్చు"

"ఆయనమాటలు వినటంవల్లనే ఇంత అధోగతి పట్టింది మనకు. కత్తికి కత్తితోనే బదులుచెప్పాలి. రక్తానికి రక్తమే తగిన జవాబు. ఈ వెర్రివేదాంతాలు వినివిని పసిగిపోయాం. మన కడుపుమంట ఆయన కేం తెలుసు?"

"తన కళ్ళముందు తన పెళ్ళాంబిడ్డల్ని పరాభవించిప్రాణాలు తీస్తుంటే తను చూస్తూ వూరుకోగలడా? తనదాకా వస్తేకాని తెలియదు!"

ఈమాటలన్నీ విని ముసలమ్మ మండిపోయింది. బదులుకు బదులు పనికిరాదని చెప్పే మనిషిపేరు విన్నప్పుడల్లా ఆమెకు పట్టలేని అక్కసు వస్తుంది. తనకు జరిగినంతటి దురన్యాయం జరిగినా ప్రతీకారం లేకుండా దీనంగా భరించి ఊరుకోవలసిందేనా? తన శోకగాథను ఆయనకు వినిపించి నాకు దారి ఏమిటని అడిగితే ఏం చెబుతాడు? అసలు ఆయనమూలంగానే తనకు ఇన్ని అగచాట్లు దాపరించినై. ఆయనమూలంగానే శత్రువులు నానాటికీ చెలరేగిపోతున్నారు. ఆయన ఎంత సేపూ చచ్చేవాళ్లను చావమని చెప్పటమేగాని చంపేవాళ్ళను ఆపలేడు. ఆయన చెప్పేదంతా అబద్ధం. కత్తికి కత్తితోనే బదులుచెప్పాలి–అనుకుంటూ ముసలమ్మ మనమడికేసి చూసింది. వాడు అర్థంకాకపోయినా మాటలన్నీ వింటూ తలవూపుతున్నాడు. పిడికిలి బిగబట్టి "మామ్మా! వాళ్లను ఒక్క గుద్దుకు చంపేస్తాను" అని తన పరాక్రమాన్ని ప్రకటించాడు. ఈమాటలు విని తన తపస్సంతా ఫలించినట్లుగా ముసలమ్మ మురిసిపోయింది. తన బడలిక అంతా ఒక్కసారి ఎగిరిపోయినట్లనిపించింది. ఢిల్లీలో వెళ్లి వాలాలి. కాని ఇల్లూ వాకిలీ అన్నీ వదిలివచ్చిన తమకు అండ ఎవరు? గూటిని విడిచిన పక్షుల్లాగా అల్లాడే తమకు దిక్కెవరు? ఇక తమకు దినం ఎల్లా వెళుతుంది? తమకు బతుకుతెరు వేది? తమకు తలదాచుకునే నీడ ఏది? ఎన్నో ప్రశ్నలు ముసురుకుని మనసును చికాకుపరుస్తున్నయ్. ముసలమ్మమాత్రం భారం అంతా దైవంమీద వేసింది. నారుపోసినవాడు నీరుపోయడా? కానిదేశం వచ్చాం. ఉన్నదంతా వొదులుకుని ఉత్తచేతుల్తోవచ్చాం. మమ్మల్ని కనికరించడా? మమ్మల్ని కాపాడడా? అని అనాథనాథునికి విన్నపం చేసుకుంటోంది. మనస్సు ఢిల్లీచేరటంకోసం తహతహలాడిపోతోంది. ఢిల్లీలో అడుగుపెట్టగానే వొళ్లు ఝల్లుమంది. దారిలో హతమైపోయిన పిల్లలు తలపుకు వచ్చి ముసలమ్మగుండె జలదరించింది. ఆ దుఃఖంలోంచి ఆవేశం పొంగుకువచ్చింది. ప్రతీకారంకోసం ఆమె ఆత్మ ఘోషించింది. కాదనేవా రెవరో, వద్దనేవారెవరో చూస్తాను. వారికి నాకథ వినిపిస్తాను. పోరాడుతాను—అనే ఆవేశంతో కంపించింది.

అందుకోసమే ఆనాటి సాయంకాలమే తన మనమడిని ఎత్తుకొని, మట్టికొట్టుకొని పీలికలైపోయిన గుడ్డలతో, అన్నంకోసం అలమటించే ప్రాణంతో సూటిగా ప్రార్థన సమావేశంజరిగే చోటికి పోయింది. ఆయనకు తనకథ అంతా చెప్పి ఆయనతో పోట్లాడితన కడుపుమంట ఆయనకు తెలియ జెప్పుకోవాలి అనుకొంటూ అక్కడికివచ్చింది.

ఆమె అక్కడికి చేరేసరికే ఎందరో అక్కడ గుమికూడారు. అందరూ ఆయన రాకకోసమే ఎదురుచూస్తూ కూచున్నారు. ఇంకా రాలేదేం? ఇవాళ ఎందుకు ఆలస్యం అయింది? అనేప్రశ్నలు అందరి మనసుల్లోనూ సందడి చేస్తున్నయ్. ఆకాశపథంలో నిత్యయాత్రికుడైన సూర్యుడి గమనమైనా ఒక నిమిషం అటూ ఇటూ కావచ్చునుగాని ఆయన కార్యకలాపాలు మాత్రం క్షణం కూడా ఆలస్యంకావటానికి వీలులేదు. అటు

వంటి మనిషి ఇవాళ ఎందుకు వేళతప్పాడు? అన్ని కార్యక్రమాలలోనూ అతిముఖ్యంగా పాటించే ప్రార్థనకు ఎందుకు ఆలస్యంగా వస్తున్నాడు? నిమిషం, రెండునిమిషాలు, ఇప్పటికి ఐదునిమిషాలు అయిపోయింది. ఇంకా ఆయనజాడ కనిపించటం లేదు. కారణం ఏమిటో? ఏమైనా ప్రమాదం సంభవించలేదుకదా? లేకపోతే ఇంత ఆలస్యం కావటం అసంభవం—అనే అలజడి ఒక హృదయంలోనుంచి ఇంకో హృదయానికి పాకిపోతోంది. అక్కడ కూచినవాళ్లందరూ ఆయనరాకకోసం, ఆయనదర్శనభాగ్యం కోసం ఆయన అమరవాణిని చెవులారా వినే అదృష్టం కోసం తహ తహలాడుతూ చీమ చిటుక్కుమన్నా ఉలిక్కిపడుతున్నారు. ఆయనఅడుగుల అలికిడికోసం వాళ్ళంతా చెవులుచేసుకుని కూచున్నారు. ఆ జనసమూహంలో కలిసిపోయి ముసలమ్మ తోసుకుంటూ ముందుకుపోయి వేదికదగ్గిరగా చతికిలపడింది. ఆయన ఎప్పుడు వస్తాడా, ఆయనకు తన వ్యథ అంతా ఎప్పుడు వినిపిద్దామా, ఆయనతో ఎప్పుడు వాదనచేద్దామా అని ఆమెమనసు ఆరాటపడిపోతోంది. శత్రువుతో తలపడి హోరాహోరి యుద్ధంచెయ్యటానికి ఉవ్విళ్లూరే సైనికుడిలాగా ముసలమ్మమనసు ఎప్పుడా ఎప్పుడాఅని ఎదురుచూస్తోంది. తన ఆర్తికంతటికీ, తన అభాగ్యానికంతటికీ మూలకారణం ఈ వ్యక్తే అనిపిస్తోంది. ఆయనమీద కసితో విరుచుకుపడటంకోసం దెబ్బతిన్నతాచులాగా ముసలమ్మగుండెల్లో ఆవేశం, ఆక్రోశంబుసలుకొడుతున్నయ్.

ఇంతలో గుంపులో కలకలం బయలుదేరింది. బాపూజీకి జై అనే కేకలు చెలరేగినై. ముసలమ్మ ఒక్కసారిగా లేచి నిలబడింది. ఏమీ కనబడలేదు. ఆత్రంగా అన్నివైపులా చూపులు పరిగెత్తించింది. దూరాన వడివడిగా నడిచివస్తున్న వృద్ధమూర్తి ఆమెకు కనిపించాడు. ఎవరో ఇద్దరి బుజాలమీద చేతులుమోపుచేసుకున్నాడు. చురచురలాడుతున్న ఎండ తాకకుండా తెల్లటిముసుగు కప్పుకున్నాడు. దూరంనుంచి ఎండ వెలుతురు పడి కళ్ళజోడు మెరుపురేఖలాగా తళుక్కుమన్నది. వయసువల్ల ముసలమ్మచూపు మందగించింది. ఎంత ప్రయత్నించినా ఇంకేమీ కనిపించలేదు. అల్లాగే నిలబడి చూస్తోంది.

ఆయన క్షణక్షణమూ ప్రార్థనస్థలానికి దగ్గరదగ్గరగా వచ్చేస్తున్నారు. క్షణక్షణానికీ ఆయనరూపం మరింత స్పష్టంగా కనబడుతోంది. బుజాలమీద చేతులు వేసిన అమ్మాయిలతో ఏవో నవ్వుతూ మాట్లాడుతున్నారు. ఆమాటలు వినబడటం లేదుకాని అపూర్వమైన ఆ చిరునవ్వులుమాత్రంచూసేవాళ్ల మనస్సులను వెన్నెలవెల్లువలతో ముంచెత్తుతున్నయ్. ఆయన ఆకారంలో ఎంతోఅలసటా, బడలికా కనిపిస్తున్నయ్. కాని ఆ అద్భుతమందహాస మాధుర్యంలో అవన్నీ కొట్టుకుపోతున్నయ్. ముసలమ్మచెవుల్లో ఆయనఅడుగుల అలికిడి వినిపిస్తోంది. ఆమెకళ్లు ఆయనతేజోమయమూర్తిని చూస్తూ రెప్పవాల్చటం మరిచిపోయినయ్. ఆమెమనసు ఒక్కసారిగా తన అక్కసునంతటినీ మరిచిపోయి ఆశ్చర్యంలో

మునిగిపోయింది. ఈవయస్సుమళ్ళిన ముదుసలి, ఈ వెన్నెలనవ్వుల పసిపాప ఈయనా తన శత్రువు? ఇన్నాళ్ళనుంచీ తను విన్న మాటలన్నీ నిజమేనా? జాలితొణికే ఆ చూపులు ఎవరికైనా హానితలపెట్టగలవా? ఇంతటిదురంతాలకూ, ఇన్నిదారుణమారణాలకూ ఈకరుణామూర్తి కారణమా? నిజమా? నిజమా? అనుకుంటూ ముసలమ్మ మనమడికేసి చూసింది. అప్పటికే మనమడు ఎవరూ చెప్పకుండానే తనంతట తానే బాపూజీకి చెయ్యెత్తి నమస్కారం చేస్తున్నాడు. ముసలమ్మ చకితురాలైపోయింది. ఏమిటి ఈ వ్యక్తిలోని శక్తి? పగబట్టిన తాచుపాము కూడా ఆయనముందుకు వచ్చేసరికి కోరలూడిపోయి పడగ లేవదుకాబోలు? ఇన్నాళ్లనుంచీ తన మనసులో పేరుకుపోయిన పగ అంతా ఒక్కనిమిషంలో ఎక్కడికో మాయమైపోయింది. ఈయనలో ఏం ఇంద్రజాలముందో? అయినా ఆరని చిచ్చుతో రగిలే తన గుండెలు ఒక్కసారిగా ఎల్లా చల్లారుతయ్? తన సంతానమంతా గురియైన చిత్రవధలు ఎల్లా మరచిపోగలదు? ఆ పైశాచికదృశ్యాలన్నీ ఒక్కసారిగా కళ్లముందునుంచి దూసుకుపోయినై. ముసలమ్మ కళ్లు తెరిచివున్నా వాటికి ఏమీ కనబడటంలేదు. తన బిడ్డల హాహాకారాలు ఒక్కసారిగా చెవుల్లో గింగురుమన్నాయి. ఆమెప్రతిరక్తనాళంలోనూ రణదుందుభులు మోగుతున్నయ్. కాని మళ్ళీ ఒకసారి బాపూజీకేసి చూసింది. ఆయన చాలాదగ్గరికి వచ్చేశారు. పసిపాపల బోసినవ్వూ, పరమఋషుల తేజస్సూ, కరుణకురిసే జాలిచూపూ ఒక్కసారిగా ముసలమ్మను మంత్రముగ్ధురాలిని చేసినై. అడుగు కదపలేక కళ్లు అప్పగించి చూస్తూ నిలబడిపోయింది.

ఇంతలో "హా రాం, హారాం" అన్న దీనమైన ఆర్తధ్వనులు వినిపించినై. జనంలో ఒక్కసారిగా హాహాకారాలు చెలరేగినై. ఆ రక్తప్రవాహం చూసి ముసలమ్మకళ్లు గిర్రున తిరిగిపోయినై. బాపూజీ నేలకుఒరిగిపోయారు. వక్షస్థలం రుధిరధారలను ఎగజిమ్ముతోంది. బాధతో మూతలుపడుతున్న కళ్లలో అక్షయమైన క్షమ ధగధగ వెలుగుతోంది. తుత్తునియలైపోయి నెత్తురు కాలువలు కడుతున్న ఆ అజాతశత్రువుగుండెలకేసి చూస్తుంటే ముసలమ్మతల తిరిగిపోతోంది. తను దారిపొడుగునా చూసిన చిత్రవధలన్నీ ఒక్కసారిగా మరుపుతెరలలో మాయమైనయ్. తన కూతురు మానభంగానికి మగ్గిపోయి మరణించిన క్షణంలోకూడా గుండె అంత బద్దలైపోలేదు. తనకొడుకూ, అల్లుడూ చిత్రవధకు గురియై ప్రాణాలు విడిచిన క్షణంలోకూడా అంత ఆక్రోశంతో గొంతుచించుకొని శోకించలేదు. కాని ఈ క్షణంలో ముసలమ్మమనసు పరవడితొక్క శోకసాగరం. ఈక్షణంలో నెత్తురుధారలతో తడిసిపోతున్న బాపూజీమూర్తిలో సంతానాన్ని కోలుపోయిన తల్లిదండ్రులూ, భార్యలను పోగొట్టుకున్న భర్తలూ, భర్తలనుకోలుపోయిన భార్యలూ శోకించే అభాగ్యలోకం అంతా ఒక్కసారిగా కానవచ్చింది. చూడలేక కళ్ళుమూసుకుంది. కళ్ళుమూసినా వరదలైపారుతున్న ఆ పవిత్ర రక్తమే! అనాథులకు, ఆర్తులకు, అగతికులకు

అండగా నిలిచిన అజాతశత్రువు అపూర్వ సమర్పణ ఆ రక్తమే! తరతరాల రక్త దాహంతో హాహాకారాలు చేసే హృదయాలకు అమృతవర్షం ఆ రక్తమే!

మరొకసారి ధైర్యం తెచ్చుకుని కళ్లు తెరిచి చూసింది. మహానదిల్లో కలిసిపోయే ఉపనదులలాగా తన కొడుకూ, కోడలూ, కూతురూ, అల్లుడూ కరకుకత్తులకు గురియై చిందించిన వేడినెత్తురు కూడా ఆ రక్తవారిధిలో పొంగులెత్తుతున్నట్లనిపించింది...

"మామ్మా! బాపూజీని చంపేశారు..."

"అవును బాబూ! ఇంక మనకు దిక్కెవరు?" అంటూ స్పృహతప్పి వెనక్కు విరుచుకుపడిపోయింది.






— శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య —

౧౯౪౫ సం॥ మే, ౮ తేదీన జర్మనులపై మిత్రమండలివారు సంపూర్ణ విజయమును గాంచిరి. కనుక ఆ విజయవార్షికోత్సవమును గతమాసమున అనేకపట్టణములందు పాశ్చాత్యప్రభుత్వములవారు జరిపిరి. కాని జర్మనులు ఓడిపోయినను హిట్లరు ప్రతిపాదించిన సిద్ధాంతములుగాని, అనుసరించిన విధానముగాని పరాజయముగాంచలేదని ఈ మూడుసంవత్సరములమధ్యన జరిగిన చర్యలు నిరూపించుచున్నవి. ఇతరదేశములను జయించి తన వశమందుంచుకొని, తద్వారా తన సామ్రాజ్యాధికారమును వ్యాపింపచేసుకొనుటకు హిట్లరు ఉద్దేశించెను; ప్రజాస్వామ్యవిధానము అనుసరణయోగ్యము కాదని నిరంకుశ ప్రభుత్వమును స్థాపించెను. వ్యక్తి స్వాతంత్ర్యము సంఘసౌష్ఠవమునకు భంగకరమని దానిని రూపుమాపెను. అతనిపై యుద్ధమునకు దిగిన మిత్రమండలివారందరు—ముఖ్యముగ బ్రిటన్, అమెరికా రష్యా, ప్రభుత్వములవారు—హిట్లరును ఓడించుట మూలమున ప్రతిదేశమునకు స్వరాజ్యము, ప్రజాస్వామ్యము లభించుననియు, వ్యక్తిస్వాతంత్ర్యము నిలబడుననియు ప్రకటించిరి. ఈ ఆదర్శములకు సాఫల్యము కల్పించుటయే తమ ఉద్దేశమని ఘోషించిరి. కాని హిట్లరు ఓడిపోయెను హిట్లరు ప్రతిపాదించిన సిద్ధాంతములు ఓడిపోలేదని మనమిప్పుడు చెప్పవలసియున్నది. మే ౮ తేదీన జరుపబడిన వార్షికోత్సవములు అర్థములేని ఉత్సవములనుటలో అసత్యమేమియు లేదు.

ఏ దేశముల స్వాతంత్ర్యమును హిట్లరు నాశము చేయుటకు ప్రయత్నించెనో ఆదేశములలో అనేకములు స్వాతంత్ర్యమును కోల్పోయినవి. పోలెండు, చెకోస్లొవేకియా, హంగెరి, యుగోస్లేవియా, బల్గేరియా, రుమేనియా, లాట్వియా, ఎస్తోనియా, లిథుయేనియా, ఆల్బేనియా దేశములన్నియు రష్యావారి అధీనములోనికి వచ్చినవి. ఫిన్లాండుకూడ అట్టి స్థితిలోనికి వచ్చుచున్నది. ఇదిగాక తూర్పు జర్మనీ, తూర్పు ఆస్ట్రియాలకు రష్యావారు పరిపాలకులైరి. నార్వే, డెన్మార్కు, స్వీడన్ మొదలైన చిన్నదేశములకు స్వాతంత్ర్యమున్నమాట నిజమేగాని, పిడికిలిలో ప్రాణము పెట్టుకొన్నవానివలె, ఏ నిమిషమునకు ఎట్టి ప్రమాదమువచ్చునో అన్న భయావస్థయందు అవి ఉన్నవి. అనగా హిట్లరు సామ్రాజ్యము నశించినదేగాని దాని ఫలితముగ స్వాతంత్ర్యము విస్తరించలేదు. హిట్లరు సామ్రాజ్యమునకు బదులు రష్యా సామ్రాజ్య మేర్పడెను.

దీని మూలమున తమకు ప్రమాదము కలుగునేమో యన్న భీతిచేత అమెరికావారుకూడ వారి అధికారమును ఇతరదేశములపై స్థాపించసిద్ధపడిరి. గ్రీసు టర్కీ దేశములు వారి వశమయ్యెను. పశ్చిమయూరపుఖండమందలి దేశములకు ఆర్థిక సహాయముచేసి వాటినికూడ తమ పలుకుబడిలోనికి తెచ్చుకొనుటకు వారు గట్టి ప్రయత్నము చేయుచున్నారు. ఆఫ్రికాఖండమందు ఇదివరలో పాశ్చాత్యులు స్థాపించిన సామ్రాజ్యములు అట్లే ఉన్నవి. ఏషియాఖండములోని డచ్చి, ఫ్రెంచి సామ్రాజ్యములకు చలనమేదియు లేనట్లు కనుపించుచున్నది. దీనికితోడు జపానులోను కొరియాలో కొంతభాగమందును అమెరికా సామ్రాజ్యము నాటు

కొన్నది. మంగోలియాలోను కొరియాలో తక్కిన భాగమందును రషియావారి అధికారము ప్రబలినది. ఇండియా, బర్మా, సింహళములలో మాత్రము ఇది వరకు అధికారమందుండిన బ్రిటిష్‌వారు వారి అధికారమును కోల్పోయిరి. కాని మొత్తముమీద రెండవ ప్రపంచయుద్ధము సామ్రాజ్యములను వినాశము చేయుటకు బదులు రషియా, అమెరికా సామ్రాజ్యముల వ్యాప్తికి కారణభూతమయ్యెను.

నిరకుంశప్రభుత్వము అదృశ్యమై ప్రజాస్వామ్యము నెలకొనుటకుకూడ ఈ యుద్ధము తోడ్పడ లేదనియే చెప్పవలసియున్నది. రషియా అధీనములోనికి వచ్చిన దేశములన్నిటియందును అధికారము ప్రజల వశమగుటకు బదులు స్వల్పసంఖ్యాకులును ప్రజాస్వామ్యమందు విశ్వాసములేనివారును అగు కమ్యూనిష్టు పక్షము వారి నిరంకుశాధికారము స్థాపింపబడినది. అమెరికా వారి వశములోనికి వచ్చిన దేశములలో పేరునకు ప్రజాస్వామ్య మేర్పడినదిగాని, నిజముగ అధికారమంతయు అమెరికనుల వశమందే ఉన్నది. సామ్రాజ్యతత్వమునకు ప్రజాస్వామ్యమునకును ఎట్లు పొందిక యేర్పడగలదు ?

ఈ కారణముచేతనే వ్యక్తిస్వాతంత్ర్యమునకు గల అవకాశముకూడ ప్రపంచమందు తగ్గిపోయెను. ఎచ్చటజూచినను ప్రభుత్వమువారి అధికారము వృద్ధిదశలో ఉన్నది. గనుక మే ౮ తేదిన జరిగిన వార్షికోత్సవములు అర్థములేని ఉత్సవములని చెప్పదగియున్నది.

ప్రపంచశాంతికి భంగము కలుగుట కంతకు హిట్లరు కారణభూతుడనియు, అతనిని నాశనము చేసిన యెడల ప్రపంచమున శాంతి యేర్పడుననియు యుద్ధకాలమందు మిత్రమండలివారు చెప్పుచుండిరి. కాని ప్రపంచమందు శాంతి యేర్పడినట్లులేదు. గ్రీసు,పాలెస్టైన్ ఇండో చైనా, ఇండోనేషియా, చైనా దేశములలో అతిభీకరములగు అంతర్యుద్ధములు జరుగుచునే ఉన్నవి. వేలకొలది జనులు ప్రాణములు కోల్పోవుచున్నారు. యుద్ధము మూలమున ఖైదీలైనట్టి వారియొక్కయు వికలాంగులైనట్టి వారియొక్కయు సంఖ్య తగ్గలేదు. గనుక ౧౯౩౯-౪౫ మధ్యన ఎట్టి అశాంతి ప్రపంచమందుండెనో అట్టి అశాంతి ఇప్పుడుకూడ నున్నది.

అంతర్యుద్ధములు లేని దేశములలో కూడ శాంతి లేనట్లే మనము భావించవలసి యున్నది. యజమానులకును కార్మికులకును మధ్యన పరస్పర భేదములు అధికములైనవి. ప్రతిదేశమందును. సమ్మెలసంఖ్య వృద్ధిగాంచినది. సాహుకారీ విధానమునందు నెమ్మదిగా మార్పులు తేవలయునని కోరు సోషలిష్టులకును వెంటవెంటనే దౌర్జన్యము నుపయోగించి విప్లవము మూలమున మార్పులు తేవలయునని కోరు కమ్యూనిష్టులకును పరస్పరద్వేషము దినదినాభివృద్ధిగాంచుచున్నది. అనేక దేశములలో ఈద్వేషము మూలమున సామాన్య ప్రజలు శాంతి అనిన ఏమియో ఎరుగక అతిభయముతో కాలము గడపవలసిన స్థితిలో నున్నారు. ఇండియా, బర్మా,మధ్య ప్రాచ్యదేశములలో ఏక్షణమున ఈఅశాంతి యుద్ధరూపమును ధరించునో చెప్ప జాలము. కనుక రెండవ ప్రపంచయుద్ధము మూలమున శాంతి పరిస్థితులు ఏర్పడినవని చెప్పుటకు కూడ అవకాశములేదు.

కనుక ఏదృష్టితో పరిశీలించినను ప్రపంచ పరిస్థితులు బాగుపడుటకు బదులు పూర్వము కంటె ఎక్కువ ప్రమాదకరములైనవని చెప్పుటలో అతిశయోక్తి ఏమియులేదు. ౧౯౪౫, మే ౮ తేదిన లభించిన విజయము నిజమైన విజయము కానేకాదు. ఆరోజున వార్షికోత్సవము జరుపుట అర్థములేనిమాట.

## పాలస్తీనా-భద్రతాసంఘ అసమర్థత

శాంతి సంస్థాపనమునకై ప్రత్యేకముగ ఏర్పరచబడిన ఐక్యరాజ్య సమితియు, దాని ప్రధానాంగమగు భద్రతా సంఘమును ఎట్టి శాంతిని స్థాపింపలేని స్థితిలో నున్నవి. కాశ్మీరులో జరుగుచుండు యుద్ధమును నివారణచేయుటకు భద్రతా సంఘమునకు ఇష్టముగాని శక్తిగాని లేదన్నమాట స్వానుభవముచే మనకు తెలిసియే ఉన్నది. ఇండియా ప్రభుత్వముగాని పాకిస్థాన్ ప్రభుత్వముగాని అంగీకరించని తీర్మానము నొక దానినిచేసి, దానిని అమలులో పెట్టుటకు ఒక కమీషన్‌ను భద్రతా సంఘము వారు కాశ్మీరమునకు పంపసిద్ధపడియున్నారు. అట్టి నిరర్థకమైన కమీషన్ ఏమి చేయగలదు ? అది కాశ్మీరుకు వచ్చుటచేత ఎట్టి లాభము కలుగును ? ఇట్టి చట్టవిరుద్ధములును, న్యాయవిరుద్ధములును అగు తీర్మానములను అప్పుడప్పుడు చేయుటతప్ప నిజముగ శాంతి సంస్థాపనమునకై భద్రతా సంఘము వారుగాని, ఐక్యరాజ్యములసమితివారుగాని ఎట్టి ప్రయత్నములను చేయ సామర్థ్యములేనివారని ఋజువుచేయుటకు వేరు నిదర్శనము అవసరములేదు. కాని పాలెస్టయిన్ విషయమున ఈ సంస్థలు గత ఆరువారములమధ్యన చేసిన

తర్జనభర్జనలు వాటి చేతకానితనమునకు మరియొక నిదర్శనముగ నున్నవి.

హిందువులు మహమ్మదీయులుమధ్యన భరత ఖండమును విభజించినట్లే యూదులు అరబ్బీలుమధ్యన పాలెస్టయిన్‌ను రెండు స్వతంత్రరాజ్యములుగ విభజించుటయే కర్తవ్యమని ౧౯౪౭, నవంబరులో ఐక్యరాజ్యసమితివారు తీర్మానించిరి. కాని దీనిని అమలులో పెట్టుటకు కావలసిన ఏర్పాటులను వారు చేయరైరి. ౩౦ సంవత్సరములనుండి ఆ దేశమును పాలించుచుండిన బ్రిటిష్‌వారు మే ౧౫ తేదీన వారి అధికారమును వదలుకొనుటకు తీర్మానించుకొనిరి, విభజన కావలెనని పట్టుబట్టిన యూదులకును, అది జరగరాదని పట్టుబట్టిన అరబ్బీలకును నవంబరునుండి యుద్ధము ప్రారంభమయ్యెను. దానిని ఆపుటకు భద్రతాసంఘము వారు అనేక ఉపాయములనుగురించి వాదోపవాదములు చేయుచువచ్చిరేగాని ఆచరణయోగ్యమైన సాధనమును ఉపయోగించ సిద్ధపడినవారు కాకపోయిరి. అప్పుడు వారు విభజన విషయమును పునరాలోచించుటకై ఐక్యరాజ్యసమితి మహాసభయొక్క ప్రత్యేక సమావేశమును ఏర్పాటుచేసిరి. ఏప్రిలు ౧౬ తేది మొదలు బ్రిటిష్ అధికారము అదృశ్యమగునాటివరకును ఈ సమావేశములో ఎన్నో వాదోపవాదములు జరిగెనుగాని, విభజన రద్దు కావలెనను తీర్మానము వారు చేయజాలరైరి. మే ౧ తేదీన బ్రిటిష్ వారు వారి అధికారమును వదలుకొనిరి. వెంటనే పాలెస్టయిన్‌లోని యూదులు విభజన తీర్మానము ప్రకారము వారివంతుకు వచ్చిన ప్రదేశములో "ఇస్‌రేల్" అను పేరుతో తమ స్వతంత్రరాజ్యమును స్థాపించినట్లు ప్రకటించిరి. దానిని పాలించుటకు తాత్కాలిక ప్రభుత్వమునొకదానిని స్థాపించిరి. దానిని రక్షించుకొనుటకు కావలసిన సైన్యాది ఏర్పాటులను అంతకుముందే చేసుకొనియుండిరి. కనుక సాధారణముగ రాజ్యమునకు ఎట్టి అంగము లుండవలెనో అట్టి అంగములన్నిటితో ఇస్‌రేల్ రాజ్యము మే తే ౧౫ దిన జన్మించెను. ఇందులో ౬౫౦,౦౦౦ యూదులున్నారు. విభజనను రద్దుచేయవలెనని అదివరకు వాదించుచుండిన అమెరికావారు ఈ రాజ్యమును వెంటనే గుర్తించిరి. తర్వాత కొద్దిరోజులలో రష్యా, రష్యా పలుకుబడిలోనుండిన తక్కినరాజ్యములు, దక్షిణ ఆఫ్రికా మొదలైన రాజ్యములుకూడ ఈ యూదురాజ్యము సక్రమమైన రాజ్యమని గుర్తించిరి.

కాని చుట్టుపట్లనున్న ఈజిప్టు, ఇరాక్, ట్రాన్సు జార్డన్, లెబనన్, సిరియా, సౌద్ అరేబియా అను ఆరు అరబ్బీరాజ్యములవారు ఈ యూదురాజ్యము సక్రమమైనది కాదనియు, పాలెస్టైన్ అరబ్బీలదేశమనియు, అందు అధికసంఖ్యాకులుగనుండు అరబ్బీల అనుమతిలేక ఎట్టి విభజన జరుగరాదనియు చెప్పుచూ, తమ సైన్యములన్నిటితో పాలెస్టైన్‌పై దండెత్తి, యూదురాజ్యమును నాశముచేయుటకు సంసిద్ధులైరి. ఈ దాడి మే ౧౫ తేది ప్రారంభమయ్యెను. ఈ రెండువారములుగ అరబ్బీరాజ్యముల సైన్యములను యూదులకును మధ్య యుద్ధము జరుగుచున్నది.

యూదులరాజ్యము మిక్కిలి చిన్నది. వారి జనసంఖ్య చాలతక్కువ, వారివద్ద ౩౦,౦౦౦ సైన్యముకంటె ఎక్కువలేదు. వారి రాజ్యము క్రొత్తది. సైనిక పరికరములుగాని ధనముగాని వారివద్ద ఎక్కువగ లేవు. ఇవన్నియు ఇతరదేశములనుండి వారు తెచ్చుకొనవలసిన స్థితిలోనున్నారు.

అరబ్బీరాజ్యముల స్థితిగతులు వేరు. అవి నాలుగు కోట్ల జనముతో కూడినవి. చాలకాలమునుండి స్వాతంత్ర్యమనుభవించుచుండునవి. రెండులక్షల సైన్యముతో యుద్ధములోనికి దిగినవి. కనుక స్థూలముగ చూచినయెడల ఈయుద్ధములోవారికే జయము లభించు సూచన లున్నట్లు అగుపడును.

కాని పరిస్థితులన్నియు అరబ్బీరాజ్యములకు మాత్రమే అనుకూలపడియున్నట్లు చెప్పుటకు వీలులేదు. కొన్ని వారికి అనుకూలములుగనున్నను మరికొన్ని వారికి ప్రతికూలములుగనున్నవి.

పైన ఉదహరించినవిమాత్రమేగాక వారికిగల అనుకూల్యములలో బ్రిటిషువారి అభిమానము మిక్కిలి ముఖ్యమైనది. మధ్యప్రాచ్యదేశములలో తమ పలుకుబడిని స్థాపించుకొనుటకై ఈజిప్టు, ఇరాక్, ట్రాన్సుజార్డన్ రాజ్యములతో వీరు ఇదివరకే సంధిచేసుకొనియున్నారు. యుద్ధకాలమందు వారికి కావలసిన పరికరములను సరఫరాచేయుటకు వారు ఒడబడి ఉన్నారు. ట్రాన్సు జార్డన్ రాజునకు వారు ఏటేట ఇరవైలక్షల పౌనుల ద్రవ్యమును ఇచ్చుచున్నారు. ఈ యుద్ధములో అరబ్బీలను గెలిపించవలయునని బ్రిటిషువారి ఉద్దేశము.

అరబ్బీలవిజయమునకు ప్రతికూలాంశములు కూడ కొన్ని కలవు. అరబ్బీరాజ్యములలో సంపూర్ణమైన ఐక

మత్యములేదు. ట్రాన్స్‌జార్డన్ రాజు, సౌదీ అరేబియా రాజు, పరస్పరవిరోధులు. ట్రాన్స్‌జార్డన్ రాజు లెబినన్ సిరియాలతో కూడిన "విశాల సిరియా" రాజ్యము నొక దానిని స్థాపించుటకు అనేకసంవత్సరములనుండి ప్రయత్నముచేయుచుండువాడు. అట్టిది జరుగుట సౌద్ అరేబియా రాజుకుగాని, ఈజిప్టురాజుకుగాని ఇష్టము లేదు. ఇదిగాక ఈ రాజ్యములకు కావలసిన సైనికపరికరములుకూడ విదేశములనుండియే రావలసియున్నది.

ఇంతేగాక అమెరికావారు యూదులయందు కొంత అభిమానమును చూపుచున్నారు. యూదు రాజ్యమునకు పదికోట్లడాలర్ల ఋణమునిచ్చుటకును, సైనికపరికరములను సరఫరాచేయుటకును సుముఖులుగ నున్నారు. అమెరికానుకాదని బ్రిటిషువారు అరబ్బీలకు సహాయముచేయుట సాధ్యముకాదు. అనేకవిషయములలో ప్రస్తుత పరిస్థితులలో బ్రిటిష్‌వారికి అమెరికావారి సహాయము అత్యవసరము. ఈయుద్ధములో బ్రిటిష్‌వారు అరబ్బీలకు తోడ్పడినయెడల మార్షల్ ప్రణాళిక ననుసరించి అమెరికావారు ఇదివరలో బ్రిటిష్‌వారికి చేయబూనిన సహాయమంతయు ఆగిపోవునని అమెరికావారు బెదరించుచున్నారు. ఈలాటి బెదరింపుల ఫలితముగ ట్రాన్స్‌జార్డన్ సైన్యమునందు అధికారపదవులలోనుండి బ్రిటిష్ అధికారులు వారి ఉద్యోగములను విరమించుకొనిరి. గనుక కొనవరకు బ్రిటిష్‌వారి సహాయము అరబ్బీరాజ్యములకు లభించుననుటకు వీలులేదు. అమెరికావారు ఏమిచేసిన, దానినే బ్రిటిష్‌వారుకూడ చేయవలసిన స్థితిలోనున్నారు.

ఇదిగాక రష్యావారు యూదురాజ్యముపట్ల సానుభూతిని ప్రకటించుచున్నారు. వారి మూలమున యూదులకు కొంత సహాయము లభించవచ్చును.

ఈ యుద్ధము ప్రారంభమై రెండువారములైనది. అంతకుపూర్వమునుండియే అరబ్బీరాజ్యములు యుద్ధసన్నాహమునందుండెను. రెండువారములక్రిందట వారు పాలెస్టైనుపై దండెత్తినను జెరూసలం పట్టణములో కొంతభాగమునున్నా, అరబ్బీలు అధికసంఖ్యాకులుగ నుండు ప్రాంతములనున్నా వారు వశపరచుకొనగలిగిరే గాని, యూదులు అధికసంఖ్యాకులుగ నుండు ప్రాంతములలోకి ఇంకను ప్రవేశింపలేదు. అట్టి ప్రవేశము వారికి కలుగుటసులభము కానట్లు కనుపించుచున్నది. అరబ్బీరాజు లందరిలో సమర్థుడగు ట్రాన్స్‌జార్డన్ రాజు (అబ్దుల్లా), యూదులతో రాజీచేసుకొనినను చేసుకొనవచ్చును. అతని దృష్టిలో యూదురాజ్య వినాశముకంటె విశాల సిరియా రాజ్యసంస్థాపనము ఎక్కువ ప్రధానమైనది.

ఇట్టి పరిస్థితులలో జయమెవరిదో చెప్పుట సాధ్యముకాదు. కాని ఇప్పటికి దేశవిభజన జరుగుటయు, యూదురాజ్యమొకటి ఏర్పడుటయు, దానిని అగ్రరాజ్యములగు అమెరికా రష్యాలు గుర్తించుటయు ప్రధానముగ గమనించతగ్గ విషయములు.

## అమెరికారష్యాల స్నేహము

అమెరికా రష్యాల మధ్య సుహృద్భావము ఏర్పడనంత వరకు భద్రతా సంఘము మాటలాడగల సంఘమే గాని పనిచేయగల సంఘము కాజాలదని స్పష్టము. రాజకీయసంఘము, మాటల సంఘముగనుండ రాదు. కార్యరంగమేగదా దాని రంగము!

ఈ రెండు అగ్రరాజ్యముల మధ్యన సుహృద్భావము ఏర్పడునన్న ఆశ మే ౧౨ ది కొన్ని గంటల కాలము ప్రపంచమందంతట నుండెను. అంతకు క్రితము ఎనిమిదిరోజులక్రిందట మాస్కోలోనుండు అమెరికా రాయబారి రష్యా విదేశాంగమంత్రి వ్రాసినలేఖ, దానికి జవాబుగ వతనికి రష్యామంత్రి వ్రాసిన ఉత్తరము—ఈరెంటిని రష్యావారు ప్రచురణచేసిరి. ఉభయదేశములమధ్యన ఏర్పడిన మనః స్పర్థలనుగురించి ఆలోచించుట ఉచితమని అమెరికారాయబారి వ్రాసినదానికి రష్యామంత్రి ఆమోదమును తెలిపినట్లు అందుండెను. ఈ రెండుదేశముల ప్రతినిధులు కలుసుకొని, వారివివాదములనన్నిటిని పరిష్కరించుకొనెదరన్న నమ్మకము ఏర్పడెను. ప్రపంచములో ప్రస్తుతము కనుపించుచుండు అశాంతికిని భయమునకు వీరివివాదములేగదా కారణములు. బలవంతులగు వారు రాజీ చేసుకొని సామరస్యముతో ప్రవర్తించినయెడల తక్కినవారు భయపడవలసినది ఏమిగలదు? కాని ఈ ఆశ అంతయు వెంటనే నిరాశ అయ్యెను. రెండురాజ్యములమధ్యన జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు రహస్యములు. వాటిని బయటపెట్టుట మర్యాదకాదు. అందులో తమ జవాబును అమెరికా వారికి అందచేయుటకు ముందే దానిని ప్రపంచమునకంతకు తెలియునట్లు ప్రచురించుట అమెరికావారి యెడల రష్యావారికి మర్యాదలేదని సూచించుటయే. కాని సంప్రతింపులకై అమెరికావారు బ్రతిమాలుకొన్నట్లును, అందుకై రష్యావారు అంగీకరించినట్లును, అర్థ

మిచ్చేటట్లు రహస్యముందు ప్రచురించినది. అందుచేత అమెరికావారు కోపించి, సంప్రతింపులకై తామెన్నడు ప్రయత్నించలేదనియు, రషియావారి ధోరణి ఏనాడో తమకు తెలిసినదనియు, అట్టివారితో సంప్రతింపులు పునఃప్రారంభించుట నిష్ప్రయోజనమనియు ఒక ప్రకటనను గావించిరి. అందుచేత సంప్రతింపుల ప్రయత్నము విఫలమయ్యెను. మరికొన్ని రోజుల తర్వాత మార్షల్ స్టాలిన్ (రషియానియంత) ఈ సందర్భములో ఒక ఉత్తరమును ప్రకటించి అందులోని అంశములగురించి సంప్రతింపులు జరిపించుట సమంజసమని సూచించెను. కాని అవి ప్రాతకాలపు నాటి అంశములనియు, వాటినిగురించి ఎన్ని పర్యాయములో సంప్రతింపులు జరిగినవనియు, రషియావారి మొండిపట్టుమూలమున సమాధానము కుదురలేదనియు తిరిగీ వాటినిగురించి ఆలోచించుట అనవసరమనియు ఏ ఆలోచనలైనను ఉభయులమధ్యనగాక ఐక్యరాజ్య సమితిలో జరుగుటయే యుక్తమనియు అమెరికావారు జవాబిచ్చిరి. ఈ వాగ్వివాదములతో సంప్రతింపుల ప్రయత్నముల అంతరించెను. రెండుమూడు రోజుల క్రిందట అమెరికా మంత్రి మార్షల్ దీనినిగురించి ప్రస్తావము చేసెనుగాని ఉభయులమధ్యన రాజీ కుదురుననుటకు తగిన కారణములు ఏర్పడలేదు. అనగా ప్రపంచమందలి అశాంతియు, యుద్ధసన్నాహములును తగ్గునని చెప్పుట కింకను వీలులేదన్నమాట.

## ఇంగ్లండులో సోషలిస్టువిధానము

మే నెలలో సోషలిస్టు విధానమునుగురించిన చర్చలనేకములు ఇంగ్లండులో జరిగెను. మూడు సంవత్సరముల క్రిందట ఆ దేశములో కార్మికపక్షమువారి యాజమాన్యమున సోషలిస్టు ప్రభుత్వ మేర్పడెను. స్వలాభము నొక్కదానినే అపేక్షించు సాహుకార్ల వశమున పరిశ్రమలుండరాదనియు, వాటినన్నిటిని ప్రభుత్వమువారు వశపరచికొని నడుపుటయే భావ్యమనియు సోషలిస్టులవాదము. దాని ననుసరించి ఇంగ్లండులోని సోషలిస్టు ప్రభుత్వమువారు రైళ్ళు, విద్యుచ్ఛక్తి, బొగ్గుపరిశ్రమలను వశపరచుకొని నడుపుచున్నారు. ఇనుము ఉక్కు పరిశ్రమలను వశపరచుకొనుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. కాని ప్రభుత్వమువారు నడుపుటకు మొదలు పెట్టినతర్వాత బొగ్గుపరిశ్రమ అనుకొన్నంత సామవముగ జరుగుటలేదనియు, ఉత్పత్తి తగ్గినదనియు, కార్మికులు సమ్మెలను మానలేదనియు, ప్రభుత్వపక్షమువారే ఆక్షేపణచేయుచున్నారు. గనుక బొగ్గుపరిశ్రమగురించియు, దానికి సంబంధించిన సోషలిస్టు విధానమునుగురించియు పునరాలోచన చేయుటకు మంత్రివర్గమువా రొక కమిటీని ఏర్పాటుచేసిరి. సోషలిస్టువిధాన మొక్కటియే అనుసరణయోగ్యమని వాదించువారికి ఈ పరిస్థితులు కొంత ఆశాభంగము కలిగించినవి. మనదేశములో సోషలిస్టు విధానమును సంపూర్ణముగ ప్రవేశపెట్టవలెనని అనేకులు ఆందోళన చేయుచున్నారు. ఇంగ్లండులో బొగ్గుపరిశ్రమ విషయమై ఇప్పుడు జరుగుచుండు చర్చలను వీరు గమనించుట అత్యవసరము.

## స్మట్సు పరాజయము

ఈ నెలలో రెండు గొప్ప ఎన్నికలు జరిగెను. ఒకటి దక్షిణ ఆఫ్రికాయందును రెండవది జెకోస్లోవేకియాయందును జరిగెను. దక్షిణ ఆఫ్రికాలోని ఎన్నికలు ప్రజాస్వామ్యసిద్ధాంతము ననుసరించి జరిగినవి. జెకోస్లోవేకియాలోని నియంతృత్వ సిద్ధాంతము ననుసరించి జరిగినవి. దక్షిణ ఆఫ్రికాలో ౨౫ లక్షల తెల్లవారు ౯౦ లక్షల రంగుజాతివారు ఉన్నారు. ఎన్నికలలో పాల్గొను హక్కు తెల్లవారికి మాత్రమే కలదు. తెల్లవారిలో రెండు ప్రధానపక్షము లున్నవి. ఒకదానికి స్మట్సు నాయకుడు; రెండవదానికి మాలన్ నాయకుడు. దక్షిణ ఆఫ్రికాలోని ప్రధాన సమస్య రంగుజాతులవారికి సంబంధించిన సమస్యయే. మాలన్ పక్షమువారు రంగుజాతులవారికిని తెల్లజాతివారికిని, ఎట్టి సంబంధము ఉండరాదనిన్ని, రంగుజాతివారు ప్రత్యేకప్రదేశములలో నివాసము చేయవలసినవారనిన్ని, వారి అభివృద్ధికై తెల్లవారు ఎట్టి ప్రయత్నము చేయవలసినది లేదనిన్ని, ఎప్పటికీ తెల్లవారి పరిపాలన మొక్కటియే, ఉండవలెననియూ, రంగుజాతులకు ఏలాటిహక్కులు ఉండరాదనియు వాదించువారు. స్మట్సుపక్షములారు ఈ లాటిధోరణిలోనుండు వారే గాని, కొన్ని విషయములలో రంగుజాతివారి పురోభివృద్ధికి పాటుబడుట అత్యవసరమని వాదించువారు. ఇదిగాక వీరు బ్రిటిష్ సమాఖ్యతో సంబంధము ఉంచుకొనవలెనని కోరువారు. మాలన్ పక్షమువారు అట్లుగాక బ్రిటన్‌తో తెగ తెంపులు చేసుకొని, ప్రత్యేకరాజ్యము నొకదానిని స్థాపించుకొన

దలచినవారు. ఈ ఎన్నికలు ప్రజాస్వామ్యసిద్ధాంతము ననుసరించి జరిగిన వని చెప్పుట సత్యముకాదని కొందరు ఆక్షేపించవచ్చును. ౧౧౫ లక్షల జనములో ౨౫ లక్షలకు చెందినవారిలో కొందరికి మాత్రమే ఓటింగు హక్కులున్నప్పుడు దేశములో ప్రజాస్వామ్య మెట్లుండునను సందేహము కొందరికి కలుగుట సహజమే. కాని పరిపాలనవిధానము మొత్తముమీద ప్రజాస్వామ్యవిధానము కాకపోయినను, తెల్లవారి హక్కులసందర్భములో మాత్రము ఇది ప్రజాస్వామ్యవిధానమని చెప్పతగియున్నది. ఇచ్చట జరిగిన ఎన్నికలు ఈవిధానమును అనుసరించి జరిగినవే. స్మట్సు, మాలన్ పక్షములేగాక మరినాలుగైదు పక్షములు ఇందు పాల్గొనెను. ఇదివరకు అధికారములోనుండిన స్మట్సు మంత్రివర్గమును తక్కినపక్షములవారు ఎట్టి నిర్బంధములేక విమర్శించుచు వచ్చిరి. ఈ విమర్శనమును పత్రికల ద్వారాను, ఉపన్యాసములద్వారాను వారు చేయగలిగియుండిరి. ఇట్లేస్మట్సు పక్షమువారు తమమంత్రివర్గము చేసిన మహాకార్యములను ప్రశంసించుచు వచ్చిరి. ఈ వివిధములగు అభిప్రాయములను వోటర్లు గమనించి, తమ కిష్టమువచ్చిన వారికి వారు ఓటుచేసిరి. వోటు చేయుటలో ఏలాటి నిర్బంధములేదు. ఎన్నికలన్నియు రహస్యపద్ధతిని జరిగెను. స్మట్సుపార్టీ ఓడిపోయెను; మాలన్ పార్టీ విజయముగాంచెను. మాలన్ నాయకత్వమున క్రొత్తమంత్రివర్గము ఏర్పడనున్నది.

మాలన్ మంత్రివర్గము అధికారములోనికి వచ్చుటచేత రంగుజాతివారి పరిస్థితులు మరింత కష్టములగును. అందులో ముఖ్యముగ మన భారతీయుల స్థితిగతులు విషమించుట తప్పదు, దక్షిణ ఆఫ్రికాలో నుండు ౨౩ లక్షల భారతీయులను బాధించి, అగౌరవపరచి, వారిని ఏలాగైన తిరిగి మన దేశమునకు పంపించివేయవలెనని మాలన్ పార్టీవారి వాదము. ఈ కారణముచేత దక్షిణ ఆఫ్రికాలోని ఎన్నికలు మనకు మిక్కిలి ప్రధానములు. మన భారతీయ సోదరుల స్థితిగతులు వీటి మూలమున ఏ విధముగ మారునో మనము గమనించవలసియున్నది.

## జెకోస్లావాకియా ఎన్నికల నాటకము

జెకోస్లోవేకియాలో మూడుమాసముల క్రిందట కమ్యూనిస్టు పక్షమువారు దౌర్జన్యసాధనము నుపయోగించి అధికారములోనికి వచ్చిరి. వారికి విరోధి పక్షమందున్న వారిని బంధించియు, హత్యజేసియు తమ అధికారమును నిలబెట్టుకొనిరి. కమ్యూనిస్టు ప్రభుత్వము నిలుచుటకు ఎన్నికలు అవసరములేదు. ప్రజలు ఆమోదించినను ఆమోదించకపోయినను వారు అధికారమందుండుటకు సిద్ధపడినవారు. కాని తమకు కూడ ప్రజాస్వామ్యసిద్ధాంతము లందు నమ్మకమున్నదని ప్రకటించుటకై వారు ఎన్నికలను ఏర్పాటు చేయుట మామూలు. ఈఎన్నికలకును ప్రజాస్వామ్యము గల దేశములలోని ఎన్నికలకును హస్తిమశకాంతరమున్నది. ఈఎన్నికలలో కమ్యూనిస్టు పక్షము వారు తప్ప తక్కిన పక్షముల వారెవ్వరు అభ్యర్థులను నిలబెట్టుటకు వీలులేదు. ఇతర పక్షము లేవియు దేశములో నుండకూడని కారణముచేత కమ్యూనిస్టు పరిపాలనములోని మంచిచెడ్డలను విమర్శించి ప్రజలకు తెలుపువారెవ్వరు లేరు. అట్టి విమర్శలచేయు వార్తాపత్రికలు దేశమందుండరాదు. కమ్యూనిస్టుపక్షమువా రొక్కరే అభ్యర్థులను నిలబెట్టెదరు. వారికే ఓటుచేయుటగాని చేయకపోవుటగాని జరుగును. ప్రతిఓటరు నిర్బంధముగ ఓటుచేయవలెను. అతడు ఇతరులకు తెలియక రహస్యముగ ఓటుచేయుటకు తగిన ఏర్పాటులు లేవు. ఓటు చేయు సమయములో కమ్యూనిస్టుపక్షమువారు చుట్టుపట్ల నుండెదరు. ఆ పక్షమునకు విరుద్ధముగ ఓటుచేయుటకు ప్రతివానికి భయమే. ఈ కారణముచేత దేశములోని నూటికి ౯౫ నుండి కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థులకే ఓటుచేయుట తప్పదయ్యెను. ఈలాటి ఎన్నికలను జరిపి, ప్రజలందరు కమ్యూనిస్టుపక్షమునందు మాత్రమే అభిమానము కలవారనియు, కమ్యూనిస్టుల అధికారమునకు ప్రజల ఆమోదమే ఆధారమనియు వారు ప్రకటించుచున్నారు.

## మద్రాసు రాష్ట్రము

ఈ నెలలో మన రాష్ట్రమందు గమనింపదగిన ప్రధాన విషయము ప్రభుత్వమువారికిని కమ్యూనిస్టు పక్షమువారికిని సంభవించిన ఘర్షణయే. ముఖ్యముగ మలబారుజిల్లాయందు కమ్యూనిస్టులు అనేక అల్లరులను లేవదీసి, ప్రభుత్వమువారిపై తిరుగబడి, అశాంతికి కారకులైరి. వారిని అణచుటకు ప్రభుత్వమువారు పోలీసుదళము నేగాక సైనికదళమునుకూడ ఉపయోగించవలసివచ్చెను. ప్రాణనష్టము ఎక్కువగ కలిగెను. ఆంధ్రజిల్లాలలో కొన్నిటియందుకూడ నట్టి ఘర్షణయే సంభవించెను.

దీనికి ఫలితముగ ప్రభుత్వమువారు ఒక ఆర్డినెన్సు చట్టమును గావించి అమలులోనికి తెచ్చిరి.

ఇది వ్యక్తిస్వాతంత్ర్యమునకు మిక్కిలి భంగకరమైన చట్టము. దీని క్రింద అరెస్టు చేయబడిన వానిని ఎంతకాలమైనను పోలీసువారు వారి వశమందుంచుకొనవచ్చును. బెయిలుమీద వారిని విడిపించుట సాధ్యముకాదు. ఇట్టి కేసులలో హైకోర్టు జోక్యము పుచ్చుకొనుటకు వీలులేదు. ఈ కారణము చేతనే ఈ చట్టము వ్యక్తిస్వాతంత్ర్యమునకు ప్రతిబంధకముగ నున్నదని చెప్పవలసియున్నది.

దీనిమూలమున నిర్దోషులగువారుకూడ పోలీసువారివశమగుటయు శిక్షింపబడుటయు జరుగును. ఇదియే ఇందులో ఉండు ప్రమాదము.

దోషులను శిక్షింపరాదని చెప్పువారెవ్వరులేరు. కాని ఎవరు దోషియో ఎవరుకాదో నిర్ణయించు అధికారము పోలీసులకును కార్యకర్త శాఖవారికిని ఉండరాదు. అది స్వాతంత్ర్యముగల కోర్టుకే ఉండవలెను. నిష్పక్షపాతముగ విచారణచేయగలవారు కోర్టువారే. అనుమానముపై పోలీసువారు అరెస్టుచేసినవారిని హైకోర్టువారు విచారణచేయుటకు అవకాశము కల్పించని చట్టము చాల ప్రమాదము. ఇందుమూలమున చట్టబద్ధమైన పరిపాలనమునకు బదులు పోలీసు పరిపాలనము రాష్ట్రములో వ్యాపించినది. కనుక ఇంతటి విపరీత చట్టమును రద్దుచేయుటయే శ్లాఘ్యము.

## హైద్రాబాద్

స్వదేశసంస్థానములన్నియు ఇండియా ప్రభుత్వమునకు లోబడుటకు అంగీకరించినను హైదరాబాదు మాత్రము అట్లుచేయుటకు సిద్ధపడకపోవుటయేగాక దేశమందు అశాంతి వ్యాపించునట్టి ప్రయత్నములలోనికి దిగి ప్రజలందరికి ప్రమాదమును కల్పించు పరిస్థితులను తెచ్చిపెట్టుచున్నది. సంస్థానమును నైజాం పాలించుటకు బదులు "రజాకర్లు" అను స్వచ్ఛంద మహమ్మదీయ సైనికులు వారి నాయకులు పాలించుచున్నారు. వీరి దుష్కృత్యముల మూలమున లక్షలకొలది హిందువులు సంస్థానమును వదలి పారిపోవలసివచ్చెను, హిందూవర్తకులు సాహుకార్లు వారి ధనమును ఆస్తులను కోల్పోయిరి. స్త్రీలకు మానభంగము కలిగెను. రోజురోజుకు పరిస్థితులు విషమించుచున్నవి. గతమాసములో ఈరజాకర్లు మద్రాసు బొంబాయి సరిహద్దు జిల్లాలలోని ప్రదేశము లనేకములను ప్రవేశించి ప్రజలను చంపివారి ఆస్తులను దోచుకొని ఇతరవిధములవారిని బలాత్కరించిరి. తుదకు మద్రాసు బొంబాయిలమధ్యన నడుచు రైళ్ళపైబడి, ప్రయాణీకులకు ఎంతో నష్టమును కలిగించిరి.

దీనినంతను చూచుచు మన ప్రభుత్వమువారు ఊరక ఉండవలసినదేనా? లేక ఇట్టివి జరుగకుండుటకై తగిన ప్రతీకారము చేయవలెనా? ఆ ప్రతీకారము ఎట్టిదిగ నుండవలెను? దానిని చేయుటకు సమయము కాలము ఎప్పుడు? అను సమస్యలు ఇప్పుడు బయలుదేరి అతి తీవ్రరూపమును ధరించియున్నవి.

దీనినంతను చూచుచు మన ప్రభుత్వవారు ఊరకుండుట అనుచితమన్న విషయమును గురించి ఎట్టి అభిప్రాయభేదము లేదు. సంస్థానమునుండి వచ్చు దుండగులమూలమున భారతీయులకు కలుగు ప్రమాదములు దినదినాభివృద్ధియగుచుండినను మన ప్రభుత్వము ఎట్టి కఠినచర్యలను తీసుకొనకుండుట వారి మర్యాదకును ప్రజల సౌఖ్యజీవితమునకును భంగకరముకాదని చెప్పువాడెవ్వడులేడు. ఇదిగాక దక్షిణ ఇండియానుండి ఉత్తర ఇండియాకు వెళ్లు రైళ్లు హైదరాబాదుసంస్థానము మీదుగ వెళ్లవలసియున్నది. వాటిరాకపోకలకు ఎట్టి ప్రమాదము సంభవించినను భారతప్రభుత్వము స్తంభించిపోవును. కనుక సంస్థానమునకు తగినప్రతీకారము చేయుట అత్యవసరమని స్పష్టము,

కాని ఈప్రతీకారము ఎట్టిదిగ నుండవలెను? సాధారణముగ పరిపాలకులు సామదాన భేదదండోపాయములను నాల్గింటిని ఉపయోగించసిద్ధులై ఉండవలెను. ఈసందర్భములో దానోపాయము భేదోపాయము మన ప్రభుత్వమునకు అంత అనుకూలించునవికావు. అందుచేత సామము దండము మాత్రమే మిగిలియున్నవి. ఈ ఏడెనిమిది మాసములుగ వీరు సామోపాయమొకదానిని మాత్రమే ప్రయోగించుచున్నారు. ఇతర సంస్థానముల నన్నిటిని ఈ ఉపాయముద్వారా వీరు వశపరచుకొనగలిగిరి. హైదరాబాదుకూడ దీనికి లొంగునని వారు తలచుచున్నట్లు కనుపించుచున్నది. ఇందులో మన ప్రభుత్వమువారు కొంతవరకు పొరబడిరేమో! నైజాం యుద్ధసన్నాహము చేయుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇదిగాక కాలము మించుకొద్దీ సంస్థానములోని హిందువులు పడుచుండు బాధలు అధికములగుటయేగాక పాకిస్థాన్ తత్త్వము ఎక్కువగ నాటుకొనును.

దానిని రూపుమాపుటకు ప్రయోగించవలసిన దండము ఎక్కువ తీవ్రముగ నుండవలసివచ్చును.

ఈ తత్వమును ఇదివరకే రజాకార్లు చాలవరకు ఆచరణలోనికి తెచ్చిరి. ప్రస్తుతము హైదరాబాదులో నూటికి, ౧౫ మంది మహమ్మదీయులును ౮౫ మంది హిందువులును ఉన్నారు. హిందువుల సంఖ్యను తగ్గించుటయు మహమ్మదీయుల్ల సంఖ్యను పెంచుటయు పాకిస్థాన్ తత్వములో ఒక ప్రధానాంగము. గత ఏడెనిమిది మాసములలో ఈ అంగము చాలవరకు బలపడినది. ఇండియాలోనుండి ఏడెనిమిదిలక్షల మహమ్మదీయులు హైదరాబాదుకు వెళ్ళి అచ్చట స్థిరనివాసము ఏర్పరచుకొనిరి. రెండుమూడు లక్షల హిందువులు హైదరాబాదునుండి వెళ్ళిపోయిరి. హైదరాబాదుకు వలసవెళ్ళు మహమ్మదీయుల సంఖ్య తగ్గలేదు. ఇదిగాక హరిజను లనేకులను బలాత్కరించి మహమ్మదీయ మతములో కలుపుకొనుట రజాకార్ల రాజనీతిలో ఒక భాగము. ఇదికూడ అవిచ్ఛిన్నముగ జరుగుచున్నది. ఈ రెండిటి ఫలితముగ సంస్థానములోని మహమ్మదీయుల సంఖ్య వృద్ధిగాంచుటయు, హిందువుల సంఖ్య తగ్గుటయు జరుగును. ఇట్లే మరికొంతకాలము గడిచిన యెడలహిందూమహమ్మదీయులసంఖ్య సమానమగుటయో మహమ్మదీయుల సంఖ్య ఎక్కువగుటయో జరుగును. అందుమూలమున పరిస్థితులన్నియు ఇప్పటికంటె క్లిష్టతరములు కాగలవు. ఇది శాశ్వతమైన ప్రమాదము. దీని నుండి తప్పించుకొనుటకు ఉపాయము లేదు. అట్టి స్థితి ఏర్పడినయెడల హైదరాబాదు ఇంకొక పాకిస్థానముగును.

దీనినిబట్టి తేలినది ఏమనగా సామోపాయమును అంటిపెట్టుకొని కూర్చుండుట మిక్కిలి ప్రమాదము. దండోపాయ ముపయోగించుట అత్యవసరము.

ఇంతమాత్రము మన ప్రభుత్వమునకు తెలియదా? దండోపాయమును వా రుపయోగించకుండుటకు ప్రబల కారణములన్నవేమో ? అని కొందరడుగవచ్చును.

మనము ఊహించదగిన కారణములు రెండే. మొదటిది మనవద్ద తగినంత సైనికబలము లేకపోవుట. రెండవది దండోపాయముమూలమున హైదరాబాదులోని మహమ్మదీయులకంటె హిందువులే ఎక్కువ బాధను నష్టమును అనుభవింతురనుకొనుటకు. కాశ్మీరములో ఇంకను యుద్ధములు ముగియలేదు. ఇప్పుడు పాకిస్థాన్ సైనిదళములు ప్రత్యక్షముగను బాహాటముగను కాశ్మీరమును ప్రవేశించియున్నవి. అచ్చట మనము చేయుచుయుద్ధము కొంపజాతులవారితో మాత్రమే కాదు. పాకిస్థాన్ సైన్యములతోకూడ చేయుచున్నాము. ఇట్టి సందర్భములో హైదరాబాదుతో యుద్ధముచేయుటకు తగినంత బలము మన కున్నదా ? ఇదిగాక మధ్యప్రాచ్యములోని మహమ్మదీయరాజ్యములు హైదరాబాదు విషయములో జోక్యము కలిగించుకొనగలవు. బ్రిటిష్‌వారు వారికి సహాయముచేసినను చేయవచ్చును. కాశ్మీరు విషయములో అమెరికనులుకూడ పాకిస్థాన్ పక్షముందే ఉన్నారు. గనుక హైదరాబాదులో యుద్ధమనగా పాకిస్థాన్‌తోడను, మధ్యప్రాచ్య మహమ్మదీయరాజ్యములతోడను యుద్ధమన్నమాట. రెండవ కారణము గురించి విశేషముగ వ్రాయవలసినది లేదు. ఎవ్వరైనను ఎక్కువ నష్టపడువారు హిందువులె. ఈ కారణము చేత దీనిని గురించి మనము ఎక్కువగ ఆందోళన పడవలసినది లేదు. హైదరాబాదును దానికి తోడ్పడు ఇతర రాజ్యములను ఓడించుటకు తగిన బలము మనకు ఉన్నదా లేదా అనుటయే మనమాలోచించవలసిన విషయము. దీనికి ప్రభుత్వము వారే గాని మరెవ్వరు జబాబు చెప్పలేరు. సామోపాయము విఫలమైనదనియు దండోపాయమొక్కటే మిగిలి యున్నదనియు మనము చెప్పవచ్చును.

దండోపాయ మనగా సైనికబలప్రయోగ మొకటి మాత్రమేకాదు. హైదరాబాదునకు ఏ వస్తువు కావలసినను ఇండియా మీదుగనె వెళ్లవలెను. మందుగుండుసామానులు, పెట్రోలు, ఆహారపదార్థములు— అన్ని ఈలాటివే. ఇవి వెళ్లకుండ బంధించుటకూడ దండోపాయమే. ఈ ఉపాయమును వెంటనే ప్రయోగించవచ్చును. ఇందుమూలమున హిందూ ప్రజలు ఎక్కువగ బాధపడెదరుగాని అది ఎప్పటికీ తప్పదు గదా? (1-6-48)

# పూర్వాపరాలు

[కథానిక]

శ్రీ కొమరగిరి నరసింహారావు

అందరిలాగానే అతనికీ చిన్నతనంలో పెండ్లి అంటే ఏమిటో తెలిసేది కాదు. పెండ్లయితే తనకు భార్య వస్తుందనీ, తన తల్లిదండ్రులకు కోడలు వస్తుందనీ మాత్రమే తెలుసు. అంతకు మించి దానిలో ఉండే అంతర్యమేమిటో అతనికి స్ఫురించేది కాదు. దాన్ని గురించి ఆలోచించి అర్థంచేసుకునే పరిపక్వత యింకా అతని మనస్సులో ఏర్పడలేదు. అలాంటి చిన్నతనం నుంచే అతనికి పెండ్లిరాయబారాలు ప్రారంభమైనాయి. అతని అభిప్రాయాన్ని అడిగినప్పుడు పైకి 'యిప్పుడక్కరలేదని' చెప్పినా లోలోపల ఎంతో ఉత్సాహపడుతూనే ఉండేవాడు. ఏభావాన్నైనా మనసులోనే అణచుకుని పైకి గంభీరంగా కనిపించే గుణం అతనికి సహజంగానే అబ్బింది.

అప్పటినుంచే మనసులో ఎన్నో కలలు కనేవాడు. ఎన్నో చిత్రాలు చిత్రించుకొనేవాడు. ఎన్నో రూపులను కాంచగలిగేవాడు. ఎన్నో మనోహర స్త్రీ మూర్తులను భావవీథిలో దర్శించి యింట్లో తన సమక్షంలో నేత్రపర్వంగా చరిస్తున్నట్లు భావించుకుని సంతోషపరవశుడయ్యేవాడు. తన ప్రణయమూర్తి మన్మథతాపపీడనచే వివశమైపోయే విరహిణి ప్రబంధనాయిక కాదు. తెలియని దేవలోకంనుంచో ప్రత్యక్షమయ్యే నిర్గుణ దివ్యమోహన తేజోమూర్తిమాత్రమే. ఆమూర్తి ఎక్కడ ఉందో అతనికి తెలియదు. కాని ఎక్కడో ఒకచోట తప్పకుండా ఉండేఉంటుంది అనే నిశ్చయానికి రాగలిగేవాడు.

ఆ ఎంతకాలంగానో కలలు కంటున్న ముహూర్తం సమీపించేసరికి అతను యౌవనపు తొలి వెలుగులో అడుగుపెట్టాడు. తాను సర్వస్వతంత్రుడు. వెనుకటి కాలంలోలాగా తల్లిదండ్రులు చేసుకునే బొమ్మలపెండ్లిండ్లలోని ఒక బొమ్మలాగా ఉండటం అతను ఊహించనుగూడా ఊహించలేకపోయినాడు.

కాలం మారిపోయింది. ఆ కాలవేగంలో మనస్సులూ, ఆచారాలూ, మానసప్రకృతీ కూడా మారిపోతున్నాయి. అంతా నాయిష్టమే అనుకున్నాడు. అవును, అంతా నీయిష్టమే నన్నారు తలిదండ్రులు.

వధువును చూచాడు. నచ్చింది.

"ఇంగ్లీషు అట్టే చదువుకోలే" దన్నారు.

"ఫరవాలేదులే" అనుకున్నాడు. "చదువూ, నాగరకతా ఉండగానే సరేనా, సంస్కృతి లేకపోయింతరువాత. ఇది ఉంటే అదిలేకపోయినా ఫరవాలేదు. తరువాత అవే వస్తాయి. సంస్కృతి సంప్రదాయసిద్ధంకనుక అది సహజంగానే ఉండేఉంటుందిలే" అని సమాధానపఱచుకున్నాడు.

"మరి సంగీతంగూడా రాదే!" అని మరో ప్రశ్న.

"ఓ, అదేముంది! కావాలనుకుంటే తరువాత చెప్పించుకోవచ్చులే" అని తృప్తిపడ్డాడు.

"కట్నమేమీ యివ్వలేమో!" అని మళ్లీ కొంత గాను.

"మనం కావాలనుకోటం లేదుగా!" అని జవాబుచెప్పుకున్నాడు.

"సరే, వాడి యిష్టం. వాడికి నచ్చితే సరి." అని సరిపెట్టుకున్నారు తల్లిదండ్రులు.

౨

కాలప్రవాహంలో ఎన్నో మార్పులు! ఒక శిల మీదినుంచి మరొక శిలమీదికి ఉన్మత్తవేగంతో పాకుతూ, దూకుతూ ప్రవహిస్తూ నిర్ఝరిగా నున్నప్పటి నదికీ, క్రమంగా సాగిపోయి విశాలమై గభీరమై సాగర ప్రియదర్శనాభిలాషతో నిండుచూలాలిలాగా ప్రశాంతంగా ప్రవహిస్తూన్నప్పటి నదికీ ఎంతో భేదముంది!

అతను యింకా యువకుడే. యౌవనపటిమ యేమాత్రమూ సడలలేదు. కాని యౌవన వసంతోదయంలోని రాగరక్తిమలు యిప్పుడు కొంచెం కనుమాపుగా ఉన్నాయి. ఆ నిర్ఝరిలాటి ఉద్వేగం యిప్పుడు కనుపించదు. వయస్సులోని యీ మార్పుతో మనస్సులో క్రమంగా పాదుకుంటున్న స్థైర్యపు ఛాయలు యిప్పుడే కొంచెం స్ఫుటంగా గోచరిస్తున్నాయి. గతించిన కొద్దిజీవితకాలంలోనూ గడించిన అనుభవంతో యిప్పుడు కాస్త వెనుకా ముందూ చూడగలిగిన దృష్టిని సంపాదించుకున్నాడు.

తన ఆశలూ, ఆశయాలూ కేవలం నిష్ఫలం కాకపోయినా రానురానూ యిలా పరిణమిస్తాయని అతను ఎన్నడూ అనుకోలేదు. ప్రతిమానవుడి జీవితంలోనూ యిలాగే జరుగుతూంటుందా అనే సందేహం యిప్పుడు ఒక్కొక్కమాటు అతనికి కలుగుతూంటుంది. జరుగుతూంటుందేమో అనికూడా అనుకుంటాడు. అయినా తానూ సామాన్యమానవమాత్రుడేనా? వారికీ, తనకూ ఏమీ భేదంలేదూ? కవి అనీ, చిత్రకారుడనీ, నటుడనీ, కళోపాసకుడనీ యింకా ఏమేమో అనీ చాలామంది తననుగురించి అనుకోడం లేదూ? అందుకు ఎంత మందో తనను అభినందించటం లేదూ? తనతో పరిచయం చేసుకోవాలనీ, స్నేహం చెయ్యాలనీ ఎంతమందో అభిలషిస్తూంటారే. మరి యిలాంటి తనకూ, ఆమెకూ ఎందు కంత సామరస్యం కుదరటం లేదు?

అది అతని కో పెద్ద సమస్య.

ఆసమస్య ఒక్కొక్కమాటు ఎంతో తేలిగ్గా విడిపోతుంది. మళ్లీ అంతలో ముడివడి అభేద్యమై పోతుంది. అప్పుడు తర్కంలోకి దిగుతాడు. పూర్వాపరాలు పరిశీలిస్తాడు. పోనీ, తనలో ఏమన్నా తప్పుందా? తన తప్పు తాను తెలుసుకోవటం ప్రపంచంలో ఎంతో కష్టమైన కార్యం అని అతనికి తెలుసు. అయినా మహనీయుల జీవితచరిత్రలలోని కొన్ని ఘట్టా లతని కప్పుడప్పుడూ జ్ఞాపకంవస్తూవుంటాయి. అవి చిరస్మరణీయాలు. తత్ఫలితంగా అతని కీ గుణం కొంత అబ్బింది. అతను కేవలం తనలోపాలను తాను తెలుసుకొనలేని గురిగింజ కాడు. అత్యంతసునిశితంగా ఆత్మపరీక్ష చేసుకున్నాడు. తనలో తప్పేమీ కనుపించలేదు. దానితో ఏమీ తోచకుండా అయింది. వెర్రెత్తిన ట్లనిపించింది.

కొంచెం స్తిమితం చిక్కించుకుని ఆలోచనలో పడ్డాడు. అతను కళోపాసి. సౌందర్యోపాసి. ప్రతి వస్తువులోనూ అతనికి ఏదో అందం, ఏదో నూతనత్వం గోచరిస్తూంటుంది. ఆ అందం తలుచుకున్నప్పుడల్లా ఆనందాన్నిస్తుంది.

అయినా అతను ఏ స్వాప్నిక జగత్తులోనో, ఏ భావకల్పితతరంగాల్లోనో సౌందర్యాన్ని సృష్టించుకుని ఆధ్యాత్మికమూ, అవ్యక్తమూ అయిన ఆనందంకోసం ఆరాటపడడు. అతని దృష్టిలో జీవితమే అందమయింది. నిత్యజీవితంలో ప్రతి చిన్నఘట్టమూ, ఆ ఘట్టంలోని ప్రతిచిన్నవిషయమూ అందంగానూ, ఆనందదాయకంగానూ ఉండాలి. అన్ని వస్తువులూ యింట్లో అందంగా అమర్చబడిఉండటం అతనికి యిష్టం. అత నలాగే చేస్తూంటాడు. ఏవస్తువు దాని స్థానాన్ని తప్పినా అతనికి అపరిమితమయిన కోపం. సహజంగా కోపస్వభావం కాకపోయినా అతి సున్నితమైన మనస్సవటంవల్ల తన భావాలకు విరుద్ధమైన ఏచిన్న పనియైనా అతను సహించలేడు. ఆ విషయంలో అతనికి ఓర్పు చాలా తక్కువ. అది ఒక లోపమే కావచ్చు.

మరి ఆమెకో — సహజంగా సోమరితనం కొంచెం అధికం. అందువల్ల అతని అభిప్రాయాలూ

భావాలూ అంటే ఆమె కెంతో గౌరవమే అయినా ఆచరణలోకి వచ్చేసరికి తదనుగుణంగా నడుచుకోలేక పోతున్నది. అదే అతను సహించలేనిది. బయట నలుగురిలో తిరుగుతూన్నప్పుడు ఎలాంటి కఠినహృదయులనైనా, ఎలాంటి క్లిష్టసన్నివేశాలనైనా ఒక్క చిరునవ్వుతో జయించగలిగే అతనికి యింట్లో యిలాంటి చిన్నవిషయాలుగూడా అత్యంత కోపకారణా లవుతూండటం శోచనీయమే. ఈ విరుద్ధప్రకృతుల మధ్య రాజీ కుదుర్చుకోటం అతనికి ఎంతో కష్టతరమై పోయింది.

## 3

ఆనాటి సాయంకాలం ఏదో పనిఉన్నవాడిలాగా త్వరత్వరగా క్రాపుదువ్వుకుని చెప్పులు తొడుక్కొని బజారుకు బయలుదేరాడు. ముఖంలోమాత్రం ఉత్సాహచిహ్నాలేమీ కనిపించటంలేదు. వీధిగుమ్మం దాటి బయట అడుగుపెట్టేసరికి ఎదురుగా గోడమీద సినిమాకాగితం కనుపించింది. చాలా చక్కటి చిత్రం. ప్రఖ్యాతనటీనటులు నటిస్తున్నారు. దానిమీదినుంచి దృష్టి మరలించి ముందుకు సాగాడు. ముఖంలో ఎందుకో విషాదరేఖలు గోచరిస్తున్నై. నడుస్తున్నా అతని మనస్సెక్కడో ఉంది. చూపు లెక్కడో అర్థంలేకుండా శూన్యాన్ని ఛేదిస్తున్నై.

ఆమే, అతనూ కలిసి సినిమాకు వెళ్ళి ఎన్నేళ్ళయిందో! ఏం, యిప్పుడుమాత్రం ఎందుకు వెళ్ళకూడదు? ఆర్థికదుస్థితిమూలంగానా? కాదే. మరి వ్యవధి లేకనా? అదీకాదే. ఏమో, ఎందుకో, అతనికి దానిమీద మోజు తగ్గిపోయింది. ఆరోజులు మళ్ళీరావు. కాలచక్రపరిభ్రమణంలో ఆరోజులు మళ్ళీ పునరావృత్తమైనా ఆ నిర్మలయౌవనోత్తేజం తిరిగి ప్రాప్తించదు. ఆ శరద్రాత్రులు పునఃగోచరించినా నాటి ఆనందానుభూతులు తిరిగి నేడు లభించవు.

ఆలోచనామగ్నుడై అడుగులో అడుగులువేస్తూ ఏదో యేనాడో పారవేసుకున్న వస్తువుకోసం వెతుకుతూన్నట్టుగా దిక్కులుచూస్తూ పిచ్చివాడిలాగా అతనెంతదూరం తిరిగాడో అతనికే తెలియదు.

ఇంకా సూర్యాస్తమయం కాలేదు. కాని సూర్యుడుమాత్రం కనిపించటం లేదు. అతను సిమెంటు గొడుగుక్రింద నిలుచున్న పోలీసువాడి ఎర్రటోపీకేసి శూన్యంగా చూస్తూ నిలుచున్నాడు. చూడగాచూడగా కండ్లుచెదిరి టోపీ రెండుగా కనుపించింది. మెల్లిగా కండ్ల అద్దాలు తీసి తుడిచి మళ్ళీ పెట్టుకుని యిల్లు జ్ఞాపకం వచ్చి వెనక్కు తిరిగేసరికి ఎవరో భుజంమీద చెయ్యివేసిన ట్లనిపించింది. అతను ఆశ్చర్యచకితుడు కాలేదు. మెల్లిగా వెనుదిరిగిచూశాడు.

"ఏంరోయ్, ఎంత మారిపోయినావురా! ఇందాకట్నుంచీ చూస్తూ నీవు అవునా కాదా అని సందేహిస్తున్నాను" అన్నాడు ఆ వచ్చిన యితని పాతస్నేహితుడు.

ఇతని ప్రాణం లేచివచ్చింది. తనను ఎవరయినా "ఏంరా" అని అంత ఆప్యాయంగా పిలువగా విని ఎంతకాలం అయిందో! కండ్లఅద్దాలు తుడుస్తూ సంతోషాన్ని ప్రకటించి నవ్వాలని ప్రయత్నం చేశాడు. నోరు నవ్వినా ఎప్పుడూ నక్షత్రాలలాగా మిలమిలా మెరిసే అతని కండ్లుమాత్రం నవ్వలేక వెలవెల పోయినై. కొంచెం జాలిగానవ్వి, "ఎప్పుడొచ్చావురా, అంతా బాగున్నారా?" అని పరామర్శించాడు మిత్రుణ్ణి.

"ఆ, మధ్యాహ్నం వచ్చాను. మీ యిల్లెక్కడో తెలిసిందికాదు. లేకపోతే అక్కడికే వచ్చేవాడిని. ఇక్కడే మాపినతండ్రిగారియింట్లో దిగాను."

"అలాగా. రా, వెడ్దాం రా, యింటికి; చూతువుగాని" అని మిత్రుణ్ణి ఆహ్వానించాడు.

ఇరువురూ యింటివైపు వెళ్లారు. ఇతన్ని చూస్తే పాపం మిత్రుడికి ఆశ్చర్యమూ, విచారమూ కూడా కలిగాయి. ఎలాంటివాడు ఎలా మారిపోయినాడు! పూర్వం వాళ్లిద్దరూ కాలేజీలో కలిసి చదువుకొనేరోజుల్లో అత నెంత ఉత్సాహంగా ఉండేవాడు! ఎన్నో ఆశయాలతో, ఏవో మహత్తరాదర్శాల కోసం అర్రులు చాస్తూ ఏవేవో మనోహరస్వప్నాలు కంటుండేవాడు. శత్రువులనుగూడా లోబఱచుకొన

గలిగే అతని మధురవాక్చాతురీగరిమ అతని కెంతో మంది మిత్రులను సంపాదించిపెట్టింది. మరి యిప్పు డదంతా ఎక్కడ అణగారిపోయింది? ఇంత కొద్ది కాలంలో ఎందు కిలా తయారయినాడు? ఏమిటో, వీటన్నింటికీ కారణాలు కనుపించవు.

ఇల్లు సమీపించింది. అతను మెల్లిగా గేటు తీశాడు. అది కిర్రుమని సన్నగా ధ్వనిచేసింది.

"నాన్నా, నాన్నా! మరే, అమ్మ, కప్పు, చాచలూ, పగలగొట్టింది నాన్నా" అని అతని రెండో కొడుకు మూడేళ్ల పిల్లవాడు పరుగెత్తుకుంటూ ఎదురుగా వచ్చి చెప్పాడు.

"ఊఁ. సరేలే. ఇవ్వాళ కొత్తేముంది? రోజూ యింటికొచ్చేసరికి యేదో ఒకటి తయారు." అని కొంచెం విసుక్కొని, పిల్లవాణ్ణి చెయ్యిపట్టుకొని లోపలికి తీసుకునివెళ్లి, స్నేహితుడికి ఒక కుర్చీ చూపించి, కూర్చొనమని, తాను లోపలికి వెళ్లాడు.

"నాన్నా, యిదిగో చూలూ, యీముక్కలు చూలూ" అన్నాడు ఆ చంటివెధవ అంతటితో మానెయ్యక అక్కడ పడివున్న పగిలిపోయిన పింగాణీ ముక్కలకేసి చూపిస్తూ.

"పోతేపోయింది; అవతల పారెయ్యక ఎందు కింకా ఉంచావ్, యింటినిండా అసహ్యంగా?"

అక్కడే కూర్చుని ఉంది ఆమె లైట్లు తుడుస్తూ.

"అబ్బ! అంత ఖరీదుగల వస్తువు పోతేపోయింది గాని అక్కడుంటే అసహ్యంగా ఉన్నాయని విసుగ్గా ఉందిగాబోలు!" అని విసిరింది ఆమె అతనిప్రశ్నకు సమాధానంగా.

"ఉంచడా యేం? ఎవడు పగలగొట్టమన్నాడూ, ఎవడక్కడ పోగుచేసి దాచిపెట్టమన్నాడు?"

"ఒకరంటే పగలగొడ్తావా ఏమిటండీ, అల్లా అంటారూ? ఏదో ఖర్మంజాలక చేయి జారింది. నాకు మాత్రం అంత యిష్టమా యేం పగలగొట్టాలని?"

"ఇష్టమూ, గిష్టమూ ఏమీ అక్కరలేదు, కాస్త ఒళ్ళు దగ్గిరపెట్టుకుని తిరుగుతుంటేసరి. ఊరికే ఎందుకు పనులుకై, అంత తోలుచేతులా ఏం?"

"తోలుచేతులో బంగారపుచేతులో, ఏంచేస్తాం మరి? దేవుడిచ్చిన వర్వ."

"ఊఁ. సరేలే. ఇక చాలించు. మాటకుమాట జవాబు చెప్తుంటే సరి, కడుపునిండుకుంది." అని అతను దొడ్లోకి వెళ్ళాడు. ఆమె యింకా ఏవేవో అంటూనేవుంది. మాటకు మాట చేటు. అతను వినుపించుకోలేదు. ఈమాటలన్నీ తన స్నేహితుడెక్కడవిన్నాడో అని అతను తనలోతాను ఎంతో మథనపడ్డాడు. ఇంట్లో ఇల్లాంటివి జరుగుతూవుండటం రానురానూ అలవాటయిపోయింది. ఒక్కొక్కమాటు అతనికి ఒళ్ళు మండిపోతుంది. కాని పొరపాటునగూడా యింత వరకూ ఆమెమీద చేయిచేసుకోలేదు. ఎంత దారుణబడబాగ్నినయినా తన చల్లనికడుపులో దాచుకొనగలిగిన రత్నాకరుడతను. కోపంవచ్చినప్పుడు నాలుగు బాది దాన్నంతా వమ్మరించి మరుక్షణంలో ప్రేమాతిశయం చూపించేవా రెంతమంది లేరు? నిజంగా అలా ఉన్నా బాగుంటుంది. ఆ కోపమూ, ఉద్రేకమూ అలా ఉపశమించిపోతాయి. మరి అతను అల్లాంటివాడు కాదు. ఎంతతీవ్రమైన కోపాన్నైనా దిగమ్రింగిపూరుకుంటాడు. అందుకే అంత బాధపడి ఆవేదనతో కుమిలిపోతాడు. అన్నిటికంటే ఎక్కువగా, తాము ఇల్లా చీటికీమాటికీ కలహించుకుంటూంటే ఎవరైనా వినిపోతారేమో అని లోలోపల బాధపడిపోతూంటాడు. అందుకనే తమ పోరాటం తీవ్రస్వరూపాన్ని తాల్చి ప్రతిమించినప్పుడు మెల్లిగా బయటికి జారుకుని తిరిగితిరిగి ఎప్పుడో యిల్లు చేరుకుంటాడు.

ఇప్పుడు తమ యిరువురిమధ్యనా జరిగిన సంభాషణను తనమిత్రుడు విన్నాడేమో ననే భయంతో కొంచెంసేపు దొడ్లో తారట్లాడి మెల్లగా లోపలికి చేరుకున్నాడు.

మిత్రుడు, పాపం, అతని వైపు జాలిగా చూసి లేస్తూ, " వస్తానురా. చీకటిపడుతోంది. మళ్లీ రేపు కలుసుకుంటాను." అన్నాడు.

అత నేమీ మాట్లాడలేకపోయినాడు. ఏదో తప్పుచేసినవాడిలాగా మిత్రుడి వెనకాల మెల్లగా అడుగులు వేస్తూ బయటికివచ్చాడు.

"ఏంరా, ఏమైనా కొత్తబొమ్మలు వేశావా? మళ్లీ పద్యాలేమైనా రాశావా? అంతటితోటే స్వస్తి చెప్పావా?" అని చిరునవ్వుతో ప్రశ్నించాడు మిత్రుడు.

"ఆఁ. ఏమిటోరా. ఏమి చెప్పటానికీ సిగ్గుగా ఉంది. సంసారం నెత్తినపడి పెరుగుతూన్నకొద్దీ యిలాంటివాటి కేమీ ఆస్కారం లభించేట్టు కనుపించటంలేదు" దీనంగా జవాబు చెప్పాడు.

మిత్రుడికి కేమిటో అంతా అర్థమైనట్లయింది.

"నిజమే. ఇలా ఎందుకు జరుగుతూంటుందీ అంటే మనం సరియైన జవాబు చెప్పలేం. సంసారంలో పడి ఎంతమంది తమ ఆశయాలకు యిలా స్వస్తి చెపుతూంటారో మనం ఊహించలేము. అయినా అటు లౌకికవిచారాల్లో మునిగి వీటిని బుద్ధిపూర్వకంగా వదులుకుంటారు అని అంటానికి వీల్లేదు. పోనుపోనూ బాధ్యతలూ, బాధలూ, బంధనాలూ ఎక్కువై సంతోషం తగ్గిపోయి నిరుత్సాహంగా జీవితాన్ని యంత్రంలాగా లాగే స్థితిలోకి వచ్చినప్పుడు మానవుడి ఆశయాలూ, ఆశలూ క్రమంగా వాటంతట అవే సమసిపోతా యన్నమాట. అంతే. వాటిని స్వయంగా వదులుకోవటం అంటూ ఉండదు. అయినా ఫరవా లేదులే. నిరుత్సాహపడ్తే ఎలా నీలాంటివాడు? ఎప్పుడూ యిల్లాగే ఉంటామా? భవిష్యత్తెంత ఫలవంతమో మన కేం తెలుస్తుంది." అని ముగించాడు.

ఒక్క నిమిషం నిశ్శబ్దంగా గడిచింది.

"సరే, వస్తానురా" అని మిత్రుడు కదిలాడు.

అతను ఆలోచనలో పడి అలాగే నిల్చున్నాడు. తన స్నేహితుడు చెప్పినదాంట్లో ఎంతయినా పరమార్థం ఉంది. అదంతా మూర్తీభవించి కండ్లఎదుట గోచరించినట్లయింది. ఇంక అక్కడ నిల్చోలేకపోయినాడు. కండ్లు చీకట్లు క్రమ్మినై. బయట కూడా అంతా అంధకారం ఆవరించిపోయింది. ఆ అంధతమసంలో అతని కేదో ఆశాకిరణం తళుక్కున మెరిసి విరిసినట్లనిపించింది. ఒక దీర్ఘనిశ్వాసం అతని హృదయకుహరంనుండి వెలువడి ఆ అంధకారంలో కలిసిపోయింది. అది చాలు. ఆ ఆశతో యింకా వెయ్యేండ్లు జీవించగలననే ధైర్యం కలిగింది అతనికి.

"ఎప్పటికైనా మంచిరోజులు రాకపోతాయా?"

మళ్ళీ గేటుతలుపు కిఱ్ఱుమంది. అతను ఉత్సాహంతో లోపలికివెళ్ళి బీరువాతలుపు తీశాడు. అందులో కలాలూ, కుంచెలూ, రంగులూ సచేతనంగా, సవిలాసంగా అతని కండ్లఎదుట సాక్షాత్కరించినై. వెనుక తాను చిత్రించిన చిత్రాలూ, వ్రాసిన పద్యాలూ స్పృహకువచ్చి శరీరం పుల్కరించింది. వెంటనే ఒక కాగితమూ, పెన్సిలూ తీసుకుని లైటు పెద్దదిచేసి ఒక చిత్రం ప్రారంభించాడు. ఒక అరగంటసేపు బాహ్య ప్రపంచ స్థితిని విస్మరించి చిత్రం పూర్తిచేసి క్రింద ఆ చిత్రగతభావానుగుణంగా ఒక పద్యం వ్రాసి పైన 'ఆశాకిరణం' అని వ్రాశాడు. కాని ఏమిటో వెనుకటి చిత్రాలలోని కళావిశిష్టత దీనిలో కనుపించటంలేదు. విస్మృతకళాజీవితానికి ఛాయామాత్రాలైన కొన్ని చిహ్నాలుమాత్రం అందులో స్ఫురిస్తున్నాయి.

అతను దాన్ని తిరిగి బీరువాలో భద్రపఱచి తలుపువేసి ఎంతో భారంగా మరో నిట్టూర్పు విడిచి మెల్లిగావెళ్ళి అక్కడే ఉన్న పడకకుర్చీలో మేను వాల్చాడు. ఆ రాత్రి మైమఱచి నిద్రించాడు.

తెల్లవారితే మళ్లీ మామూలేగా! అబ్బ, ఆ స్నేహితుడు మళ్లీ ఎప్పుడు వస్తాడో!

---

# ఇండియా కేంద్ర ప్రభుత్వము - యూనియన్ అధ్యక్షుడు

శ్రీ చావలి వెంకటహనుమంతరావు

స్వతంత్ర భారత యూనియన్ రాజ్యాంగ ప్రణాళిక త్వరలో సిద్ధమగు అవకాశములు కన్పించుచున్నవి. చిత్తు ప్రణాళికను పరిశీలించి దానిని అవసరమగు మార్పులతో ఆమోదించుటకు రాజ్యాంగ పరిషత్తు త్వరలో కూడనున్నది. ఈ జూన్ నెలాఖరు నాటికి ఈ పని పూర్తియగునని తలంపవచ్చును. ప్రణాళికలో ఏర్పాటుకాబడిన కేంద్ర అధ్యక్షుని పదవిని, కేంద్ర మంత్రి వర్గమును గురించి ఈ వ్యాసములో చర్చించెదము.

మన దేశపు అధ్యక్షుని పదవి, అధికారములు ఇతర దేశముల అధ్యక్షపదవితోను, అధికారములతోను పోల్చి చూచిన కొన్ని ముఖ్యమగు భేదములు కన్పట్టును. అమెరికా దేశపు అధ్యక్షుని ఎన్నికలో మొదట రాష్ట్ర ప్రతినిధులు కూడి ఒక్కొక్క రాష్ట్రమునుండి తమకు ఇష్టమగువానిని నిర్ణయించుకొందురు. అన్ని రాష్ట్రముల వోట్లను తరువాత సమన్వయించి మెజారిటీ ఏ అభ్యర్థికి వచ్చిన అతడు ఎన్నుకొనబడినట్లు ప్రకటించుట జరుగును. మరికొన్ని దేశములందు ప్రజలు డైరెక్టుగా తమ వోట్లనిలన, అనగా అధిక సంఖ్య వోట్లు ఎవరికి వచ్చిన వారిని ఆ పదవికి ఎన్నుకొందురు. మన దేశములో ఈ రెండు పద్ధతులు కాక వేరొక విధానమును రాజ్యాంగ సభ కమిటీ వారు ఆమోదించిరి. ఫెడరల్ శాసన సభలోని రెండు సభల మెంబర్లును, వివిధ రాష్ట్రశాసన సభల మెంబర్లును కలిసి ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ పద్ధతిపై అధ్యక్షుని ఎన్నుకొందురు. ఇది కొంత కష్టతరమగు పద్ధతిగా కన్పించినప్పటికిని నిజముగా ఆచరణయందంత కష్టముండకూడదు. ఎన్నుకోవలసిన స్థానము ఒక్కటే యగుటవలనను, ఎక్కువమంది పోటీచేయువారుండక పోవుటచేతను వోట్లు లెక్కించుట సులువుగానే యుండును.

## అధ్యక్షుని ఎన్నిక

అధ్యక్షుని ఎన్నికకు నిల్చుటకు కొన్ని షరతులు కలవు. ఆపదవికి అభ్యర్థించువారు 35 సంవత్సరములకు పైగా వయస్సు కల్గియుండి, ఫెడరల్ పార్లమెంటులో కాని, ఏ ఇతర శాసనసభలో కాని సభ్యులుగా నుండకూడదు. అధ్యక్షుడుగా నున్నంతకాలము ఏ ఇతర జీతము, రాబడి గల ఉద్యోగముకాని అతడు స్వీకరించరాదు. ఒకసారి ఎన్నుకోబడిన తరువాత 5 సంవత్సరముల పాటు ఆ పదవీపీఠము నలంకరింపవచ్చును. కాని మరల ఇంకొకసారి మాత్రమే ఆ పదవికి నిలువబడవచ్చును. అనగా రెండుసార్లకన్న ఎక్కువసార్లు ఒకే అభ్యర్థి నిలువబడుట నిషేధించబడును. ఈ విధముగ రెండుసార్లకన్న అధ్యక్షపదవికి ఎవరుకాని నిలువబడకూడదను నిబంధన చాలా ముఖ్యమైనది. అమెరికాలో ఇట్టి చట్టనిబంధన చాలకాలమునుండి లేకపోయినప్పటికిని రూజువెల్టు చరిత్రలో నాల్గవసారి అధ్యక్షుడుగా ఎన్నుకొనబడినప్పుడు రెండుసార్లకన్న అధ్యక్షపదవికి వ్యక్తులు ఎన్నుకోబడకూడదని ఆదేశపు రాజ్యాంగ చట్టమునందు సవరణ ఏర్పాటుచేయబడెను. దాని ఉద్దేశ్యము ఒకే సభ్యుడు ఒక ఖాయాపు ప్రభుత్వోద్యోగివలె అనేక సంవత్సరములు అధ్యక్షపదవికొరకు ఆశించకుండను, గుత్తకు పుచ్చుకొనకుండను చేయుటయే. ఒకసారి ఎన్నుకోబడినతరువాత అతనిపై ఒక నేరముమోపి విచారణజరిపి, దానిఫలితముగ కాని అతని నా పదవినుండి తొలగించుటకు వీలులేదు. కేంద్రశాసనసభలోని ఏ సభయందు కాని అట్టి నేరము మోపుచు తీర్మానము ప్రతిపాదింపబడి, ఆ తీర్మానము శాసనసభలోని ఐదింటిలో రెండువంతుల సభ్యులచే ఆమోదింపబడవలెను. రాజ్యాంగ చట్టమునకు గాని, దానిలోని ప్రధానసూత్రములకు గాని వ్యతిరేకముగా వ్యవహరించినవానినికాని, నిరో

ధించినాడని కాని ఈఛార్జికి కారణముగా నుండవలెను. అనగా అట్టినిరోధనకు తప్ప ఏ యితర కారణములకుగాని అధ్యక్షుని పదవినుండి తొలగింపు అసంభవమన్నమాట.

మన రాజ్యాంగ సభాసభ్యుల అభిప్రాయము దేశ పరిపాలనకు సంబంధించిన నిజాధికారము శాసన సభకును, దానికి బాధ్యత కల్గియుండు కేంద్ర మంత్రివర్గమునకు మాత్రమే ఈయవలెనని. కాని అధ్యక్షుని ఒక బొమ్మగా చేసి కూర్చోబెట్టుటకూడ వారి ఉద్దేశ్యము కాదు. వారి రిపోర్టులో ఈ విధముగ వ్రాయబడి యున్నది: "మేము అధ్యక్షునికి గొప్ప పరిపాలనాధికారముల నేమియు ఈయలేదు. కాని ఆ పదవిని గొప్ప గౌరవము కలదిగను, అధికారము కలదిగను మాత్రము చేసితిమి. మన అధ్యక్షుడు మన దేశపు గొప్పతనమునకు, ఔన్నత్యమునకు ప్రధాన చిహ్నముగా నుండును". ఈ సూత్రము ననుసరించియే ప్రభుత్వము చేయు ప్రతికార్యమును అధ్యక్షుని పేరుమీదుగనే జరుపబడునట్లు నిర్ణయింపబడినది. అన్ని గతుల సైన్య శాఖలపైనకూడ సర్వాధ్యక్షత, సర్వాధికారము అతని యందే ఇమిడియుండును. శిక్షితులను క్షమించుట, మామూలు కోర్టులు, సైనికకోర్టులు విధించిన శిక్షలను తగ్గించుట, మార్చుట, తొలగించుట, మరణశిక్షను తగ్గించుట, మార్చుట—ఈ ప్రత్యేకాధికారములన్నియు అధ్యక్షుడు కల్గియుండును.

## ఆర్డినెన్సులను చేయు అధికారము

అధ్యక్షునికి ప్రత్యేకావసరమునుబట్టి ఆర్డినెన్సులను చేయుటకుకూడ అధికార ముండును. కాని ఈ అధికారము పార్లమెంటు విశ్రాంతిసమయములందు మాత్రమే చెలామణియగును. ౧౯౩౫ సం. ఇండియా ప్రభుత్వచట్టముక్రింద గవర్నరుజనరలుకు, గవర్నరులకు ఈయబడిన ఆర్డినెన్సుబనాయించు అధికారము అనేక సార్లు అనేకసమయములలో విమర్శకులోనయినది. కాని వ్రాతమూలకమగు రాజ్యాంగవిధానములలో ఇట్టి అధికారము ప్రభుత్వకార్యనిర్వాహక సర్వాధికారుల కుండుట అవసరమే. పార్లమెంటు సమావేశము కాని సమయాలలో ఏదైన అత్యవసరమగునట్టియు, తొందరగానట్టియు పరిస్థితు లేర్పడిన వాటి నెదుర్కొనుటకు కావలసిన అధికారములు ప్రభుత్వమున కుండినగాని దేశక్షేమమునకు నష్టము రావచ్చును. అట్టి పరిస్థితులలో తగిన రక్షణమార్గములక్రింద ఆర్డినెన్సులను చేయుటకు అధికారము అధ్యక్షునికిచ్చుట సమంజసమే. రాజకీయ చట్టనిర్మాణసభవారి ప్రణాళికప్రకారము అధ్యక్షునిచే ప్రకటింపబడిన ఆర్డినెన్సు ఆరువారములలోగా శాసన సభముందు పెట్టబడి దాని ఆమోదమును పొందవలసి యున్నది. అదియుకాక ఆర్డినెన్సుప్రయోగమునుచేయు అధికారము అధ్యక్షుడు తన మంత్రివర్గపు సలహాపైననే చెలాయించవలెను. రాజ్యాంగచట్టనిర్మాణసభలో మాట్లాడుచు పండిత నెహ్రూ 'ప్రజలచే ఎన్నుకోబడిన ఏ ప్రెసిడెంటుకాని తన కీయబడిన ఆర్డినెన్సు ప్రయోగాధికారములను ప్రజాహితేతర కార్యములకుగాని, తన స్వంత అధికారము నెక్కువ చేసుకొనుటకుగాని ఉపయోగించబోడని తమ అభిప్రాయమును సూచించి యున్నారు. డబ్బు, ఖజానా, ఆర్థికవిషయములకు సంబంధించిన బిల్లులు కాక ఇతర బిల్లులను కొంతకాలము వరకు అవసరమునుబట్టి ఆపుచేయుటకును, వాటిని పునర్విమర్శనకు శాసనసభవారి ముందరికి తిరిగిపంపుటకును కూడ అధ్యక్షుని కధికార ముండును.

ఆతనికి ఈయబడిన అధికారములనుబట్టి చూచిన ఇండియన్ ప్రెసిడెంటు ప్రపంచమందలి ఇతరదేశముల ప్రెసిడెంటులకంటె ఒక విధమైన ప్రత్యేకస్థానము నాక్రమించునని స్పష్టమగును. అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రెసిడెంటువలె ముఖ్యాధికారులను వేయుటకు తీయుటకు, శాసనసభకు చట్టములనుపంపి సలహా నిచ్చుచు సందేశములను పంపుటకు, శాసనసభవారామోదించిన చట్టములను నిరాకరించుటకు అతనికి అధికారములుండవు. ఈవిషయములలో అమెరికన్ అధ్యక్షుడు ఏ యితర దేశపుఅధ్యక్షుడుకాని కల్గియుండనట్టి అధికారములను చెలాయించగల్గియున్నాడు. ఇండియన్ ప్రెసిడెంటు పైన చెప్పినట్లు అమెరికాదేశపు అధ్యక్షునికన్న తక్కువ అధికారమునే కల్గియుండునప్పటికిని, ఇంగ్లండు దేశపు రాజుకంటెను, ఫ్రెంచిదేశపు అధ్యక్షునికన్నను ఎక్కువ అధికారములనే చలాయించగల్గియుండును. "ఇంగ్లండుదేశపు రాజు రాజ్యముచేయును కాని పరిపాలించడు" అను సూత్రము అందరికి తెలిసినదే. ఫ్రెంచి అధ్యక్షుడు పరిపాలించను పరిపాలించడు; రాజ్యము చేయను చేయడు. ఇండియా అధ్యక్షుడు ఒక విధముగ ఫ్రెంచి అమెరికన్ అధ్యక్షులకు మధ్యస్థాన మాక్రమించునని చెప్పవచ్చును. కొన్నికొన్ని సందర్భములలో ఆర్డినెన్సులను చేయుటకు, కొన్నిరకముల చిత్తు బిల్లులను ఆపుదల చేయుటకు కోర్టుశిక్షితులను క్షమించుటకుతప్ప ఇతరవిషయము లన్నిటియందును ఇండియా

అధ్యక్షుడు తన అధికారమును మంత్రివర్గమువారి ద్వారా, వారి సలహాపైననే ఆచరణయందుంచగలిగి యుండును. ఏది ఎట్లున్నను దేశముకొరకై పాటుబడి, పేరుప్రతిష్ఠలు సంపాదించిన ఒక గొప్ప వ్యక్తి అధ్యక్ష పదవికి ఎన్నుకోబడిన అతడు మన దేశపు రాజ్యాంగ చట్టమును సరియైన, చట్టసమ్మతమైన దారులందు నడిపి, దేశకీర్తిని, గౌరవమును పెంపొందించుటకు, మన దేశస్వాతంత్ర్యమును చిరస్థాయిగ నిలబెట్టుటకును అత్యంత సహాయకారిగా నుండునని తలంపవచ్చును. మన దేశములో ప్రజాస్వామ్యపద్ధతి అక్రమమార్గములు త్రొక్కకుండ సరియగు, సూటియగు మార్గములలో నడచి ప్రపంచమునకు ఆదర్శముగ నుండుటకుకూడ ఇండియా అధ్యక్షులు తోడ్పడగలరు. ఆ ఉన్నతపదవికి అన్నివిధముల తగియుండువారిని మాత్రమే ఎన్నుకొనుట మన దేశప్రజలయొక్కయు, శాసనసభ్యులయొక్కయు విధి యని వేరుగ చెప్పనక్కరలేదు.

## ఉపాధ్యక్ష పదవి

ఇండియా రాజ్యాంగ విధానములో ఉపాధ్యక్ష పదవికి కూడ అవకాశ మేర్పాటుచేయబడినది. ఉపాధ్యక్షుడు అధ్యక్షుని వలెకాక యూనియన్ పార్లమెంటు సభలోని సభ్యులచేమాత్రమే ప్రపోర్షనల్ రిప్రజంటేషన్ పద్ధతిని ఎన్నుకోబడి ౫ సంవత్సరములవరకు ఆ పదవియందుండ వచ్చును. ఎన్నికకు పూర్వము అతడు ఫెడరల్ పార్లమెంటునందు సభ్యుడుగా నున్నయెడల ఆ సభ్యత్వమును ఎన్నిక అయినతరువాత వదులుకొనవలసియుండును. మామూలుగ ఉపాధ్యక్షుని పని పార్లమెంటులో ఒక శాఖయగు కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుసభ సమావేశములందు అధ్యక్షత వహించుట; కాని ప్రెసిడెంటు మధ్యకాలములో చనిపోవుటకాని, రాజీనామానిచ్చుటకాని, పదవినుండి తొలగింపబడుటకాని జరిగిన ఉపాధ్యక్షుడు అధ్యక్షుని స్థానమాక్రమించును. ఈ పద్ధతి అమెరికా దేశ రాజ్యాంగవిధానములోని సూత్రముల ఆధారముపై ఏర్పాటు చేయబడినది.

## ఫెడరల్ మంత్రివర్గము

ఫెడరల్ అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు కాక ఇండియా ప్రభుత్వపు నిర్వహణకై ఫెడరల్ మంత్రివర్గము ఒక ప్రధానమంత్రి నాయకత్వముక్రింద ఏర్పాటు చేయబడును. ప్రధానమంత్రిగానుండువాడు ఫెడరల్ పార్లమెంటులో అధికసంఖ్యాకులుగా నున్న పక్షము వారి నాయకుడుగా నుండి ప్రెసిడెంటుచే ఆ పదవికి నియమింపబడును. తక్కిన మంత్రులందరును ప్రధానమంత్రిసలహాపై ప్రెసిడెంటుచే నిర్ణయింపబడుదురు. మంత్రివర్గము ఏర్పాటులో మాత్రము మనదేశపు రాజ్యాంగవిధానము అమెరికన్ పద్ధతికి వ్యతిరేకముగను, బ్రిటిషుపద్ధతి ననుసరించియు ఏర్పాటుచేయబడినది. కాని ఒక భేద మేమన, బ్రిటనులో కాబినెట్లో సభ్యులుకానివారుకూడ ఒకొక్కప్పుడు మంత్రివర్గమున నుండుట కలదు. ఇండియారాజ్యాంగ విధానములో కాబినెట్, మంత్రివర్గము ఒక్కటిగానే యుండును. కాబినెట్లోని సభ్యులందరును ఫెడరల్ పార్లమెంటులో ఏదో ఒక సభలో సభ్యులుగా నుండవలసియున్నది; అదియుకాక మంత్రివర్గమంతయు ప్రభుత్వచర్యలన్నింటికిని సమిష్టిబాధ్యత వహించవలసియున్నది. మంత్రివర్గముపై విశ్వాసరాహిత్యతీర్మానము ఆమోదింపబడిన సమిష్టిగానే మంత్రులందరు తమ పదవులకు రాజీనామా నీయవలసియుండును.

## మంత్రివర్గపు బాధ్యతలు

ఇండియా మంత్రివర్గపు బాధ్యతలు మూడువిధములుగ నుండును. అధ్యక్షునికి అతని ప్రత్యేకాధికారముల సందర్భములో సలహానిచ్చుట, పరిపాలనావిధానమును నడుపుట, చట్టములను తయారుచేసి పార్లమెంటునందు వాటిని గెలుపొందించుట. ఈ సందర్భములో ఒక ముఖ్య ప్రశ్న ఏమన, అధ్యక్షునికి మంత్రివర్గము ఒక విషయమై ఒకవిధముగ సలహానిచ్చిన, ఆ సలహాప్రకారమే అతడు కార్యము నిర్వర్తించవలసినదేనా, లేక ఆ సలహాను త్రోసిపుచ్చవచ్చునా? రాజ్యాంగవిధానమునందు ఈప్రశ్నకు సరియగు జవాబు కనబడుట లేదు. బ్రిటన్ దేశపుపద్ధతి మనము అనుకరింపదలచుకొనిన తప్పక మంత్రివర్గపు సలహా ననుసరించియే అధ్యక్షుడు కార్యనిర్వహణ చేయవలసియుండును. కాని దీనినిబట్టి అధ్యక్షుడు నామమాత్రాధిష్టుడుగా నుండునని కాని, ఉండవలెనని కాని తలంపవలసినదిలేదు. తానుకూడ ప్రజాప్రతినిధులచే ఎన్నుకోబడినవాడు కాబట్టి అధ్యక్షపదవిని పొందినవాడుకూడ మంత్రివర్గమువలెనే ప్రజానీకముయొక్క ప్రతినిధిగ నుండవలసియుండుటచేకాక ఆ కారణముచేతనే అతని సలహాలను, ఉద్దేశ్యములను మంత్రివర్గమువారుకూడ జాగ్రత్తగ ఆలోచించి గణింపవలసియుండును. ఈ విధముగా అధ్యక్షుడును, మంత్రి

వర్గమును ఒకరిపై ఒకరు ఆధారపడి, ఒకరి పలుకోల కొకరు పాటించుచు పరిపాలనాచక్రమును ఒకిదుడుకులు లేకుండ నడుపగల్గిన దేశక్షేమమున కది ఎంతేని సహకారిగ నుండగలదు. అధ్యక్షుడును, మంత్రివర్గము వారును ఒకేపక్షమునకు చెందనివా రయినచో ఇట్టి సహకారమునకు మరింత ఎక్కువ తావుండుట కవకాశ ముండును. అమెరికాలోవలె మంత్రివర్గసభ్యులు ప్రభుత్వములో ముఖ్యోద్యోగులుగామాత్ర ముండక తమతమ పరిపాలనాశాఖలను పాలించు మంత్రులుగా నుండుటచే వారిని అధ్యక్షుడు తేలికగ చూచుటకు వీలుండదు. అమెరికాలో కాబినెట్ సభ్యులు తమ పదవులకై అధ్యక్షుని ఇష్టముపైననే ఆధారపడియుండుటచే ఎప్పుడు వారు అధ్యక్షుని మంచి అభిప్రాయమును కోల్పోవుదురో అప్పుడు పదవులనుండికూడ తొలగింపబడుదురు. ఇండియామంత్రు లట్లుగాక పార్లమెంటులోని ప్రజాప్రతినిధిసభలో వారికి మెజారిటీయున్నంతవరకు ఎవరి చేతను తొలగింపబడుటకు వీలులేని స్థానమునందుందురు.

ఇదికాక ఇండియా మంత్రివర్గమువారు ముఖ్యముగు పరిపాలన, చట్టనిర్మాణఅధికారములు, బాధ్యతలు కల్గియుందురు. పైన చెప్పినట్లుగా ప్రతిమంత్రియు తన పోర్టుఫోలియోలోని శాఖలసక్రమపరిపాలనకు బాధ్యుడుగా నుండును. దానికితోడు మంత్రివర్గమువారు ప్రజల కుపయోగించునట్టియు, పరిపాలన నిర్దిష్టముగ సాగుట కవసరమగునట్టియు చట్టములను తయారుచేయుటయును, వాటిని పార్లమెంటుచే ఆమోదింపజేయుటకును పూనుకొనవలసియుండును. వారు తమ పార్లమెంటరీ బాధ్యతలను పరిపాలనాబాధ్యతలవలెనే శాయశక్తుల కష్టపడి నిర్వర్తింపవలసియుందురు.

## రాజ్యాంగవిధానముల సమన్వయము

పైన వ్రాసినదాని పర్యవసానమేమన, ఇండియాలో ఫెడరల్ కార్యనిర్వాహక ప్రభుత్వనిర్మాణము ప్రత్యేకముగా ఏ ఇతర దేశముయొక్క పద్ధతి ననుసరించి కాని నిర్ణయింపబడలేదు. ప్రజాస్వామ్య, పార్లమెంటరీ పద్ధతుల రెండింటికి అనువర్తించునట్లును, వాటిని సమన్వయించియు ఈ విధాన మేర్పాటుచేయబడినది. అది పూర్తిగా నవీనసిద్ధాంతముల ననుసరించి కూడ ఏర్పాటుచేయబడిన దని చెప్పుటకు వీలులేదు. అన్ని రాజ్యాంగపద్ధతులలోని మంచి విషయములను తీసుకొని మన దేశ ప్రత్యేకపరిస్థితుల కనుకూలముగ నుండునట్లు వాటిని మార్చి రాజ్యాంగపరిషత్తు ఉపసంఘమువారు రాజ్యాంగచట్టపు ముసాయిదాను తయారుచేసిరి.

ఈముసాయిదాలో అధ్యక్షునికిని, మంత్రివర్గము వారికిని ఉండవలసిన సంబంధములను స్పష్టముగ నిర్ణయించకపోవుట ఒక లోటుగా కన్పించవచ్చును. ఈ సంబంధము చాలవరకు అప్పటప్పటి సందర్భములనుబట్టి సమయానుకూలముగ నిర్ణయింపబడునని తలంపవలసి యున్నది. అధ్యక్షునికిని, మంత్రివర్గమునకును అభిప్రాయభేదములు ఏర్పడిన వాటిని సమయోచితముగ సహకరించుకొనవలసిన బాధ్యత ఇరు పక్షములపైన నుండును. ఈ విషయములో రెండు రకముల లేమన— ఒకటే, అట్టి అభిప్రాయభేదములు సుప్రీముకోర్టుద్వారా పరిష్కరించుకొనవచ్చును; రెండు, సందర్భానుసారముగ ఏవిషయమును గురించియైన ఒక "కన్వెన్షన్" ఏర్పాటు చేసుకొనవచ్చును. ఇదికాక, రాజ్యాంగ చట్టమును సవరించు అధికారముకూడ ఇకముందు ఇండియా పార్లమెంటునకే సంక్రమించును కాన అవసరము వచ్చినప్పుడు ప్రజాభిప్రాయమునుబట్టి, లేక సుప్రీముకోర్టువారి నిర్ణయము ననుసరించి రాజ్యాంగచట్టమునందు సవరణలు చేసుకొనవచ్చును. మన రాజ్యాంగ పరిషత్తువారి అభిప్రాయము వీలైనంత స్థిరత్వము కలిగియుండునట్టియు, దేశప్రజలందరియొక్క గౌరవము, సహకారము చూరగొనగల్గునట్టియు కేంద్రప్రభుత్వము నేర్పాటుచేయుటయే. ఇప్పుడు దేశముముందిడ నున్న చిత్తుముసాయిదాలోని ప్రణాళిక ఈ పరిణామమునకు తోడ్పడగలదని నా నమ్మకము

# కలగూరగంప

## మయూరసింహాసనము

బ్రిటిష్ పరిపాలనకీ, మహమ్మదీయ పరిపాలనకీ ఒక విలక్షణమైన వ్యత్యాసం స్పష్టంగా అగపడుతుంది.

బ్రిటిష్‌వారు మన సంపదను ఏదోవిధంగా దోచి పట్టుకపోయి వారి దేశపోషణనిమిత్తం వినియోగించు కున్నారు. అనగా మన ఐశ్వర్యం మన తీరాల్ని దాటి అవతలికి పోయిం దన్నమాట. మహమ్మదీయ రాజుల విషయం అట్లా కాదు. వారు మన దేశంలోనే వుండి పోయి, మన ధనంతో సమస్తమైన ఐహికభోగాలూ పూర్తిగా అనుభవించి, కళలను పోషించి, మన సొమ్ము మనకే తిరిగి జాగీర్ల రూపకంగా బహూకరిస్తూ వచ్చారు. ఒక్క దమ్మిడీ నైనా మన సొమ్ము దేశం దాటిపోలేదు.

మహమ్మదీయుల కళాపోషణ ఉచ్ఛస్థితిని అందుకొన్న ప్రతి ముఖ్యఘట్టాల్లో షాజహాను కాలం నాటి 'మయూరసింహాసనం' ఒకటి.

ఈ నెమలిసింహాసనం పేరు తల్చుకుంటే ఇప్పటికీ వళ్ళు గగుర్పొడుస్తుంది.

అసలు అక్బరుచక్రవర్తి తన కాలంనాడు అందరినీ మించిన ధనాఢ్యుడని పేరుగాంచాడు. అతని మనుమడైన షాజహాను తాతను మించినవాడయాడు. అపరకుబేరుడైన షాజహాను తన యావత్తు ధనసంచయాన్నీ ఆగ్రా పట్నంలో రెండు గొప్ప నేలమాళిగలు త్రవ్వించి వాటిలో దాచివుంచినట్టు చెప్పుకొనేవారు.

కళాప్రియుడైన షాజహానుకి ఒక దివ్యమైన ఉద్దేశం కలిగింది: అపూర్వమైందీ, అమూల్యమయిందీ, తనకూ భారతదేశానికీ ఖ్యాతి చేకూర్చేదీ ఒక సింహాసనం నిర్మించాలీ అని. చక్రవర్తి కన్న కలల ఫలమే ఈ మయూరసింహాసనం.

కలిచాడు పాదుషా. ఆజ్ఞాపించాడు. వచ్చి పడ్డాయి వజ్రాదులు. రతనాల నాణెం మెరిగిన కోశాధికారి బేబాదల్‌ఖాను వచ్చి చూచాడు. యాభై వేల 'మిస్కాల్' బరువు గలిగి, ఎనభై ఆరు లక్షల విలువ చేసే రాళ్లను ఎంచి తీశాడు.

ఈ నవరత్నాలతోబాటు లక్ష తులాలకు మించిన బంగారంచేర్పుతో మయూరసింహాసనం నిర్మితమైనట్టు చెపుతున్నారు చరిత్రకారులు. లోపలి భాగం యావత్తూ స్ఫటికమువంటి కింగాణీగాజుతో చెక్కడము. పై టపారము నవరత్నఖచితము. టపారాన్ని నిలిపెట్టడానికి ఆధారంగా మణులతో చెక్కిన పన్నెండు బంగారు స్తంభాలు. ఒక్కొక్క స్తంభంమీద రత్నాలు పొదిగిన రెండేసి నెమళ్లు. ఈ రెండేసి మయూరములకు మధ్య ఒక్కొక్క చెట్టు. చెట్టు అంటే సామాన్యమైందా! వజ్రాలతో, రత్నాలతో, పచ్చలతో, ముత్యాలతో శోభాయమానంగా ప్రకాశిస్తావుండేవి.

ఇక—సింహాసనం ఎక్కేందుకు మూడు మెట్లు ఉన్నాయి. వీటికి ఒత్తుగా రత్నాలు తాపడం చేశారు. సింహాసనానికి నలువైపులా నాలుగు ఫలకములు అతికించారు. వీటిల్లో షాజహాన్ చక్రవర్తి చేరు లానుకొనే ఫలకం ఒక్కటే పదిలక్షలు చేస్తుంది. ఈ సింహాసనానికి ఉపయోగించిన నవరత్నాలలో ఒక్క గోమేధికం మాత్రం లక్ష మించినదని చెబుతారు.

ప్రత్యేకించి ఈ గోమేధికాన్ని గురించి కొంత చరిత్ర వున్నది: ఇది మొదట్లో షాఅబ్బాస్‌ది. అతని దగ్గరనుండి ఇది జంబిల్‌బేగ్‌కు సంక్రమించింది. అతడు ఈ గోమేధికాన్ని జహంగీర్‌కి బహూకరించాడు. కనుక అది జహంగీర్ కుమారుడైన షాజహాన్ చేతికి

చిక్కింది. అమూల్యమైన ఈ గోమేధికానికి షాజహాను సార్థక్యము చేకూర్చాడు.

అతడు దక్కను యుద్ధాల్లో విజయం కాంచి వంతుకు చిహ్నంగా మయూరసింహాసనాన్ని నిర్మించి, దానిలో ఈ గోమేధికానికి ప్రముఖస్థాన మిచ్చి వున్నాడు.

మరొక చిత్రం ఏమిటంటే: ఈ గోమేధికం మీద సాహెబ్‌కిరన్ తైమూర్, మీర్జాషారూఖ్, ఉలూఫ్ బేగ్, షా అబ్బాస్, జహాంగీర్‌ల పేర్లు, చిట్ట చివర షాజహాన్ నామధేయము వరుసన లిఖితమై వున్నాయి.

ఫ్రెంచిదేశపు వజ్రాలవర్తకుడు టవెర్నియర్ ౧౬౬౫ లో ఈ సింహాసనాన్ని పరీక్షించడం తటస్థించింది. అతడు ఈ అపూర్వ సృష్టిని కాంచి దిగ్భ్రాంతుచెందాడు. అసలు ఈ సింహాసననిర్మాణానికి ప్రాతిపదిక అయిన ఉద్దేశము, దీని మలామాకు వెచ్చించిన బంగారపువిలువ, ఆ బంగారంలో రాళ్ళు పొదిగిన తీరు, తెన్ను, అమరిక, ఆ చెక్కడాలు, నగిషీలు—ఇవన్నీ చూచి నిర్విణ్ణుడయ్యాడు.

అదేకాలంలో మయూరసింహాసనాన్ని పరిశీలించిన బెర్నియర్ అనే పరిశోధకుడు ఒక చిత్రం చెప్పాడు:

“ఇది మిక్కిలి నేర్పు గల పరాసుశిల్పియొక్క పని. (అతడు ‘లాగేంజ్’ ప్రాంతనివాసి అని ఇస్లా దివ్వాను తెలియవచ్చింది.) అతడు యూరపురాజులు చాలమందికి కృత్రిమవజ్రా లిచ్చి, మోసపుచ్చి వారిని దోచివేశాడు. అతని అదృష్టం ఫలించి మొఘలాయి దర్బారులో ఆశ్రయం లభించింది. మయూరసింహాసన నిర్మాణానికి అతడు నియమింపబడ్డాడు.”

ఈ మయూరసింహాసనాన్ని నిర్మించడానికి నూరులక్షల రూపాయలకు తక్కువకాని మొత్తం వెచ్చించాడు షాజహాన్‌చక్రవర్తి. నిర్మాణానికి నిండు ఏడుసంవత్సరాల కాలం పట్టింది. ౧౬౩౫ లో సంవత్సరాదిపండుగనాడు గొప్ప ఉత్సవం జరుగుతూ వుంటే ప్రప్రథమంగా సుల్తాను ఈ మయూర సింహాసనాన్ని అధిష్ఠించాడు.

తర్వాత మయూరసింహాసనాన్ని ఆగ్రా పాదుషాదర్బారులో ప్రతిష్ఠాపన చేశారు. దాదాపు పదహారుసంవత్సరాలపిమ్మట దానిని ఢిల్లీ పురికి కొనిపోయి ‘షామహల్’లో పెట్టారు. ఢిల్లీలో దానిని షాజహాను తరువాతి చక్రవర్తులు ప్రత్యేకసందర్భాలలో వాడుక చేస్తూ వుండేవారు.

ఒక శతాబ్దం గడిచినతర్వాత, అంటే, ౧౭౩౯లో నాదిర్‌షా హిందూదేశంపైకి దండెత్తివచ్చి, ఈ మయూరసింహాసనాన్ని—మరి ఆరు సింహాసనాలతో పాటు—కొల్లగొట్టి పారశీకదేశానికి తోలుకు పోయాడు. అతడు ఆ సింహాసనపు పనివాడితనానికి మిక్కిలి అచ్చెరువంది, తాను తిరిగివచ్చినప్పుడు తన ఆస్థానశిల్పులచేత మరొక నకలు సింహాసనాన్ని సృష్టింపజేశాడు.

ఈ సందర్భంలో మయూరసింహాసనంయొక్క ఉత్తరచరిత్ర యావత్తూ అగమ్యంలో పడిపోయింది.

కర్జన్‌ప్రభువు గొప్పగొప్ప పరిశోధనలు సల్పి, కనిపెట్టినటువంటి మహత్తరవిషయం: ‘షాజహాను కాలంలో నిర్మితమైన మయూరసింహాసనం తాలూకు జాడ లేశ కానరావడం లేదు’ అని.

ఇందుకనుగుణించి మరొక పరిశోధన ఇలా ప్రచారంలో వున్నది:

“శిథిలావస్థలో ఉన్న మయూరసింహాసనం షాజహాన్ మనుమడు షారుఖ్ దగ్గర ఉన్నట్లు వినికిడి. శిథిలములయిన భాగములను చేర్చి నూతనఫక్కీలో సింహాసనమును పునర్నిర్మాణము చేసివున్నారు. అది ఇప్పటికీ టెహరాన్ భవనపు చిత్రవస్తుప్రదర్శనశాలలో ఉన్నది.”

అటువంటి చరిత్రప్రసిద్ధమైన మయూరసింహాసనం దివ్యమైనటువంటి రాజభవనాన్ని అలంకరించి వుండేది. ఆ సింహాసనం భవనానికి ఒక గొప్ప వెలుగు నిచ్చింది. మయూరసింహాసనంలో పొదిగిన వజ్రాల్లో ఒకటి అమూల్యమైనదీ, ప్రపంచఖ్యాతి చెందినదీనూ.

ఆ వస్త్రాన్ని కాపాడటంకోసమే మొగల్ రాజభవనానికి కట్టుదిట్టమైన ఏర్పాట్లు జరిగిన వనటం అతిశయోక్తి కాదు.

షాజహాన్ చక్రవర్తి ఆ మయూరసింహాసనంపైన ఆసీనుడై వున్నప్పుడు దర్బారు కలకల్లాడుతూ కనువిందుగా వుండేది. ఆ దృశ్యం చూడని నేత్రాలు నేత్రాలే కావు.

అటువంటి సింహాసనాన్ని కాపాడడానికి బ్రహ్మాండమైన భవనం. ఆ భవనాన్ని పరిరక్షించడానికి సాయుధపాణులైన భటులు అహోరాత్రాలు కావలా.

ఈనాడు, వైభవోపేతమైన ఆ సింహాసనాన్ని చూదామంటే కంటికి కనపడదు. ఆ ప్రదేశమున నిర్మానుష్యమైన ఒక చలువరాతి మండపంమాత్రం గోచరిస్తుంది.

మొగలాయీచక్రవర్తుల కీర్తిని ప్రతిబింబించే ఆ మయూరసింహాసనం మటుమాయమైంది. కాని, సింహాసనాన్ని బరిణెలో పెట్టి దాచినట్టు కాపాడుకూ వచ్చిన ఆ భవనంమాత్రం నేటికీ చెక్కుచెదరక నిలచివున్నది.

ముద్దా సోమప్పశాస్త్రి

---

## అశ్వినీ దేవతలు

అశ్వినులు దేవవైద్యులని యన్ని పురాతన గ్రంథములందును గలదు. వీరి పేట నక్షత్రము లున్నమాట నిజమేగాని అవి వారి యనంతరము వారి పేరిట పెట్టుకొనిన జ్ఞాపకచిహ్నములే నని గుర్తింపవలెను. అశ్వినులు నాటి దేవప్రజాసమూహమునకు, అనగా ప్రాచీనార్యజాతికి వైద్యులుగాను, ఓడలతో వ్యాపారము చేయువారుగాను ఉండి ప్రజాసేవ చేయుచుండిరి. ఆట్లు ఋగ్వేదమున నీ క్రింది దృష్టాంతములు గనబడుచున్నవి. వీరు పశువైద్యము గూడ చేయుచుండిరి.

(౧) శయు డను ఋషియొక్క గోవు ఈనలేని స్థితిలో నుండగా, దాని నీనునట్లు చేసి సాయపడిరి.

(౨) రేభుడు, వందను డను ఋషులను రాక్షసులు బావిలో బడద్రోయగా వారిని రక్షించిరి.

(౩) ఇట్లే భుజ్యుడు, అంతకు డనువారలను గూడ రక్షించిరి.

(౪) పరావృజు డను ఋషికి కాళ్లు పోగా, నూతనముగ నిర్మించిరి.

(౫) ఋజ్రాశ్వ డనువానికి అంధత్వము రాగా, వానికి కన్నులు బాగుచేసి దృష్టి వచ్చునట్లు చేసిరి.

(౬) ఖేలుని భార్యయగు విశ్పలా యనునతికి యుద్ధమునందు కాళ్లు విరిగిపోగా, లోహపు కాళ్ళ నేర్పరిచిరి.

(౭) కణ్వపుత్రుడను త్రిశోకుని గోవులను రాక్షసు లపహరింపగా గొని తెచ్చియిచ్చిరి.

(౮) వేనపుత్రుడగు పృథుమహారాజునకు మంచి గుఱ్ఱముల నిచ్చి పేరందిరి.

(౯) అత్రి ఋషిని రక్కసులు గొంపోయి యొక యంత్రగృహమున బడవేసి వేధించుచుండగా, వానిని చెరనుండి విడిపించిరి.

(౧౦) శయుడు, శర్యుడు, శర్యాతుడు డను వారలకు కావలసిన సాయము లిచ్చిరి.

(౧౧) విమదుని భార్యను, భుజ్యుని, అత్రిని, ఋతస్తుభను, సుభరను, కుత్సుని, కుర్వీతిని, దభీతిని, ధ్వసంతిని, పురుషంతిని, చ్యవనుని రక్షించిరి. అనగా వీరందరికిని వైద్యసహాయము నొసగి వారి బాధలను తొలగొట్టి రనవచ్చును. ఇంకను భుజ్యుడు సముద్రమున నోడలోనుండి మునిగిపోవుచున్నపుడు వీరు కాపాడిరట. చ్యవనునకు నూత్న యౌవనము వచ్చునట్లొనర్చిరి.

(౧౨) కక్షీవంతు డనువాని కూతురగు ఘోషయను నామె కుష్ఠరోగిగా నుండగా నా రోగమును కుదిర్చిరి.

(౧౩) నృషదుని కుమారుడు చెవుడుచే బాధపడుచుండగా, దానిని మాన్పిరి.

(౧౪) కణ్వఋషి కన్నులు కానరాకుండగా, బాగుచేసి దృష్టి వచ్చునట్లు చేసిరి.

(౧౫) వేదు డను రాజును శత్రువులు యుద్ధమున బాధించునపుడు వానిని రక్షించిరి.

ఈ దృష్టాంతములనుబట్టి యశ్వినులు శరీరధారు లైన పూర్వకాలపు దేవజాతి యనబడు నరులలో బుట్టి పేరొందినవా రైనట్లు స్పష్టము. కాని యీ కార్యములు మొదటి యశ్విను లిరువురే చేసి రనజాలము. వారి సంతతివారంతయును కొన్నాళ్ళవరకును అశ్విను లనియే పిలువబడుచుండినట్లు గ్రహించినచో కాల వ్యత్యాసము లేకుండబోవును. ఏలన, పైన నుడివిన వారందరును ఒకేకాలపు మానవు లనుటకు వీలు లేదు.

ఈ యశ్వినులు మొట్టమొదట కంచరగాడిదలపై నెక్కి తిరుగుచుండిరి. తర్వాత ఋభువు లను వడ్రంగులు వీరి కొరకు రథమును జేసి బహూకరింపగా, దానిపై సూర్యాంది తిరుగుచువచ్చిరి. ఈ రథమునకు క్రమముగా ఎద్దులు, గుఱ్ఱములు, మెంఢ్యు సైతము కట్టబడుచుండినట్లుగూడ కొన్ని ఋక్కులలో గలదు. సముద్రముపై ప్రయాణము చేసి, తర్వాత రథ మెక్కి యాకాలపు ప్రజలకు సాయపడుటకై వీరు వచ్చుచున్నట్లు కొన్ని ఋక్కులు పలుకుచున్నవి. అందువల్ల వీరు మన దేశపు సరిహద్దులుగూడ దాటి యితర చోట్లకుగూడ పోవుచున్నట్లు తెలియుచున్నది. ఒక్కొక్కసారి వీరు పరస్పరవిరోధిజంతువులను ఎద్దులు, మెంఢ్యు. గుఱ్ఱములు బూన్చిన రథ మెక్కి వచ్చుచున్నట్లుగూడ చెప్పబడినది.

ఇన్ని దృష్టాంతములతో విలసిల్లుచున్న ఈ యశ్వినీదేవతలు కేవలము నక్షత్రములే యని తలచి వారి పూర్వేతిహాసచరిత్రలను విస్మరించుట దోష మగును. ఋగ్వేదము ౧ వ మండలములోని ౧౬ వ అనువాకము ౧౧౨ మొదలు ౧౧౬ వరకు గల సూక్తములు పైవిషయములను తెలుపును.

కొత్త భావయ్య చౌదరి.

---

## డ్రైపాయింట్ ఎచింగ్ చిత్రకళ

చిత్రలేఖనంలో రేఖాచిత్రణంనుంచి తైలవర్ణ చిత్రంవాకా గల అనేక విధాలయిన చిత్రణవిధాల్లో 'డ్రైపాయింట్ ఎచింగ్' (Dry-point Etching) అనే విధానం ఒక ప్రత్యేక శిల్పవిశేషమూ, కళా ప్రతిభా కూడి ఉన్న గొప్పకళ. ఇటువంటి ఈ చిత్రణ విధానం మనదేశానికి కొత్తదైనా పాశ్చాత్య దేశాలలో మాత్రం మంచి మన్నన సంపాదించుకొని ఉన్నది.



'ఎచ్చింగ్' అంటే సామాన్యంగా రాగిరేకు మీద ఉక్కుసూదితో ఏదో చిత్రాన్ని చెక్కడము. ఆ చెక్కడంలో రేకుమీద మైనంపూసి, మామూలు సూదితో చిత్రాన్ని రేకకు గీసి, ఆమ్లద్రావకాలతో కడిగి రేకుమీద ఆచిత్రం హత్తుకొనేటట్లు చేస్తారు. ఇది మామూలు ఎచింగ్ విధానము. ఈ రీతిని ఆమ్ల ద్రావకాలు, మైనము ఉపయోగించకుండా, వట్టి రేకు మీదనే గట్టి ఉక్కుమొనతో బొమ్మ చెక్కడాన్ని 'డ్రైపాయింట్ ఎచింగ్' (అంటే పొడిమొనతో లోహంపైన చిత్రం చెక్కువిధానం) అని అంటారు. ఈ విధంగా రాగిరేకుమీద బొమ్మచిత్రించిన వెనుక, మషీర్ణం ఆ రేకుకు అలమి, బొమ్మకాగితం మీదికి ఆచిత్రాన్ని అద్దుతారు. రంగులచిత్రాలు తీయవలసివచ్చినప్పుడుకూడా ఆయారంగులను ఒక్కొక్కచోట రాగిరేకుమీద కావలసినచోట జాగ్రత్తగా పులిమి, ఒక్కొక్కరంగుతో ఒక్కొక్కసారిగా కాగితంమీదికి ఆచిత్రాన్ని అద్దుతారు. ఈవిధంగా రంగుల

చిత్రాన్ని కాగితంమీదికి కెక్కటంలో చాలాచాలా నైపుణ్యమూ, కళాపాండిత్యమూకూడా కావలసి ఉంటాయి.

ఈవిధానంలో ఫ్రెడరిక్ ఇ. హాల్పర్న్ అను ఆయన సిద్ధహస్తుడు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచినవాడు. దాదాపు ఇరవైయేండ్లనుంచి ఈయన డ్రైపాయింట్ ఎచింగ్ చిత్రాలు యూరపుఖండంలోని అనేక పెద్ద పెద్ద కళాక్షేత్రాలలో ప్రదర్శింపబడుతూ ఉన్నవి. లండను రాయల్ అకాడమీ వంటి ఉత్తమచిత్రకళా ప్రదర్శనశాలలో ఈచిత్రాలు గొప్పపేరు తెచ్చుకొన్నవి. పారిస్, లగ్జంబర్గువంటి మ్యూజియముల లోనూ, వియన్నా, ఆంస్టర్డాం మొదలయినచోట్ల సుప్రసిద్ధమైన ఆర్టుగ్యాలరీలలోనూ ఇతనిచిత్రాలు స్థానంసంపాదించుకొన్నవి.

ఇతను ౧౯౦౯లో ఆస్ట్రియా యందు జన్మించినాడు. ౧౭ ఏండ్లు వచ్చేసరికే గొప్ప చిత్రకారునిపు డుకుగా పేరు తెచ్చుకొని బహుమానాలు, సన్మానాలూ అందుకోగలిగినాడు.

ఇతను అంబోతుల పోరాటాలను అనితరసాధారణమైన నేర్పుతో చిత్రింపగలడు. ఇతని చిత్రాలలో జీవసంచలనమూ, సునిశిత్వతా చాలా నిర్దిష్టమై ఉంటున్నందువల్లనే ఇతనికి కళాప్రపంచంలో గొప్ప పేరువచ్చింది. ఈనాడు అంబోతుల పోరాటంలాంటి ఘట్టాలను ఎచింగ్ చిత్రాలలో గీయుగలవార్లలో ఇతన్నే ప్రప్రథముడని గణిస్తారు.

హాల్పెర్నుకు ప్రపంచపర్యటన మంటే చాలా సరదా. కొత్తకొత్త విషయాలతో, కొత్తకొత్తప్రకృతి ఘట్టాలను పరిశీలించి చిత్రించే ఉబలాటంతో ఈయన ప్రపంచంమారుమూలలూ తిరుగుతుంటాడు. చిత్రకారుడుగా వృత్తిచేపట్టుకొన్నవెనుక ౨౨ ఏండ్లలోనూ ౧౫ ఏండ్లు ప్రపంచపర్యటనంలోనే కాలంగడుపుతూ వచ్చినాడు. ఆఫ్రికాలో అడవిమయమైన మధ్యఖండం, తూర్పు ఆఫ్రికాలంకూడ తిరిగినాడు. బెల్జియం, కాంగో, ఇటూరి అడవుల్లోనిపిగ్మీలు (హ్రస్వాంగులు), మస్సై ఆ[...]కా రువాండా అడవుల్లోని రాక్షసులు [...]టువికజాతులంటారి మధ్యా స్వయంగా తిరిగి [...]చ్చినాడు.

ఇప్పుడు ఈ భూప్రదక్షిణకు తన ఆశయసిద్ధికై మధ్యప్రాచ్యంనుంచి భూప్రదక్షిణానికి బయలుదేరి పాలస్తీనా, ట్రాన్స్‌జోర్డాన్, సిరియా, ఇరాక్, పర్షియా, ఇండియాలవరకుగల • దేశాలమధ్యనుండి ప్రయాణం సాగించుకొంటూనే వచ్చినాడు. దారి పొడుగునా అనేక ఎచింగ్ చిత్రాలు గీసుకొంటూ వచ్చినాడు. ఆచిత్రాలను చూచి ఆయాదేశాలప్రజలు చాలాహర్షించినారు. అనేకప్రదర్శనలు ఏర్పాటు చేసినారు. దేశంలో చాలామంది సంస్థానాధీశులు ఈయనను ప్రత్యేకాహ్వానాలతో పిలిపించి, సత్కరించి, ఈయనచిత్రాలను చాలావాటిని తమ ప్రదర్శనశాలలకై కొన్నారు.

ఈయనచిత్రాలలోని విశేషాలూ, ఆ చిత్ర విధానంలోని మెలకువలూ ఈసంచికలో స్థలాంతరావ ముద్రితమైన చిత్రాలు చక్కని నిదర్శనాలుగా ఉన్నవి.





అమెరికాలో విమానాల వాడకం సర్వసామాన్యమై పోయింది. వ్యవసాయదార్లూ, పశువులకాపర్లూ కూడ తమ నిత్యకృత్యాలకు విమానాలను విశేషంగా వాడుతున్నారు. ఒక భూమికామందు విమానంమీదే తన వ్యవసాయికావసరాలకు ప్రయాణం సాగిస్తూ, పొలందగ్గరదిగి, కొట్టాగోదలను చూసుకొంటూ, పొలాన్ని తనిఖీచేసి, పొరుగువారితో ఏవో వ్యవసాయికవిషయాలు ముచ్చటిస్తున్న దృశ్యం ఈ చిత్రంలో చూడవచ్చు.



# విమర్శనము



## కుందమాల

ఆంధ్రీకర్త: బులుసు వేంకటేశ్వరులు గారు, బి. ఏ., రామారావుపేట, కాకినాడ. వెల ౩ రూ.

ఇది ఆఱంకముల నాటకము. దిఙ్నాగుని సంస్కృతకృతి కిది ఆంధ్రీకరణము. దిఙ్నాగుని వాగ్వైఖరి రమణీయమైనది. కాళిదాసునిచే బరిహసింపబడిన స్థూలహస్తావలేపనములు మన కీనాటకము చూచినపుడు కనిపింపవు. కాని, యిందలి రమణీయార్థప్రతిపాదకము లగు శ్లోకరత్నములను గాంచినపుడు మాత్రము కాళిదాసుడు స్మరణకు రాకమానడు. ఈతని శయ్య యట్టిది. శ్రీ వేంకటేశ్వరులుగారి ఈ కుందమాలాంధ్రీకరణమును భాషాసుందరమైనది; ప్రౌఢమైనది. మాతృకలోని యందచందములు పరివర్తనములో నేమియు గోలుపడలేదు. పైగా, మూలమున కనుగుణమైన పరివర్తనమున ధారాశుద్ధిసంశోభితమైన రచనముచే బహుళమననీయముగా కృతియన్నలైన శ్రీ వేంకటేశ్వరులుగారు మిక్కిలి ప్రశంసార్హులు.

మ. స.

* * *

## త్యాగరాజ కీర్తనలు

(సవ్యాఖ్యానము)

సంపాదకులు: విస్సా అప్పారావుగారు. ప్రకాశకులు: ఆంధ్ర గానకళా పరిషత్తు, రాజమహేంద్రవరము. వ్యాఖ్యాత: కల్లూరి వీరభద్రశాస్త్రిగారు.

రసాయనశాస్త్రం మొదలైనవాటిల్లో ఉన్నత పరిశోధనలు చేసేవారికి జర్మనీభాష రావాలని ఉంది. అలాగే కర్నాటకసంగీతంలో పాండిత్యం సంపాదించడానికి తెలుగుభాష తెలిసిఉండాలనికూడ నేడు గుర్తింపబడింది. తెలుగుభాషకు ఇట్టి గౌరవస్థానం లభింపజేసింది త్యాగరాజు. కనుక ఆంధ్రగానకళాపరిషత్తువారు మొట్టమొదటగా చేయదగినది, చేసినది త్యాగరాజకీర్తనల ప్రచురణ. ఆంధ్ర గానకళా పరిషత్తువారి మద్రాసుకమిటే "శ్రీ త్యాగరాజస్వామికీర్తనల పాఠమును శుద్ధపరచి పాఠభేదముల నిచ్చి కీర్తనల నచ్చువేయుటయున్ను, ఉపనిషత్తులు, గీత, రామాయణము మొదలగు గ్రంథములగాథలతో పోల్చుచు కీర్తనల విశేషార్థములను సులభశైలిని తెనుగున వ్రాయించుటయున్ను" తీర్మానించి శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి గారి కీపని ఒప్పగించినట్లు 'తొలిపలుకు'లో చెప్పబడింది. పర్యవసానంగా ఈ ఉత్తమగ్రంథం వెలువడింది. ఇంతకు పూర్వం శ్రీ కె. వి. శ్రీనివాస అయ్యంగారు త్యాగరాయకీర్తనలు ౩౦౦ సేకరించి, సంస్కరించి "శ్రీ త్యాగరాజహృదయము" అనే పేరున ప్రకటించియున్నారు. నేడు ఆంధ్రగానకళాపరిషత్తువారు ఈ గ్రంథంలో ౬౧౦ కన్న ఎక్కువ కీర్తనలు ప్రచురించినారు. ప్రతికీర్తనకూ ముందు ఆ కీర్తన రాగము, తాళము, మేళకర్తసంఖ్య ఇవ్వబడినవి. గ్రంథారంభంలో కీర్తనల అకారాది పట్టిక ఇవ్వబడినది. సంగీతభాగంలో ఈ గ్రంథంలో ఇంతకన్న చేసింది లేదు; చేసేందుకు ఉద్దేశింపబడినట్లుకూడ ఎక్కడా తెల్పబడలేదు. పైగా వ్యాఖ్యాత త్యాగరాజు జీవితచరిత్ర తెల్పుతూ ఇలా వ్రాసియున్నారు:

"ఎంతటివారికిని కృతికొక్క పాఠమునకు సరియైన స్వరము వ్రాయుట దుర్లభము. గమకములతో, సంగతులతో, రాగభావముతో నిండిన కృతులకు స్వరములు, అనుస్వరములు గుర్తించి సరిగా వ్రాయుట సాధ్యముకానిపని. అందుచేత సంగీతము యథామాత్రకముగా ఉండవలె నన్న గురువువద్ద అభ్యసనపద్ధతిని పరంపరగా నేర్చుకొనవలెను."

ఈ వ్యాఖ్యానములో త్యాగరాయ కీర్తనల అర్థము, తాత్పర్యము తేటతెలుగున వ్రాయబడినవి. వాటిలోని సాహిత్యపు సొబగులు, లౌకిక, నైతిక, ఆధ్యాత్మికవిషయములు సప్రమాణముగను, సమగ్రముగను వెలువరింపబడినవి. త్యాగరాజకీర్తన లీవిధముగ గ్రంథస్థమగుట మిక్కిలి అవసరము. ఈ గ్రంథం రచించి

శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారును, ప్రచురించి ఆంధ్ర గానకళాపరిషత్తువారును తెలుగుభాషకూ, ప్రజలకూ నిజమైన సేవ చేసినారు.

డిమ్మీఆక్టావో సైజున ఇంచుమించు ౨౦౦ పేజీ లున్న ఈ పుస్తకంవెల సాధారణ బైండుకు రు. ౧౦ లు; కాలికో బైండుకు రు. ౧౨ లు. వలయు వారు విస్సా అప్పారావుగారు, ౧/౧౩ శ్రీపురం వీథి, రాయపేట, మద్రాసు అనిగాని, ఆంధ్రగానకళా పరిషత్తు, రాజమహేంద్రవరం అనిగాని వ్రాయవలెను.

* * *

## గాంధి చరిత్రము

రచయిత: కోమాండూరి శఠకోపాచార్యులు గారు. ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘము, బెజవాడ. వెల రూ. ౨-౪-౦.

ఇదివరకటి రెండు ముద్రణములలోను చేరని దరిమిలా విషయములుకూడ ఈ తృతీయ ముద్రణములో ఆచార్యులవారు చేర్చియున్నందున గాంధీగారి సమగ్ర జీవితచరిత్ర ఇందులో లభ్యమగుచున్నది. వట్టి జీవిత చరిత్ర మాత్రమే కాక గాంధీతత్వపరామర్శకూడ సందర్భోచితముగా చేయబడియున్నందున ఇది ఉభయోపయోగకారిగా నున్నది. గ్రాంథిక వ్యావహారిక సమన్వయపద్ధతిలో వ్రాసిన భాషయందలనుగా పండిత పామరుల నుభయులను మనస్సులో పెట్టుకొని ఆచార్యులవారీగ్రంథమును రచించినట్లున్నది.

* * *

## జ్వాల-జన్మదిన సంచిక

కర్నూలునుండి జాతీయవారపత్రికగా సంవత్సరమునుండి వెలువడుచున్న 'జ్వాల' జన్మదిన ప్రత్యేక సంచిక యిది. వెల రూ. ౧-౪-౦.

కొత్తప్రయత్నమైనను, హంగులు తక్కువగా నున్నను వెలయినంతమట్టుకు ఈ సంచిక చక్కగానే తయారైన దనవచ్చును. సంపాదకుల ఉత్సాహ బలముతో మున్ముందీపత్రిక యింకను చక్కని సంచికలను ప్రకటించగలదనుట కిది ఆశ కల్పించుచున్నది.

# గ్రంథ స్వీకారము

## ఆంధ్రశబ్దతత్త్వము - క్రియాప్రకరణము

పునర్ముద్రణము. రచయిత: [illegible] దారు శేషగిరిశాస్త్రిగారు. ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండు బ్రదర్సు, ౪, మల్లికేశ్వర స్వామిగుడి సందు, లింగిచెట్టివీథి, మద్రాసు. వెల రూ. ౧-౮-౦

* * *

## పరమసాధన

రచయిత: బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు. ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి. వెల ౧౨ అ.

* * *

## కొత్త పత్రికలు

తెలుగువెలుగు—సంపాదకుడు: జి. వి. రఘువాచార్యులుగారు. కార్యస్థానము: ౧ రాజరత్నంవీథి, కీల్పాకు, మద్రాసు ౧౦. వినోదకాలక్షేపాదుల కుద్దేశింపబడిన మాసపత్రిక ఇది. సంవత్సర చందా ౩ రూ. విడిపత్రిక ౩ అ.

విలాసిని—పేరులోనే సూచితమైయున్నవి ఈ మాసపత్రిక ఉద్దేశ్యములు. సంపాదకుడు: ము. శ్రీ. దొడ్డభూచార్యులుగారు, రాజమహేంద్రవరము. సంవత్సర చందా ౩ రూ. విడిపత్రిక ౪ అ.

నటన—వివిధరంగములలోని యాథార్థ్యమును, నటనావిశేషములను, ప్రబోధములను ప్రకటించు ఉద్దేశ్యముతో వెలువడిన మాసపత్రిక ఇది. సంపాదకుడు: యం. యస్. రామాచారిగారు. కార్యస్థానము: ౧/౬౨ శ్రీనివాస పెరుమాళ్ సన్నిధివీథి, రాయపేట, మద్రాసు. సంవత్సర చందా ౫ రూ. విడిపత్రిక ౬ అ.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G T., Madras. Editor—S. Sambhu Prasad.